పది మందీ, పది కాలాలపాటు
జ్ఞాపకం ఉంచుకొనే విధంగా
ఈ నాటక ప్రదర్శనను విజయవంతం చేసిన

**విద్యార్థినీ విద్యార్థులకు—**
**సాంకేతిక వర్గానికి—**
**సహ అధ్యాపక బృందానికి—**

# డాక్టర్ మొదలి నాగభూషణశర్మ

## ఇతర రచనలు

**తెలుగులో విమర్శన గ్రంథాలు**

తెలుగు సాహిత్యం : గాంధీజీ ప్రభావం

నాటకకర్త చిలకమర్తి

తెలుగు నవలావికాసం

(సం.) నూరేళ్ళ తెలుగు నాటకరంగం

(సం.) నాట్యకళ : తెలుగు నాటక శతజయంతి సంచిక

(సం.) ఆచార్య ఆత్రేయ

**పుస్తకరూపంలో వచ్చిన నాటకాలు**

విషాదాంతం

రాజా ఈడిపస్

మన్మథుడు మళ్ళీ పుట్టాడు

**ఆంగ్లంలో విమర్శనగ్రంథాలు**

The Master and the Disciple

(Ed.) The Flute and the Drum : Essays on Sarojini Naidu

Bellary Raghava : Prince of Players

The Shadow Puppet Theatre of Andhra Pradesh

Acharya Atreya

# గ్రీకు నాటక రంగం

## గ్రీకు నాగరికత

క్రీస్తుకు పూర్వం 6, 5 శతాబ్దాల్లో మధ్యధరా సముద్ర తూర్పు తీర ప్రాంతంలోని గ్రీసు, ఏగియన్ దీవులు, ఆసియా మైనర్ తీరంలో ఉన్న ఇతర నగరాలలో రూపొందిన గ్రీకు నాగరికతకు పాశ్చాత్య సంస్కృతీ చరిత్రలో ఒక విశిష్టమైన స్థానం వుంది. చరిత్ర, రాజనీతి శాస్త్రాలకు శ్రీకారం చుట్టబడ్డది గ్రీకు నాగరికత రూపుదిద్దుకుంటున్న తొలి దినాల్లోనే! ఒకవైపు తత్త్వశాస్త్రంలోను, మరోవైపు శిల్ప, గృహ నిర్మాణ శాస్త్రాల్లోను తరతరాల వారికి మార్గదర్శకాలైన సిద్ధాంతాలను వెలువరించిన ఖ్యాతి కూడా యీ నాగరికతదే! అలానే సృజనాత్మక కళారంగంలో — ముఖ్యంగా నాటకరంగంలో - అటు సిద్ధాంతాలను, లక్షణాలను రూపొందించుకోవడంలోను, ఇటు ఆ సిద్ధాంతాలకు మూల రూపాలైన లక్ష్యాలను సృష్టించుకోవడంలోను ఆనాటి గ్రీసు దేశం మహోత్కృష్టమైన విజయాలను సాధించింది. అరిస్టాటిల్ ''కావ్య శాస్త్రం'', గ్రీకు నాటక త్రిమూర్తులుగా ప్రఖ్యాతి వహించిన ఎస్కిలస్, సొఫోక్లిస్, యురిపిడీస్ వ్రాసిన విషాద నాటకాలను యీ లక్షణ లక్ష్యాలకు ఉదాహరణలుగా మనం చెప్పుకోవచ్చు.

ఆనాటి గ్రీసు దేశంలో ఏ నగరానికి ఆ నగరం సర్వ స్వతంత్ర రాజ్యం. ప్రజలే ఆ యా ప్రభుత్వాధినేతలను ఎన్నుకోవడం కూడా అప్పుడే మొదలైంది. ఈ ''నగరరాజ్యా''లకు తలమానికమైనది ఏథెన్స్‌నగరం. క్రీ.పూ. ఐదో శతాబ్దంలో ఆ నగరంలో మొలకలెత్తి మహావృక్షాలవలె విస్తరించిన వేదాంత, తత్త్వ శాస్త్రాలు, శిల్ప, వాస్తు, నాటక కళా ఖండాలు ఆనాటి నుంచి యీనాటి వరకు పాశ్చాత్య దేశాల సంస్కృతీ విభవానికి గీటురాళ్లుగా వుంటూనే వున్నాయి.

ఏథెన్స్‌నగరం సాధించిన యీ విజయాల వెనక ఆనాటి గ్రీసుదేశ పరిస్థితుల ప్రభావం ఎంతో వుంది. క్రీ.పూ. 490-479 మధ్యకాలంలో అప్పటికి బలహీనంగా ఉండి, ఐక్యమత్యంలేని పేదదేశమైన గ్రీస్-బలవంతమూ, ఐశ్వర్యమంతమూ అయిన పర్షియా దేశపు మహాసైన్యాన్ని ఓడించి తిప్పికొట్టింది. ఈ విజయం గ్రీకు ప్రజల్లో ఒక నూతనోత్సాహాన్ని, కొత్త ధైర్యాన్ని యిచ్చింది. రాజకీయంగా యుద్ధ భూమిలో

సాధించిన విజయం గ్రీసు దేశవాసులు, ముఖ్యంగా ఏథెన్స్ నగరవాసులు, తమ దైనందిన జీవన విధానాలలో కూడా సాధించడానికి వాళ్ళను ఉత్తేజితుల్ని చేసింది.

ఆనాడు ఏథెన్స్‌లో అమలులోవున్న ప్రభుత్వ విధానం ఇలా ప్రజల్ని దైనందిన జీవితంలో భాగస్వామ్యుల్ని చేయడానికి అనుగుణంగా వుంది. ఏథెన్స్ ప్రజాస్వామ్య నగరం. ప్రపంచ చరిత్రలో - కనీసం పాశ్చాత్య ప్రపంచ చరిత్రలో - మనకు తెలిసిన మొదటి ప్రజాస్వామ్యం యిదే! నగర పాలనలోని అన్ని రంగాలలోను ప్రజల భాగస్వామ్యం ఉండి తీరాలి - తమ ప్రతినిధుల ద్వారా కాదు; ప్రతి ఒక్కరూ ఆ పరిపాలనా వ్యవహారాలలో భాగం పంచుకోవడంద్వారా. ఉదాహరణకు రాజ్యాన్ని పాలించే ప్రభువు, సేనాధిపతులు - అందరూ ప్రజల చేత ఎన్నుకోబడిన వారే! ఏ రంగానికి చెందిన వ్యక్తులైనా పరిపాలకులుగా ఎన్నుకోబడడం ఆనాటి ఏథెన్స్‌లో సర్వ సామాన్యంగా జరిగేది. ఎస్కిలస్ నౌకా యుద్ధంలో పాల్గొనడం, సొఫోక్లిస్ సేనాధిపతిగా ఎన్నుకోబడడం ఇందుకు ఉదాహరణలు మాత్రమే!

ప్రజలంతా పాల్గొనే "నగర సభలు" కాని, వారు ప్రభువులను నేరుగా ఎన్నుకునే పద్ధతి కాని ఏథెన్స్‌వంటి చిన్న చిన్న దేశాలలోనే సాధ్యం. అయినా, "నగర సభ"లలో ప్రతి ఒక్క పౌరుడూ పాల్గొనగలగడం, దేశ పరిపాలనలో నేరుగా తనకూ ఒక ముఖ్యమైన బాధ్యత ఉందని భావించగలగడం - ఆనాటి ప్రజాస్వామ్యం విజయానికి ఓ ఉదాహరణ. అదే విధంగా న్యాయస్థానాల్లో స్వయంగా వాదించుకోగలగడం, ఉత్సవాల్లో జరిగే క్రీడల పోటీల్లో - ఆయా వృత్తుల్లో దిట్టలయిన వారితో పోటీపడి - ఒక్కొక్కసారి నెగ్గడం - మొదలైన క్రియాత్మక కార్యక్రమాలను గమనిస్తే ప్రతి పౌరుడూ "దైనందిన జీవితంలోని వివిధ కార్యకలాపాలలో పాల్గొనాలి. తన స్వయంశక్తితో రాణించాలి, ఆ పోటీల్లో విజయం సాధించాలి" అన్న తపనతో, దీక్షతో ఆయా రంగాలలో పనిచేసేవారని తెలుస్తున్నది. ఈ తపన, యీ దీక్ష ఆనాటి గ్రీకు ప్రజల్లో - అందులోనూ ఏథెన్స్ ప్రజల్లో - ఉండడంవల్లనే శాస్త్ర, కళా రంగాల్లో అంతటి ఉత్తమ సృష్టి సాధ్యమయిందని చెప్పకోవాలి.

## గ్రీకు నాటక ఆవిర్భావం

### డయొనిసస్ ఉత్సవాలు : "కర్మకాండ" సిద్ధాంతం (ritual theory)

ఆనాడు గ్రీకు నగరాల్లో జరిగే అనేక మతపరమైన ఉత్సవాల్లో డయొనిసస్ ఉత్సవాలు ముఖ్యమైనవి. ఈ ఉత్సవాలలో డయొనిసస్‌ను కీర్తిస్తూ చేసే బృందగానాలే గ్రీకు నాటకానికి తొలి రూపాలని ఒక వాదం. గిల్బర్ట్ ముర్రే అనే ఆంగ్ల

విమర్శకుడు ప్రారంభించిన యీ వాదం ఎన్నో మార్పులు, చేర్పులు కూర్చుకుని ఒక సిద్ధాంతంగా రూపొందింది. దీన్ని ''కర్మకాండ (ritual theory) సిద్ధాంతం'' అనవచ్చు.

ప్రతి సంవత్సరం డెమెటర్, డయొనిసస్ దేవుళ్ళకి జరిగే నిత్యోత్సవాల్లో కర్మకాండలకి చాలా బలీయమైన స్థానం ఉండేది. ఇవి జరిగే వసంత, శీతాకాలాలు సస్యదేవత మరణ, పునరుత్థానాలకు సూచకాలు కనక జరిగే కర్మకాండ అంతా యీ రెంటికీ సంబంధించి ఉండేవి. పవిత్రీకరణం, ఆయా దేవుళ్ళను ప్రతిష్ఠాపిస్తూ చేసే రహస్య కర్మకాండ - ఇవి తొలి దినాల్లో ముఖ్యమైన ఉత్సవ లక్షణాలు. రానురాను ఈ దేవుళ్ళకు ఉరేగింపులు జరపడం, ఆ ఉరేగింపుల్లో దేవతాగాథల్ని దీక్షాపరులైన పురోహితులు దృశ్య గాథలుగా ప్రదర్శించడం మొదలైంది. ఇవే గ్రీకు విషాద నాటకాలకు తొలి రూపం అని కొందరి విశ్వాసం.

కాని మరికొంత ముందుకుపోయి చూస్తే యీ డయొనిసస్ ఉత్సవాల్లో ఉండే నాటకీయ లక్షణాలు యింకా గోచరిస్తాయి. నిజానికి డయొనిసస్‌కు, దృశ్య వినోద రూపాలకు సంబంధం ఖచ్చితంగా తెలియకపోయినా ఇంకా ఏ యితర దేవుడి కొలుపులకీ లేనంత గాన, నాట్య వినోదాలు డయొనిసస్ ఉత్సవాల్లో ఉండేవనడం మాత్రం నిర్వివాదం.

డయొనిసస్ గ్రీకుల "వసంతుడు". పచ్చని పంట పొలాలకు - ప్రకృతికీ అది సంతరించిపెట్టే ఫలపుష్పాదులకు వాటినుంచి వచ్చే మద్యానికి - ఆయన అధినాయకుడు. వీని అన్నింటి సమ్మిశ్రరూపం వినోదం కావడంవల్ల కాబోలు ఆయన ఉత్సవాల్లో బృందగానాలకు ఎంతో ప్రాముఖ్యం వుండేది. 50 మందిగాయకులు దేవతాగృహం ముందు ఎత్తయిన వేదికమీద కూర్చుని (రాను రాను నిలబడి, ఇంకా తరువాత నాట్యంచేస్తూ) డయొనిసస్ జీవిత ఘట్టాలను గానం చేసేవారు. డయొనిసస్ జనన మరణాల సూచకంగా జరిగే యీ వుత్సవాలు (Fertility rites) వసంత, శీతాకాలాల్లో జరిగేవి. ఆ ఉత్సవాల్లో పాల్గొనే బృందగాయకులను ''కోరస్'' అనేవారు. ''కోరస్" శబ్దానికి గ్రీకు భాషలో ''నృత్యం'' అనే అర్థం; ''గానం" అని కాదు. ('కోరియోగ్రఫీ' అనే మాట యీ అర్థంలో వాడేదే!) కాని రాను రాను నృత్యరూపం తక్కువైపోయి, గానం ఎక్కువ కావడంవల్ల ''కోరస్'' సాంకేతిక పదంగా రూపొంది "నృత్యంతోకూడిన గానం'' అనీ, ఆ తరువాత 'బృందగానం' అనే అర్థంలోనూ స్థిరపడిపోయింది. ఈ బృందం గానం చేసే గీతికలను ''డిథిరాంబ్స్" అంటారు. పూజా విధానంలో భాగంగా జరిగే యీ బృందగానాలు దేవతాగృహం ఎదురుగా

ఆరుబయట ప్రత్యేకంగా నిర్మించిన గుండ్రని వేదికమీద జరిగేవి. దీనిని ''ఆర్కెస్ట్రా'' అంటారు. గ్రీకు రంగస్థలానికి ప్రాథమిక రూపం యీ ''ఆర్కెస్ట్రా.''

ఈ విధంగా ఆడుతూ, పాటలుపాడి దేవుళ్ళని కీర్తించే కర్మకాండ విధానం ఎన్నో మత ఉత్సవాల్లో ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలోను కనిపిస్తుంది. అయితే, యీ గానం, యీ నాట్యం విషాద నాటకంగా రూపొందడం ఒక్క ఏథెన్స్‌లోనే జరిగింది. ఈ మార్పు ఏ ఏ దశల్లో ఏవిధంగా జరిగిందో తెలుసుకోవడానికి ప్రత్యక్ష ఆధారాలు లేకపోయినా, ఊహించే అవకాశాలు ఉన్నాయి.

ఈ బృందగాయకులు తమ ప్రత్యేక అస్తిత్వం నుంచి దూరమై, తమనుతాము పవిత్రీకరించుకొని యీ ఉత్సవ కర్మకాండలో పాల్గొనవలసి రావడంతో తమ తాదాత్మ్యతను వ్యక్తిత్వాన్ని మరుగుపరచడానికి ముఖవేష్టనం (కరాళం, mask) అవసరమైంది. ఇలా డిథిరాంబ్‌లు పాడే యాభై మంది బృంద గాయకులు కూడా కరాళాలు ధరించే వారు. కేవలం డయొనిసస్ కీర్తిగానం చెయ్యడం నుంచి ఆయా దేవుళ్ళ లీలలను గానం చెయ్యడం, దానినుంచి ఆ లీలలను కథా గాన రూపంలో ఆడుతూ, పాడే దశకు చేరుకున్నాయి బృందగానాలు. కరాళాలు (మాస్క్స్) ధరించిన గాయక బృందానికి ప్రతిగా ఈ బృందానికి బయటనుంచి వార్తలను అందించడానికో, కథా కథనంలో పాత్రల్ని గురించి, కొత్త సంఘటనలను గురించి ప్రశ్నించేందుకో మరో కళాకారుణ్ణి (అతడూ కరాళం ధరించిన వాడే!) ప్రవేశ పెట్టడం తటస్థించింది. ఇతడు బృందంతో మొత్తంగాను, బృందనాయకుడితో ప్రత్యేకంగాను సంభాషణలు జరిపేవాడు. ఇతణ్ణి బృందగానంలో కాకుండా విడిగా ప్రవేశపెట్టడం నాటక ఆవిర్భావంలో రెండో దశగా గుర్తించవచ్చు. ఇలా గాయక బృందం నుంచి వేరుగా ఒక ''పాత్ర''ను సృష్టించిన ఘనత థెస్పిస్‌-ది. ఇది క్రీ. పూ. ఆరో శతాబ్దం చివరలో జరిగిందని ఊహ. థెస్పిస్ ఇలా నాటకావిర్భావానికి కారణ భూతుడు కావడంవల్లనే నాటకాల వాళ్ళందరినీ ''థెస్పియన్స్'' అనడం కద్దు.

ఆ తరవాత - ఐదోశతాబ్దం మొదట - ఎస్కిలస్ రెండోనటుణ్ణి ప్రవేశపెట్టడంతో కేవలం సంభాషణల రూపాన్నుంచి నాటకరూపం ఆవిర్భవించింది. ఈ దశలో కోరస్, వారి నాయకుడు, ఇద్దరు నటులు రంగస్థలంమీద ఉండేవారు. ఈ ఇద్దరు నటులూ డయొనిసస్, అతని అనుచరుడూ కావచ్చు. లేదా డయొనిసస్ కథతో సంబంధంలేని ఏ రెండు పాత్రలైనా కావచ్చు. అంటే డయొనిసస్ ఉత్సవాల్లోకూడా - డయొనిసస్ కథతో సంబంధం లేని మరోకథను నాటకరూపంలో ప్రదర్శించే అవకాశం వచ్చిందన్నమాట! ఇది మరోమార్పు!! ఈ నటద్వయానికి మూడో నటుణ్ణి జోడించి

"నాటకీయత"కు నాంది పలికినవాడు సొఫోక్లిస్. ఈ దశలో కోరస్‌కు ఇదివరకటి ప్రాముఖ్యం తగ్గి కేవలం వ్యాఖ్యానం చెయ్యడానికి మాత్రమే ఉపయోగించే నాటక భాగం అయింది.

అరిస్టాటిల్ తన "కావ్యశాస్త్రం"లో విషాదనాటకం డిథిరాంబ్-బృందగానాల నుంచి వచ్చిందని పేర్కొన్నాడు. ఈ రెంటికీ ఉండే సమాన లక్షణాలవల్ల యిది సంభవం అనే అనిపిస్తుంది. ముఖ్యంగా ఈ బృందగానాలు కీర్తించే-సస్యదేవుడు మరణించడం, తిరిగి జన్మించడం అనే ఋతువుల మార్పులను చెప్పే కర్మకాండలకు వ్యక్తీకరణలయినట్టే - 5వ శతాబ్దంలోని విషాదనాటకాలు కూడా నాటక నాయకుడి జననం, అతని ఉచ్ఛదశ, తరువాత అతని దైన్యబాధామయ జీవిత చిత్రణ, ఆ తరువాత అతని మరణం - ఈ దశలను చిత్రించాయి.

మార్గరెట్ బీబర్ ఈ కర్మకాండ సిద్ధాంతాన్ని బలపరుస్తూ డయొనిసస్ ఉత్సవ కర్మకాండకు, విషాదనాటక ఆవిర్భావానికి నాలుగు ముఖ్యమైన సంబంధిత కారణాలను సూచించింది.

ఎల్స్ (Else) ప్రతిపాదించిన కళాత్మక సిద్ధాంతం (Atristic theory) :

గెరాల్డ్ ఎల్స్ అనే నాటక విమర్శకుడు కర్మకాండ సిద్ధాంతానికి విరుద్ధంగా మరో సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఆయన ప్రతిపాదనలో ముఖ్యవిషయం - సస్యదేవత కర్మకాండలో బృందగానాలకు ఎంతటి ప్రాముఖ్యం వున్నా, ఆ బృందగానాల నుంచే నాటకం ఆవిర్భవించడానికి అవకాశం వున్నా, అనేక దేశాల్లో బృందగానాలు ఇటువంటి సందర్భాలలోనే తమ గానాన్ని వినిపిస్తున్నా - ఒక్క ఏథెన్స్‌లో మాత్రమే ఈ బృందగానాల ప్రదర్శనలు విషాదనాటక ప్రదర్శనలుగా మారడానికి కారణం ఏమిటి - అన్న ప్రశ్న. రెండోది - విషాదనాటకాల కథావస్తువు, పాత్రలను గురించి. అయిదో శతాబ్దంలో వచ్చిన చాలా కొద్ది విషాదనాటకాలలో మాత్రమే డయొనిసస్ ప్రసక్తి కాని, అతనివంటి యితర దేవుళ్ల ప్రసక్తి కాని ఉన్న విషయం. చాలా నాటకాలకు మూలం డయొనిసస్ దేవుడిగా గుర్తింపు పొందడానికి ముందుగానే (క్రీ.పూ. 7వ శతాబ్దానికి ముందు) ప్రాచుర్యంలో ఉండి హోమర్ సృష్టించిన, లేదా గ్రంథస్థంచేసినపురాగాథాలే(myths)! ఇందులో పాత్రలు కూడా ఆ పురాగాథల్లోని పాత్రలే! పైగా, ఈ పాత్రలేవీ దేవతా పాత్రలు కావు; కనీసం వారిని పోలికూడా వుండవు. అంతేకాదు; దైవత్వం లేని పాత్రలు; ఆదర్శవంతమైన మానవ నాయకత్వానికి ప్రతీకలు యీ పాత్రలు. ఎల్స్ దృష్ట్యా ఆరవ, ఐదవ శతాబ్దాల ఏథెన్స్‌కు యీ రకం

ఆదర్శప్రాయులైన నాయకుల చిత్రణ అత్యావశ్యకం. ఆనాటి ఆదర్శాలను నాయక లక్షణాలను యీనాటి ప్రజలు తమ ఆదర్శాలుగా స్వీకరించవలసిన అవసరం ఉంది. అందుకోసం ఆనాటి హోమర్ కావ్యాల కావ్యగానం, ఆ తరువాత ఆ కావ్య నాయకులే నాయకులుగా రూపొందిన కొత్త నాటకరూప ఆవిర్భావం జరిగాయి.

ఈ కథాగానం నుంచి వచ్చిన ప్రాథమిక నాటక రూపాన్ని పురా నాటకం (**Protodrama**) అంటాడు ఎల్స్. మొదటి నటుడిని ప్రవేశపెట్టడం ద్వారా ఒక నాయకుడు తన బాధలను కోరస్‌తో పంచుకోవడం జరిగింది. ఆ దశలో నాయకుడి గాథ - అతడి దృష్ట్యా - "స్వయం చిత్రణ" (**Self Presentations**) రూపంలో జరిగింది. ఎస్కిలస్ ప్రవేశపెట్టిన రెండో నటుడితో పురా నాటకరూపంనుంచి-అంటే కథాగాన ప్రధానమైన తొలి రూపంనుంచి - దృశ్య రూపంగా విషాద నాటకం మార్పు చెందింది. ఈ దశలో కేవలం ఏక పాత్ర నిష్ఠమైన స్వయం చిత్రణ మాత్రమే కాక, ఆ మొత్తం గాథను స్థల, (**Place**), కాల, (**Time**) గతుల్లో విస్తృతం చెయ్యడానికి వీలైన రెండో పాత్ర ప్రవేశించింది. మూడో నటుడిని ప్రవేశపెట్టడంతో ప్రధాన పాత్ర జీవిత గాథలో నైశిత్యం, అతని బాధలకు పూర్వాపరాల చిత్రణ, దాని ఫలితం - వీటిని కూడా చిత్రించే అవకాశం కలిగింది. ఈ పరిపుష్ట దశలో విషాద నాటకం అన్ని హంగులతోనూ రూపుదిద్దుకుంది. నాయక లక్షణాలు కలిగిన ఒక పాత్ర కథగా; ఆ కథలోని పరాకాష్ట సన్నివేశానికి (అది మామూలుగా బాధా భరితమైంది) దోహదం చేసే కారణాలను దృశ్యరూపంగా వివరిస్తూ, ప్రతి సన్నివేశం (episode) అంతాన బృందగాయకుల ప్రతిస్పందనను వినిపించే సమగ్ర ఇతివృత్తంతో కూడింది విషాద నాటకం.

ఎల్స్ సూచించిన యీ ప్రగతి నాటకావిర్భావాన్ని దశలవారీగా సూచిస్తూ, కథలో అంతస్సూత్రంగా వున్న నాయకుని జీవితానికి యీ దశలవారీగా పరిపుష్టత పొందిన నాటక రూపాని (form) కి ఉన్న సంబంధాన్ని నిరూపిస్తున్నది. ఈ విధంగా విస్తృతమైన ఇతివృత్త నిర్మాణానికి కళారూప (artistic form) పరిపుష్టతకు ఉన్న అంతర్గత సంబంధాన్ని నిరూపించడం వల్ల దీనిని "కళాత్మక సిద్ధాంతం" అనవచ్చు.

ఈ సిద్ధాంతం డయొనిసస్ ఉత్సవాలకు అందులో వినిపించే బృందగానాలకు విషాద నాటకానికి ఉన్న సంబంధాన్ని, క్రమ పరిణామాన్ని గుర్తించకపోలేదు. అయితే కళాత్మక సిద్ధాంతం దృష్ట్యా - విషాద నాటక ఆవిర్భావం మరో విధంగా జరిగిందని నిరూపించబడ్డది కనుక - ఇంకా డయొనిసస్ ఉత్సవాలలోని బృందగానాలకు విషాద నాటకానికి ఉన్న సంబంధమేమిటో, ఆ సంబంధం ఉండడానికి అవకాశం వున్నదా,

ఉంటే ఆ పరస్పర సంబంధం ఎటువంటిది - అనే ప్రశ్నలకు యింకా సమాధానాలు దొరకలేదు.

## విషాద నాటకం (ట్రాజడీ)

విషాద నాటక ఆవిర్భావానికి పైన చెప్పిన రెండూ రెండు విభిన్నమైన కారణాలను సూచిస్తున్నాయి. కాని 'ట్రాజడీ' అనే మాటకు గల వ్యుత్పత్తి అర్థాన్ని గమనిస్తే విషాద నాటకం పుట్టు పూర్వోత్తరాలను గురించి మరో దృక్పథం ఎదురౌతుంది. ట్రాజడీ అనే పదం 'ట్రాగోస్' అనే మాటలోనుంచి వచ్చింది. ట్రాగోస్ అంటే మేక-అని అర్థం. మేకలను గురించిన, లేదా మేకలను మేపేవాళ్ళు పాడే, పాటలకు 'ట్రాగోస్ సాంగ్స్' అని పేరు. డయొనిసస్ ఉత్సవాల్లో యీ పాటలకు చాలా పేరుప్రఖ్యాతులుండేవి. దానికి కారణం ఇదమిద్ధమని చెప్పలేము. కాని ఇప్పటికే మేకలకి - డయోనిసస్ ఉత్సవాలకి, విషాద నాటకానికి ఉండే సంబంధం గురించి ఊహాగానాలు చేశారు పలువురు విమర్శకులు. డయొనిసస్ సేవకులంతా మేక రూపులు కావడంవల్ల బృందగానంవారు డయోనిసస్‌ను గురించి పాడేటప్పుడు మేక తోలు కప్పుకొని పాటలు పాడేవారని ఆ బృందగానం నుంచి వచ్చిన కళారూపం కనక దానికి ట్రాజడీ అనేపేరు వచ్చిందని ఒక వాదం. ఆ నాడు అడవుల్లోనుంచి మేకలు మందలు మందలుగా వచ్చి పంట పొలాలలోపడి పంటలను నాశనం చేసేవని, ఈ విపత్తునుంచి రక్షించమని వేడడానికి దేవతలకు మేక బలులను ఇచ్చేవారని, ఆ బలికి ముందు మేకను కట్టివేసి దానిచుట్టూ చేరి విషాదగీతాలు పాడేవారని అవే రానురాను బృందగానాలలో భాగం అయి, తరువాత ట్రాజడీగా రూపొందాయని మరోవాదం. అలానే, డయొనిసస్ ఉత్సవాల్లో పాల్గొనే రచయితలకు, మేకలను కానుకగా ఇచ్చే వారని, అందువల్ల ఈ మాట వచ్చిందనీ మరికొందరంటారు.

## సాటిర్ నాటకం : ట్రాజడీ

విషాదనాటకం సాటిర్ నాటక జనితమని అరిస్టాటిల్ అభిప్రాయం. "సాటిర్" అంటే అరణ్యదేవత. ఈ దేవతలు డయొనిసస్ అనుయాయులు. వీళ్ల అశ్వముఖం తోను, మానవ ఆకారంతోను, వాలంతోను ఉన్న అతి మానుషశక్తిగల దేవతలుగా చిత్రించబడ్డారు. 'సాటిర్'ల (అరణ్యదేవతల) వలె తోలుకప్పుకొని, గుర్రపు ముఖా లను ప్రదర్శిస్తూ, తోకను ఊపుతూ ఆడేపాడే బృందగాయకుల సమూహంవున్న నాట కాన్ని సాటిర్ నాటకం అంటారు. ఈ బృందనాయకుడు సిలెనస్. ఈ నాటికీ మిగిలి వున్న సాటిర్ నాటకాలు రెండే రెండు. ఒకటి సంపూర్ణంగాఉన్న "సైక్లోప్స్" అన్న

యురిపిడిస్ నాటకం, రెండోది అసంపూర్ణంగా దొరికిన "ట్రాకర్స్" అన్న సొఫోక్లిస్ నాటకం. వీటి ఆధారంగా మనం చెప్పగలిగింది - సాటిర్ నాటకం విషాదనాటక నాయకుల ఆశ్చర్యభరితమైన మానవాతీతమైన కార్యాలుకాని పురాణ గాథల్లోని నాయకుల ఘనకార్యాలను గురించిగాని చిత్రించేదిగా వుంటుంది. ఏథెన్స్‌లో జరిగే డయొనిసస్ ఉత్సవాల్లో ఈ నాటకం తప్పనిసరిగా ప్రదర్శించాలి కనక, దీనిలోని బృంద గానం పాడేవారు 'సాటిర్'ల మాదిరిగా దుస్తులు, కరాళాలు (Masks) ధరించి వుంటారు కనక దీనికీ విషాద నాటకానికీ ఉన్న సంబంధాన్ని ఊహించవచ్చు. కాని దానినుంచే విషాద నాటకం పుట్టిందన్న అరిస్టాటిల్ వాదనతో - ఇంకా ఆధారాలు దొరికేదాక మనం ఏకీభవించలేము. ఆయనకాలంనాటి ఆధారాలు యిప్పుడు లభ్యం కావడంలేదు.

## నాటక పోటీలు

గ్రీసుదేశంలో ఆనాటి మిగిలిన అన్ని రంగాలలో మాదిరిగానే డయొనిసస్ ఉత్సవ నాటకాల్లోకూడా పోటీలు వుండేవి. ముగ్గురు నాటకకర్తలు ఒక్కొక్కరు ఒక్కొక్కరోజున మూడు వేరు వేరు నాటకాలను కాని, ఒకే కథకు సంబంధించి, క్రమబద్ధంగా వ్రాయబడ్డ మూడు నాటకాలుకాని (వీటిని 'ట్రిలజీ' అంటారు) ప్రదర్శించాలి. వాని తరువాత ఒక సాటిర్ నాటకం ఉండాలి మూడు రోజులపాటు జరిగే యీ పోటీల అనంతరం - నాల్గవరోజున - ఆ నాటకకర్తలకు మొదటి, రెండవ, మూడవ బహుమతులను యిచ్చేవారు న్యాయ నిర్ణేతలు. ఈ బహుమతులు ధనరూపంలో కాక, గౌరవ పురస్కారాలుగా మాత్రమే వుండేవి - అనడానికి ఆధారాలున్నాయి. ఐవీ, ఆలివ్ కొమ్మలతో చేసిన శిరోవేష్టనలు ప్రేక్షకులందరి సమక్షాన అలంకరించడం ఇందులో ఒకభాగం. నిజమైన బహుమానం ఆ నాటకాలు చూడడానికి వచ్చే పదిహేనువేల మంది ప్రజానీకం కనబరిచే ఆదరం. ఈ బహుమతులను నటులు, బృందగాయకులు - వీరితోపాటు, ఈ నాటకానికి పెట్టుబడి పెట్టిన నిర్మాత ("కోరెగస్" అంటారు అతనిని) సమంగా పంచుకొనేవాళ్లు. ఇందరిలో జరిగే యీ ఘన సన్మానంవల్లనే కావచ్చు చాలమంది ధనికులు నాటకాలకు పెట్టుబడి పెట్టడానికి ముందుకు వచ్చేవారు. కొన్నిచోట్ల నగర ప్రభుత్వమే ఇటువంటి "కోరెగస్"ని ఎన్నికచేసేది. మిగిలిన గౌరవ పదవులకు మాదిరిగానే యీ పదవికి చాలా పోటీవుండేది; అంతటి గౌరవ ప్రపత్తులూ వుండేవి.

ఈ పోటీల్లో న్యాయ నిర్ణయం చెయ్యడానికి పది మంది న్యాయనిర్ణేతలను ఎన్నుకొనేవారు. పోటీల మొదటి రోజున వారందరినీ ప్రజలే ఎన్నిక చేసేవారు. ఎన్నుకున్న నిర్ణేతలు తాము నిష్పక్షపాతంగా వ్యవహరిస్తామని ప్రజల ముందు

ప్రమాణం చెయ్యాలి. పోటీలు చాలా తీవ్రంగా వుండడం కద్దు. క్రీ.పూ. 468 లో సోఫోక్లిస్ మొదటిసారి యీ పోటీల్లో పాల్గొన్నప్పుడు యీ పోటీ ఎంత జటిలంగా వున్నదంటే ఆ నగరానికి రక్షణ కల్పించే పది మంది సైనికాధికారుల్ని పది మంది న్యాయనిర్ణేతలుగా నియమించారు. ఆ సంవత్సరం ప్రథమ బహుమతి సొఫోక్లిస్‌కు లభించింది.

ఈ నాటక పోటీలను చూడడానికి నగరం చుట్టు ప్రక్కల నుంచి కూడా జనం వచ్చేవారు. క్రీ.పూ. ఐదవ శతాబ్దం చివరి దశాబ్దం నాటి నాటక ప్రదర్శనలు జరిగే ఆరుబయలు రంగస్థలాన్ని (ఏథెన్స్‌లోని డయొనిసస్ నాటకరంగం పునర్నిర్మింపబడిన తరువాత తిరిగి ఇప్పుడు శిథిలావస్థలోవుంది) గమనిస్తే ఆనాటి ప్రేక్షకుల సంఖ్య 14000 నుంచి 15000 వరకు వుంటుందని అంచనా. సూర్యోదయం తరువాత నాటక ప్రదర్శనలు ప్రారంభం అయ్యేవి. సాయంకాలంవరకు నడిచేవి. విషాద నాటకాల ప్రదర్శన అయిపోయాక, సాటిర్ నాటకం వుండేది. ప్రేక్షకులు యింతసేపూ అర్ధచంద్రాకారంగా - ఆర్కెస్ట్రా (బృందగానం ఆడి పాడే వలయాకార వేదిక) చుట్టూ కొండ సానువుల్ని తొలిచి కట్టిన మెట్లలాంటి సీట్ల మీద కూర్చుని నాటకాలు చూసేవారు. భోజనాలు తెచ్చుకొనేవారు. ఉదయంనుంచి సాయంకాలంవరకు ఒక పక్క డయొనిసస్ ఉత్సవాలు, మరొక పక్క నాటక ప్రదర్శనలు - ఇంకా ఒక పక్క కర్మకాండ - ఇవి నిజంగా పండగ రోజులే ఏథెన్స్ నగరవాసులకీ, చుట్టు పక్కల పల్లెల్లో వుండే జనానికి.

## రంగస్థలం : ప్రేక్షకాగారం (Stage and Auditorium)

ఏథెన్స్‌లో యీ నాటక ప్రదర్శనలు ఏక్రపోలిస్ కొండల సానువుల మీద తొలచబడ్డ డయొనిసస్ నాటకరంగం మీద జరిగేవి ఇటువంటివే రానురాను ఇతర ప్రదేశాల్లో కూడా నిర్మించబడ్డాయి. ఈ ఆరుబయలు రంగస్థలాలు తొలుత డయొనిసస్ దేవాలయానికి ముందు భాగంలో నిర్మించబడ్డాయి. మొట్టమొదటగా నిర్మితమైన భాగం ఎత్తయిన వేదిక. కొండ దిగువన సమతల ప్రదేశం మీద యీ వేదిక వుండేది. క్రీ.పూ. ఆరో శతాబ్దంనాటికి అక్కడ యింకా ప్రేక్షకాగారం నిర్మించబడలేదు. దేవాలయం, దానిముందు బృందగాయకులు గానంచేసే వేదిక (ఆర్కెస్ట్రా) మాత్రమే వుండేవి. ప్రేక్షకులు కొండ క్రమంగా ఎత్తుగా పోతున్న చోట కూర్చుండేవారు; లేదా నిలబడే వినేవారు. అప్పటికి నాటకం ప్రాథమిక రూపంలో ఉండేది. ఆ ఆర్కెస్ట్రా చుట్టూ ప్రేక్షకాగారాన్ని తరువాత (5వ శతాబ్ద ప్రారంభకాలం నాటికి) నిర్మించారు. ఆర్కెస్ట్రాకు 55 అడుగుల దూరంలో అర్ధచంద్రాకారంగా కొండరాళ్లను ఓ క్రమ

పద్ధతిలో చదును చేసి ప్రేక్షకులు కూర్చుని ప్రదర్శనలు చూసే ఏర్పాటు చేశారు. దీనిని థియాట్రాన్ (Theatron-చూసే ప్రదేశం) అంటారు. ఆర్కెస్ట్రాకి వెనక ఎటువంటి ఆచ్ఛాదనా ఉండేది కాదు.

క్రీ.పూ. ఐదో శతాబ్దంలో యీరంగస్థల కట్టడంలో చాలా మార్పులు వచ్చాయి. నటులు రంగస్థలం మీద లేనప్పుడు ప్రేక్షకులకు కనిపించకుండా వుండడానికి వెనక భాగాన ఒక ఆచ్ఛాదన అవసరమైంది. ఆ కట్టడాన్ని రంగగృహం (Stage House) అంటారు. ఆరోజుల్లోనే మొత్తం రంగస్థలం అంతా రాతికట్టడంగా మార్చబడ్డది. (ఇది పూర్తిగా అమలు జరగడం క్రీ.పూ. నాలుగో శతాబ్దానికికాని కాలేదు). రాతి ఫలకాల వరసలు కట్టబడ్డాయి. అర్ధచంద్రాకారంలో వున్న యీ ప్రేక్షకాగారం గుండ్రంగా వున్న ఆర్కెస్ట్రా చుట్టూ ఆవరించి, ఆర్కెస్ట్రా నుంచి 65 అడుగుల డయామీటర్ వరకు విస్తరించి వుంది.

కేవలం నటుల్ని కనపడకుండా వుంచడానికి కట్టబడిన రంగ గృహం రాను రాను పాత్రల ప్రవేశ నిష్క్రమణలకి, పాత్రల వేష, భూషా కరాళాల మార్పిడికి స్థానమైంది. అంటే ఇవ్వాళ్టి వేషాభూషాగృహం అన్నమాట. దీనిని స్కీన్ (Skene) అంటారు. రాను రాను ఇదే మాట ఇవ్వాళ మనం వాడే scene అయింది. ఈడిపస్ ప్రదర్శన కాలంనాటికి skene పొడుగ్గావున్న ఒక కట్టడం మాత్రమే. రాను రాను దానిని ఇరుప్రక్కలకూ పెంచి ఇవ్వాళ మనంవాడే side wings కి ఆది రూపమయిన para-skene కట్టడాన్ని నిర్మించారు. ఇది Skene కి ఇరుప్రక్కలా విస్తృతం చేయబడి కొంచెం ముందుకు చొచ్చుకు వచ్చిన రాతికట్టడం. అయిదో శతాబ్దం నాటికి ఈ భాగం ఇంకా ప్రేక్షకాగారంతో కలిసిపోలేదు. ప్రేక్షకాగారాని (theatron) కి, స్కీన్ (skene) కి మధ్య ఖాళీస్థలం వుండేది. రంగ గృహంలో వున్న ద్వారాల నుంచి పాత్రల ప్రవేశ నిష్క్రమణాలు జరిగినట్లే ఈ ఖాళీస్థలాన్ని కూడా ప్రవేశ నిష్క్రమణాలకు వాడేవారు. ఈ ఖాళీస్థలాన్ని (దీన్ని "parados" అంటారు) ఎక్కువగా వేరే పట్టణం నుంచి వచ్చే పాత్రలు, లేదా పట్టణంలో మరోవైపునుంచి వచ్చే పాత్రలు తమ ప్రవేశ నిష్క్రమణాలుకు ఉపయోగించేవి. బృంద గాయకుల ప్రవేశం మామూలుగా ఇక్కడి నుంచే.

రంగ గృహాన్నిగురించి చాలా వాదోపవాదాలున్నాయి. రంగ గృహానికి ఉన్న పెద్ద గోడ నాటకాలకు దృశ్య భూమిక (Scenic background) గా ఉండేదా, లేక ఆ గోడకు అమర్చిన ద్వారాలగుండా పాత్రలు ప్రవేశించడానికి మాత్రమే ఆ కట్టడం కట్టబడ్డదా - అన్నది యీనాటికీ వివాదాంశమే! అలాగే - ఈ Skene నాటకంలో మారుతూ వుండే అన్ని దృశ్యాలకు భూమికగా ఉండేదా లేక కేవలం దేవాలయాల

## గ్రీకు నాటకరంగ, ప్రేక్షాగార నిర్మాణంలో 3 దశలు

I ప్రాథమిక దశ




II నిర్మాణ దశ







III పూర్తి అయిన తరువాత

1. మంటపం (altar)
2. వర్తులాకార రంగస్థలం (Orchestra)
3. రంగ గృహం (Skene or Stage House) మొదటి దశలో ఇది కేవలం తాత్కాలికంగా నిర్మించబడ్డ పందిరి (tent)
4. "ప్రాథమిక దశ"లో ప్రేక్షకులు నిలబడే స్థలం; మిగిలిన రెండు దశల్లో రంగ గృహ ద్వారాలు
5. రంగ గృహానికి మెట్లు
6. ప్రేక్షకులు కూర్చుండే రాతి ఫలకాలు (seats)
7. బృందగాయకులు ప్రవేశించడానికి మార్గం (Parados)
8. అడ్డు గోడ (Retaining wall)
9. ప్రేక్షాగారంలో రాకపోకలకు త్రోవ (gangway)

# ఏథెన్స్ నగరంలోని డయోనిసస్ రంగస్థలం







1. మంటపం (altar)
2. తరువాతి దేవాలయం (Later temple)
3. మొదటి దేవాలయం (Old temple)
4. స్తంభాల వరుస (Colonnade)
5. రంగ గృహం (Skene)
6. పక్కలకు విస్తృతం చేయబడిన రంగ గృహం (paraskene)
7. ముందుకు విస్తరించిన రంగ గృహం (proskenion). ఇదే తరువాత ప్రొసీనియమ్ (proscenium) అయింది.
8. కోరస్ ప్రవేశించే మార్గం (parados)
9. వర్తులాకార రంగస్థలం (orchestra)
10. డయోనిసస్ ముఖ్య పూజారి కూర్చుండే స్థలం

ముందో, రాజప్రసాదం ముందో జరిగే దృశ్యాలకేనా ? మరి ఏ సైనికాగారం ముందరో కొండగుహల వెలుపలనో జరిగిన సన్నివేశాలకు దృశ్య పరికల్పనం-చిత్రించిన తెరల మూలంగా చూపబడేదా ? - అనేవి కూడా వివాదాస్పదాలే ! కాని నాటక లక్షణాలను బట్టిచూస్తే గ్రీకులు ఏవిధమైన వాస్తవిక దృశ్య పరికల్పనా విధానాలను ఉపయోగించే వారు కాదనడానికి అవకాశం ఉంది.

అలాగే - ఎత్తుగా అమర్చబడ్డ రంగస్థలం వుండేదా ? అది ఆర్కెస్ట్రా కన్న భిన్నంగా ఉండేదా ? ఉంటే ఆర్కెస్ట్రా మీదకు వచ్చిన పాత్రలు తిరిగి అంతకన్న ఎత్తుగా ఉన్న రంగస్థలం మీదికి పోవడం సులువుగా ఉండేదా ? (కరాళాలు ధరించి వుండడం మూలాన) - అనే ప్రశ్నలకుకూడా సరి అయిన సాక్ష్యాధారాలు లేనందువల్ల సమాధానాలు దొరకడం లేదు. కాని నటుల రంగస్థల కదలికలలో ఉండే సౌలభ్యం దృష్ట్యా ఆలోచిస్తే పాత్రలు కూడా బృంద గాయకులకు మాదిరిగానే ఆర్కెస్ట్రానే రంగభూమిగా ఉపయోగించారని గ్రహించవచ్చు. రానురాను **Skene** ఉపరి తలాన్ని కూడా రంగస్థలంగా కొన్ని ప్రత్యేక దృశ్యాలకు ఉపయోగించేవారని తెలుస్తున్నది.

పాత్రల మరణ ఘట్టాన్ని మామూలుగా రంగస్థలం మీద చూపేవారు కాదు. కాని చనిపోయిన పాత్రల్ని రంగస్థలం మీదకు తెచ్చే ఆచారం వుండేది. అందుకుగాను ఆ మరణించిన పాత్రను ఒకచక్రాలు అమర్చిన బండిమీద ఉంచి తాడుతో రంగస్థలం ఒక వైపు నుంచి మరొక వైపుకు లాగేవారు. ఈ లాగే పరికారాన్ని ఎక్కైక్లెమా (**Eccyclema**) అనేవారు.

చాలా గ్రీకు నాటకాల్లో మానవ పాత్రల సహాయార్థం దేవతా పాత్రలు ప్రత్యక్షం కావడం పరిపాటి. ఈ దేవతా పాత్రల్ని రంగగృహం పై అంతస్థునుంచి ఆర్కెస్ట్రా మీదకు దించడమో, తిరిగి అంతర్ధానం అయ్యేటప్పుడు మీదికి లాగడమో జరుగుతూ వుండేవి. దీనికిగాను "మాకినా" (**machina**) అనే క్రేన్‌వంటి యంత్రాన్ని వాడేవారు. దీనిని బట్టే-నాటక ఇతివృత్త నిర్వహణంలో వాస్తవికమైన ముగింపులేక ఏ దేవతో, దేవుడో వచ్చి కథను అంతం చెయ్యడానికి ఉపయోగించే అవాస్తవికమైన ముగింపును "డూ ఎక్స్ మాకిన" (**deam ex machina**- అంటే "యంత్రంద్వారా దేవుడు" అని అర్థం) అనేవారు. గ్రీకు నాటక ప్రదర్శనలలో ఎక్కైక్లెమా, మాకిన- ఈ రెండు యంత్రాలనే వాడేవారు.

దృశ్య పరికల్పనలో భాగంగా పెరియాక్టాయ్ (**periactoi**) అనే ముక్కోణ ఆకారంలో ఉన్న ఫ్లాట్లను కూడా వాడేవారు. ఈ ఫ్లాట్లకు మూడు ఉపరితలాలు

(surfaces) వుంటాయి కనుక వీటిని ఆయా దృశ్యాలకు అనువుగా మార్చుకొని దృశ్య భూమికలుగా వాడుకొనే వారు.

## బృందగానం (కోరస్)

గ్రీకు నాటక ఆవిర్భావం - ముఖ్యంగా విషాదనాటకం - బృందగానాల స్థితినుంచి సంపూర్ణ నాటక దశకు ఎదిగి ఉంటుందని, బృందగానంలో పాటకన్న నృత్య ప్రాముఖ్యం ఎక్కువని ఇదివరకే చెప్పడం జరిగింది. ఇక్కడ బృంద గానానికి గ్రీకు నాటకంలో ఉండే స్థానాన్ని గురించి వివరించాలి.

50 మందితో కూడిన బృందం చేసే బృందగానంతో డయొనిసస్ ఉత్సవాల్లో పాల్గొనేది కోరస్. మనకు లభ్యమవుతున్న ప్రాచీన గ్రీకు నాటకాల్లో పురాతనమైనది ఎస్కిలస్ వ్రాసిన **The Suppliants.** అందులో మామూలుగా బృందగానంలో కనిపించే 50 మంది గాయకుల్ని ప్రవేశపెట్టాడు. రానురాను అతని నాటకాల్లో 12 మంది బృందగాయకులే వుండేవారు. సొఫోక్లిస్ ఆ కోరస్ సంఖ్యని 15 మందికి పెంచాడంటారు. ఈ 15 అన్న సంఖ్య నాటక ప్రదర్శన దృష్ట్యా చాలా వీలైనది. బృందగానం మూడు వేరు వేరు బృందాలుగా (బృందానికి ఐదుగురు చొప్పున) ఏర్పడి మూడు విభిన్న దృక్పథాలను వెలువరించవచ్చు. లేదా రెండు బృందాలుగా (అంటే ఏడుగురు, ఏడుగురు సభ్యులుగా రెండు జట్లు విడిపోయి, బృందం నాయకుడు అటూ, యిటూ కూడా వుండే ఏర్పాటు) ఏర్పడి వాదోపవాదాలు జరపవచ్చు. ఆ రెండు సందర్భాలలోను ఈ 15 సంఖ్యకి ప్రాముఖ్యం ఉంది. బృందగాయకులు మామూలుగా నాటకంలోని ప్రొలోగ్ (పూర్వరంగం) అయిపోయిన తరువాత రంగస్థలం మీదకు వచ్చి అక్కడనుంచి ఆసాంతమూ ఉండిపోతారు. ప్రాచీన గ్రీకు నాటకంలో బృంద గానానికి చాలా ప్రాముఖ్యం ఉంది.

ఈ ప్రాముఖ్యతకి మొదటి కారణం బృందగానం నాటకంలో ఒక పాత్రగా ఉంటూ రావడమే! వ్యక్తిగతంగా, సమిష్టిగా అందులోని సభ్యులు తమ అభిప్రాయాలను వెల్లడిచేస్తారు; సలహాలుచెప్తారు; ''అవసరమైతే కథా నిర్వహణంలో తాము జోక్యం కలుగచేసుకోవలసి వస్తుంది సుమా'' అన్న చిన్న మందలింపు కూడా అప్పుడప్పుడూ వినవస్తుంది వారినుంచి. సాధారణంగా కోరస్ అభిప్రాయాలు కథానాయకుడి అభిప్రాయాలకు అనుగుణంగాను అతడి భావాల ఎడ సానుభూతితోను ఉంటాయి. గ్రీకు నాటక వికాసం జరిగే తొలి రోజుల్లో గాయకుల బృందం నాటకంలో ఒక పాత్రగా ఉండి సంఘటనల్లో పాలుపంచుకున్నా రాను రాను కోరస్ వ్యాఖ్యాన కర్తగా మారిపోయింది. దీనికి కారణం నాటకంలో రెండో నటుడు, మూడో నటుడు ప్రవేశ పెట్టబడడమే!

మరో ముఖ్యమైన విషయం - నాటకంలో రచయిత చెప్పదలుచుకున్న నైతిక విధానాలకు అద్దంపట్టే బాధ్యత కోరస్‌దే! ఆ నైతిక భావాలు ఆలంబనంగా మిగిలిన పాత్రల కార్యక్రమాల్ని, నడతనీ బేరీజువేయడానికి ఈ నైతిక సిద్ధాంత ప్రతిపాదన అవసరమైంది.

మూడోది - కోరస్‌ను ఆదర్శ ప్రేక్షకుడనవచ్చు. ఆయా పాత్రలకు, సన్నివేశాలకు అది చేసే ప్రతిస్పందన రచయిత ప్రేక్షకులనుంచి ఆశించే ప్రతిస్పందన అనవచ్చు. ఉదాహరణకు - ఈడిపస్ - టైరీషియస్‌ల పరస్పర సంఘర్షణ విషయంలో రెండుగా విడిపోయి బృంద గాయకులు తమ తమ అభిప్రాయాలను వివరిస్తారు. ఒక భాగం కోరస్ "తాము టైరీషియస్ మాటలను నమ్మం" అంటారు. మరొకరు "టైరీషియస్ భవిష్యత్తును చూడగలవాడు, అతడి మాటలను నమ్మకపోవడం ఎలా" - అంటారు. ఈ ద్వైదీభావం ప్రేక్షకులదే! అదే కోరస్ రెండుగా విడిపోయి బృందగానాన్ని ఆలపించడంలో వ్యక్తం అయింది.

గ్రీకు నాటకంలో "కోరస్" చేసే మరో పని - నాటకానికి కావలసిన సరైన వాతావరణాన్ని సృష్టించడం; దానికి అనువుగా సన్నివేశాలను పరాకాష్ఠకు తీసుకుపోవడం. కోరస్ ప్రతి సన్నివేశానికి (ఎపిసోడ్ కు) తరువాత రావడంవల్ల జరిగిపోయిన సన్నివేశంలోని ముఖ్యాంశాన్ని తమ గానంలో వ్యాఖ్యానించి రాబోయే సన్నివేశానికి కావలసిన అంశాల్ని ప్రేక్షకులకు అందించడంవల్ల క్రమంగా ఆ సన్నివేశాల ఆంతర సంబంధాన్ని సంఘటిత పరిచే సూత్రంలా పనిచేస్తుంది.

కోరస్ చేసే మరో పని నాటకంలో ఉన్న పురాణ గాథకు, నిత్య జీవితానికి గల సంబంధాన్ని ప్రేక్షకులకు తెలియ చెప్పడం. అంటే కథా సన్నివేశంలో ఉండే నైతిక, సార్వకాలిక సత్యాలను సమకాలీన జీవితానికి అన్వయించి ప్రేక్షకులకు ఎప్పటికప్పుడు ఎరుకపరచడం.

అనందం ఎండమావి
సంతోషం శాపం
ఏ మనిషీ ఆనందమయుడుకాడు
జీవితం చివరి క్షణం దాకా
తుది నిష్క్రమణం దాకా—

అన్న "ఈడిపస్" నాటకంలోని చివరి వాక్యాలవలె (ఈ మాటలు సోఫోక్లిస్ రచన కాదనుకున్నా) నాటకం చెప్పే తాత్త్వికభావాన్ని వెలువరించడానికి ముఖ్యమైన

ఆధారం బృందగానమే! బృంద గాయకులకు ఒక్కొక్కరికి ప్రత్యేకంగా అస్తిత్వం లేకపోయినా వారి "ఉమ్మడి వ్యక్తిత్వం" (group personality) చెప్పే ధార్మిక భావాలు ప్రేక్షకులను ప్రభావితుల్ని చేయడానికి ఎంతైనా ఉపయోగపడతాయి. ఈ విధంగా పురాణ గాథలకు సమకాలీనతను కల్పించడానికి కోరస్ చేసే వ్యాఖ్యానాలు, అది వెలువరించే నైతిక భావాలు ఎంతైనా ఉపయోగపడేవి.

కోరస్ సామాన్య ప్రజల భావాలకు ప్రాతినిధ్యం వహించడం కూడా మనం గమనించవచ్చు. పురాణ కథకు సమకాలీన జీవితానికి సమన్వయం సాధిస్తూనే సామాన్య ప్రజల మనోభావాలకు అద్దం పడుతుంది కోరస్.

ప్రదర్శన పరంగా కూడా కోరస్‌కి ప్రాముఖ్యత వుంది. దృశ్య, శ్రవ్య చిత్రాలు ఈనాడు చూపేటంత పటాటోపంతోను, జటిలంగాను కాక, నేరుగా, క్లిష్టత లేకుండా చూపే అయిదో శతాబ్దం నాటకంలో కోరస్ ప్రసన్నంగా ఉండే నృత్యాన్ని, శ్రావ్యంగా ఉండే సంగీతాన్ని, కళ్ళకు హాయిగా వుండే రంగురంగుల వేషభూషల అందాలనీ ప్రదర్శించి ప్రేక్షకులను అలరించేది.

ఈనాడు గ్రీకు నాటకాలను ప్రదర్శించేటప్పుడు "కోరస్"ని ప్రేక్షకుల ఉత్సుకతకు అనువుగా మలచడం కష్టసాధ్యమైన విషయం. కాని దృశ్యపరంగా ఆలోచిస్తే అనాటి గ్రీకు నాటకంలో ఆర్కెస్ట్రామీద నాటకం ఆసాంతం వుండే 15 లేదా 12 మంది బృంద గాయకులను చాలా అందమైన దృశ్య చిత్రాలను నిర్మించడానికి వాడే వారని పిస్తుంది. కోరస్ లేకపోతే గ్రీకు నాటకం అంతా అర్ధగంటలో ముగుస్తుంది. త్వర త్వరగా ముగిసే నాటకీయ సన్నివేశాలకు అటు గేయ, గానాల సంగీత సౌరభాన్ని, ఇటు వ్యాఖ్యానాల తాత్త్వికతనీ సాధించిన ఘనత కోరస్‌దే!

ప్రదర్శన సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచించినా గ్రీకు నాటకంలో బృందగానం నిర్వహించే పాత్ర అతిముఖ్యమైంది. సన్నివేశానికి సన్నివేశానికి మధ్య వచ్చే బృందగానం సన్నివేశం ముగింపును సూచిస్తుంది. (ఈనాటి "తెరపడడం", "లైట్లు ఆర్పడం"వంటివి ఇటువంటి సాంకేతిక అవసరాలే!) అంతకన్న ఎక్కువగా నటుల సంఖ్య తక్కువ కావడంవల్ల, ఆ నటులే తిరిగి మరో పాత్రలో తిరిగి రావాలి కనుక, వారు వేష భూషల్లో చేసుకోవలసిన మార్పుకు అవసరమైన కాలాన్ని ఇవ్వ డానికి కూడా కోరస్ గీతాలు పనికి వచ్చాయి. సన్నివేశాలమధ్య ఉండే కాలగమనాన్నీ, స్థలం మార్పునూ కూడా సూచిస్తాయి కోరస్ గీతాలు.

కోరస్‌లో పాల్గొనేవారంతా అమెచూర్ నటులు కావడం విశేషం! నాటకంలో పాత్రలు వేసే వారంతా వృత్తి నటులు కాగా, కోరస్‌లో మాత్రం తమంత తాముగా

ఈ డయొనిసస్ ఉత్సవంలో పాల్గొంటామని వచ్చే మామూలు పౌరులు కోరస్‌లో పాల్గొంటారు. అటు భావితరాల గాథలకి సమకాలీనతను కల్పించడమేకాక, సమకాలీన జీవితంలో భాగస్వాములై కూడా సాంప్రదాయికమైన ఉత్సవాలలో జరిగే కర్మకాండలోను, ఆతరువాత జరిగే నాటకప్రదర్శనలో సామాన్య ప్రజల ప్రతినిధులై కోరస్ విధులను నిర్వర్తించగలగడం ఆనాటి గ్రీసు ప్రజలు తమ అదృష్టంగా భావించేవారు

## నటనా విధానం

సొఫోక్లిస్ కాలంనాటి నుంచి విషాదనాటకంలో పాల్గొనే నటుల సంఖ్య మూడుకు పెరిగింది. ఆ తరువాత అంతకుమించలేదు కూడా. ఐదోశతాబ్దం ఉత్తరార్ధంలో నగర ప్రభుత్వమే పోటీల్లో పాల్గొనే ప్రతినాటక కర్తకూ ముగ్గురు నటులను కేటాయించేది. అందులో ప్రధాన "విషాద" నటుణ్ణి (tragic actor) లాట్లద్వారా ఎంపిక చేసేవారు. నటులు అందరూ మగవారు. వారే ఆడవేషాలు ధరించేవారు. అందయా ఆ నాటక కర్త ప్రదర్శించే నాలుగు నాటకాల్లోను నటించాలి. నటులు ముగ్గురు, పాత్రలు చాలా ఉండడం వల్ల ప్రతినటుడూ చాలా పాత్రలు ధరించవలసి వచ్చేది.

ఆనాటి నటనావిధానం ఎలా వుండేదో తెలుసుకోవడం కష్టం. వాస్తవిక నటనను సూచించే కొన్ని ప్రాథమిక లక్షణాలు కనిపిస్తున్నా (ఏడవడం, మూర్ఛపోవడం - వంటివి) వాస్తవిక విరుద్ధతే ఎక్కువ ప్రాముఖ్యం కలిగి ఉన్నట్టు కనిపిస్తుంది. ఒకే నటుడు పలుపాత్రలు ధరించవలసి రావడం, మగనటులే స్త్రీ పాత్రలు ధరించడం - వంటివి నటనలో వాస్తవికతను సూచించే విధానాలు కావు. వీటన్నిటిని మించి ప్రతి నటుడూ కరాళాలు ధరించడం వల్ల వాస్తవిక భావ ప్రకటనకు ఎటువంటి వీలు కన్పించదు. అలానే నాటకాంతం సాగే బృందగాన, బృంద నృత్యాలు కూడా వాస్తవికతకు దోహదంచేసే లక్షణాలు కావు. రచనల దృష్ట్యా చూస్తే నటన భావ వ్యక్తీకరణకు కావలిసినంతమేరకే వుండి "స్టయిలైజ్‌డ్" నటనా విధానాన్ని అనుసరించి వుండేదని చెప్పవచ్చు.

గ్రీకు నాటకంలోని అందరు నటులు కరాళాలు (masks) ధరించేవారు. ఇవి లినెన్ గుడ్డతోకాని, తేలిక బెరడు లేదా చెక్కతోగాని చేయబడేవి. ఇలా కరాళాలు ఉపయోగించడానికి చాలా కారణాలున్నాయి; ఒకటి - ఒకేనటుడు పలుపాత్రలు ధరించవలసిరావడంతో ఒక పాత్రనుంచి మరొకపాత్రను వేరుపరచడానికి. అలానే పురుష పాత్రలనుంచి స్త్రీ పాత్రలను వేరుచేయడానికి. పురుషులే స్త్రీ పాత్రలు ధరిస్తారు కనుక యీ కరాళాల అవసరం ఎంతైనా ఉండేది. అలానే నటుల, పాత్రల వయోభేదాలను కప్పిపుచ్చడానికి కూడా కరాళాలు ఉపయోగపడేవి. కొందరు విమర్శకులు చెప్పినట్టు

కరాశాల ముందుభాగం - ముఖ్యంగా నోటిదగ్గరి భాగం మెగాఫోన్‌లానో, లౌడ్‌స్పీకర్‌లానో ఉపయోగించేదనడం సమంజసం కాదు. ఇక శిరస్త్రాణాలు, శిరోవేష్టనలు ఆనాటి ప్రజలు ధరించే విధానానికి దగ్గరగా ఉండేవని ఆనాటి చిత్రాలను చూస్తే తెలుస్తున్నది.

## గ్రీకు నాటక కర్తలు :

ఎన్నో శతాబ్దాల పాటు గ్రీకుదేశంలో నాటకరచన సాగినా, ఐదుగురు నాటక కర్తల నాటకాలే యీనాడు మనకు లభ్యం అవుతున్నాయి. వీరిలో ఎస్కిలస్, సోఫోక్లిస్, యురిపిడిస్ - విషాదనాటక రచయితలు. అరిస్టోఫేన్స్, మెనాండర్, ఇద్దరూ ఆహ్లాద నాటకరచయితలు. అంతకుపూర్వం థెస్‌పిస్ నాటకాలకు ఆద్యుడయినా, అతని నాటకాలు కాని, థెస్‌పిస్ ఎస్కిలస్‌ల మధ్యకాలంలోని నాటక రచయితల నాటకాలు కాని యీనాడు అలభ్యం. మిగిలిన ఐదుగురి నాటకాలలోను ఈనాడు 45 మాత్రమే లభ్యం అవుతున్నాయి: 32 విషాదనాటకాలు, 12 ఆహ్లాద నాటకాలు, ఒక సాటిర్ నాటకం. ఇందులో నాలుగు నాటకాలుతప్ప మిగిలినవన్నీ క్రీ.పూ. ఐదవ శతాబ్దానికి చెందినవే!

ఎస్కిలస్ (క్రీ.పూ. 525-456)

ఈనాడు లభ్యం అవుతున్న నాటకాలలో ఎస్కిలస్ వ్రాసిన నాటకాలే పురాతనమైనవి. ఆయన క్రీ.పూ. 499 లో మొదటిసారి నాటక పోటీల్లో ప్రవేశించాడు. కాని 484 దాకా ఆ పోటీల్లో నెగ్గలేదు. ఆ తరువాత 13 సార్లు నెగ్గాడు. ఈయన వ్రాసినట్లు చెప్పబడుతున్న 79 నాటకాలలో ఏడు నాటకాలు మాత్రమే యీనాడు లభ్యం. పర్షియన్స్ (472), సెవెన్ ఎగనెస్ట్ థీబ్స్ (467), అరెస్టియా "ట్రిలజీ"లో మూడు నాటకాలు-అగ్‌మెమ్‌నాన్, కోఫోరో, యుమెనైడిస్ (458), ది సప్లియంట్స్, ప్రొమీథియస్ బౌండ్ (వీటి రచనాకాలం సరిగ్గా తెలియదు). ఈయన "పర్షియన్స్" లభ్యమౌతున్న ఏకైక చారిత్రక నాటకం.

అప్పటికే థెస్పిస్ ప్రవేశపెట్టిన మొదటి నటుడికి తోడుగా రెండో నటుణ్ణి ప్రవేశ పెట్టడం ఎస్కిలస్ నాటక రంగానికి యిచ్చిన కానుక. ఇలా ఇద్దరు నటులు ఒకే కాలంలో రంగస్థలం మీద ఉండడంవల్ల కోరస్‌తోకాక, మరొక పాత్రతో ఒక పాత్ర మాట్లాడడానికి, అవసరమైతే విరోధించడానికి వీలుపడ్డది. ఈవిధంగా పాత్రల సంఘర్షణకు దారితీసింది. పాత్రల ప్రాముఖ్యం పెరిగే సరికి అంతవరకు ప్రాబల్యం వున్న కోరస్ ప్రాముఖ్యం తగ్గింది.

ఎస్కిలస్ తన మొదటి నాటకాలలో యాభై మందితో కూడిన బృందగానాన్ని ప్రవేశపెట్టాడు. ఇది డిథిరాంబ్ బృందగీతాల ఆనవాయితీ....కాని రానురాను 15

మంది బృంద గాయకులకే పరిమితం చేశాడు ఎస్కిలస్ కూడా, సొఫోక్లిస్‌ని అనుసరించి.

నాటక కర్తగా ఎస్కిలస్ గొప్పతనం తెలుసుకోవాలంటే అతని "అరెస్టియా" ట్రిలజీ చదవాలి. ప్రపంచ నాటక చరిత్రలోనే దానికొక విశిష్టమైన స్థానం వుంది. ఎస్కిలస్ ఎక్కువగా మానవునికి - ప్రకృతితోను, దేవతాగణంతోను ఉండే లేదా ఉండవలసిన సంబంధం గురించి వ్రాశాడు. "అరెస్టియా" నాటకత్రయం ముఖ్యంగా నైతిక జీవితంలో న్యాయనిర్ణయాన్ని గురించి వ్రాయబడ్డ నాటకం. మొదటి రెండు నాటకాల్లో "వ్యక్తిగతమైన ప్రతీకారమే న్యాయం" అని చూపించబడ్డా, మూడో నాటకంలో ఆ వ్యక్తిగతమైన న్యాయం సంఘగతం కావాలని పేర్కొంటాడు. ఈ మార్పును చూపించడానికి బలమైన సన్నివేశాల్ని స్వీకరించాడు రచయిత. హత్యలూ, ప్రతీకారాలు, పశ్చాత్తాపాలతో కూడిన యీ నాటకత్రయం ఆనాటి సాంఘిక న్యాయానికి అద్దంపడుతుంది.

ఎస్కిలస్ ఈ నాటకంలోనే చాలా విస్తృతమైన దృశ్య పరికల్పనను ప్రవేశ పెట్టాడని చెబుతారు. రంగపరికరాలు మొదలైనవికాక ప్రతి నాటకానికి ఒక దృశ్య పరికల్పన వుండాలి - అన్న విధానం ఆ తరువాతనే ప్రారంభం అయింది.

సొఫోక్లిస్ (496-406) గ్రీకు నాటక కర్తలందరిలో ఉత్తమోత్తముడని పేరు గడించాడు. వందకు పైగా నాటకాలు రచించాడని ప్రతీతి. కాని ఏడు నాటకాలు మాత్రమే యిప్పుడు లభ్యం అవుతున్నాయి. అజాక్స్ (450-440), ఆంటిగొనె (440), ఈడిపస్ (430-425 మధ్య), ఫిలాక్టిటస్ (409), ఎలెక్ట్రా, ట్రాకినేయ్ (ఈ రెంటి రచనా కాలం తెలియదు), ఈడిపస్ ఎట్ కొలనస్ (సొఫోక్లిస్ మరణించ డానికి కొద్ది రోజుల ముందు వ్రాసినది). ఇవికాక 'ద ట్రాకర్స్' అనే సాటిర్ నాటక భాగాలు కూడా లభ్యం అవుతున్నాయి. క్రీ. పూ. 468 లో ఎస్కిలస్‌ను ఓడించి ప్రథమ బహుమతి పొందడంతో నాటక పోటీల్లో పాల్గొనడం ప్రారంభించిన సొఫోక్లిస్ 18 సార్లు డయొనిసస్ ఉత్సవాల్లో ప్రథమ బహుమతిని సాధించాడు.

మూడో నటుణ్ణి ప్రవేశ పెట్టడం ద్వారా నాటకానికి కావలసిన సంఘర్షణ బలాన్ని, నైశిత్యాన్ని యిచ్చాడు సొఫోక్లిస్. ఎస్కిలస్‌లా తాత్త్విక, మత పరాలైన భావాలకు ప్రాముఖ్యం యివ్వక, మానవుల పరస్పర సంబంధాలను నాటకీకరించాడు. అంతేకాదు; ఇతివృత్త నిర్మాణంలోను, ఉద్వేగ పరాకాష్ఠలను చిత్రించడంలోను అతడి కతడే సాటి అనిపించుకున్నాడు.

దృశ్య పరికల్పనలో దృశ్య చిత్రరచనను (Scene Painting) ప్రవేశ పెట్టిన వాడు సొఫోక్లిస్. అతడికి పూర్వం రచయితే నటుడుగా కూడా నాటక ప్రదర్శనలలో పాల్గొనడం కద్దు. కాని తానుగా ఎన్నడూ నాటక ప్రదర్శనలలో నటుడిగా పాల్గొనలేదు సొఫోక్లిస్.

సొఫోక్లిస్ గ్రీకు నాటకాల ఇతివృత్త నిర్మాణానికి ఒక పటిష్టమైన రూపకల్పన చేశాడు. తరువాతి నాటకకర్తలంతా యీపద్ధతినే అనుసరించారు. ఆపద్ధతి ప్రకారం - గ్రీకు నాటకంలో ఉండే ముఖ్య భాగాలు :

1) ప్రొలోగ్ - పూర్వ రంగం
2) పారడాస్ (కోరస్ ప్రవేశ గీతాలు).
3) ఒకటి నుంచి ఐదు వరకూ ఉండే సన్నివేశాలు (episodes).
4) అంతే సంఖ్యలో ఉండే బృందగానాలు (choric songs).
5) ఎక్సోడస్ - బృందగాన నిష్క్రమణ.

యురిపిడిస్ : (క్రీ.పూ. 480-406) ప్రాచీన గ్రీకు విషాదనాటక రచయితల్లో ఆఖరివాడు. ఇతివృత్తనిర్మాణవిధానంలో యురిపిడిస్ తన నాటకాల్లో సొఫోక్లిస్ నాటక పద్ధతులనే అనుసరించాడు. 92 నాటకాలు వ్రాశాడని అంచనా. అందులో 17 నాటకాలు లభ్యం అవుతున్నాయి. అందులో కొన్ని ఉత్తమమైనవి : ఆల్ సెస్టస్ (438), మెదియా (431), హిప్పొలిటస్ (428), ఎలెక్ట్రా, ది ట్రోజన్ విమెన్, ది బాకే (తేదీలు తెలియవు). ఆయన వ్రాసిన "ది సైక్లోప్స్" అనేది ఒక్కటే సాటిర్ నాటకాంలో సంపూర్తిగా లభ్యమయ్యే నమునా. రాను రాను వాస్తవిక వాదిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నా, సమకాలీన గ్రీసుదేశంలో అతనికి రావలసినంత గుర్తింపు రాలేదని పిస్తుంది. ఆయనకు 5 సార్లు మాత్రమే నాటక పోటీల్లో బహుమతి వచ్చింది.

యురిపిడిస్ తన నాటకాల్లో బృంద గాన ప్రాముఖ్యాన్ని తగ్గించి నాటకీయతకు ప్రాధాన్యం ఇచ్చాడు. మనస్తత్వ పరిశీలన, పాత్రల మనోగత భావాలకు ప్రాముఖ్యం యివ్వడం, వాస్తవికంగా సన్నివేశాలను మలచడం - వీటిలో యురిపిడిస్ ఆధునికత కనిపిస్తుంది. ఆయన నిరీశ్వరవాదం ఏథెన్స్ నగరంలో ప్రబలంగా ఉన్న చాలా నమ్మకాలను ధైర్యంగా ఎదుర్కోవడం ప్రారంభించి ఒక సంచలనాన్ని సృష్టించింది.

వీరుకాక - ఆనాటి ఆహ్లాదరూపక రచయితల్లో పేరుకాంచినవారు అరిస్టోఫెన్స్, మెనాండర్ - లు.

## ''రాజా ఈడిపస్'' :

''రాజా ఈడిపస్'' (Oedipus Rex) గ్రీకు నాటక సాహిత్యంలోనే కాదు, పాశ్చాత్య నాటక సాహిత్యం అంతటిలోనూ ప్రథమంగా ఎన్నదగిన నాటకం. దీనిని నాటక ఇతివృత్తానికి అత్యుత్తమమైన ఉదాహరణగా స్వీకరించాలని హితవు చెప్పాడు అరిస్టాటిల్. రచయితలకందరికీ ఆ ఇతివృత్త నిర్మాణ పద్ధతి మార్గదర్శకం కావాలని కూడా కోరాడాయన. ఆ కారణంవల్లనే ఈనాటికీ - చూసే ప్రదర్శన ఎలావున్నా - ప్రేక్షకులలో కరుణ, భయానక భావాలను సృష్టించగలుగుతున్నది ఈ నాటకం. ఈడిపస్ గాథ గ్రీకు పురాణాల్లోనుంచి గ్రహించిందే! అందువల్ల ప్రేక్షకులకందరికీ ఆ కథ చిర పరిచితమైనదే! అయితే ఆ చిరపరిచితమైన గాథను స్వీకరించి దానిని నాటకంగా మలిచిన విధానమే ఆ నాటకాన్ని నిత్యనూతనంగా తీర్చి దిద్దింది. సొఫోక్లిస్ తన నాటకంలో చూపిన సన్నివేశాలనుబట్టిచూస్తే ఈడిపస్ చేసిన పనులను గురించి కాక (ఆయన మానవజాతి గర్హించే రెండు పనులు చేశాడు.) సత్యాన్వేషణ కోసం ఈడిపస్ పడిన తపనను, అందుకుగాను అతడు అవలంబించిన అన్వేషణా విధానాన్ని తన నాటకానికి ముఖ్యమైన విషయంగా స్వీకరించాడనిపిస్తుంది. అందులోనూ యీ సత్య శోధనను దైవిక ప్రసక్తి లేకుండా (హోమర్ చేసిన విధంగా కాకుండా), కేవలం ఈడిపస్ కార్యోన్ముఖతవల్లనే, నిజం తెలుసుకుని తీరాలన్న అతని పట్టుదలవల్లనే సాధించినట్లు చూపించాడు సొఫోక్లిస్. ఆ విధంగా నాయకుడే తన దైన్యస్థితికి కారకుడైనాడు. ఎంతో పరిశోధనచేసి తానే తప్పుచేసినవాడినని కనుగొన్న డిటెక్టివ్ లాంటివాడు ఈడిపస్.

''ఈడిపస్'' - చాలా గొప్ప నాటకాలన్నింటిలో మాదిరిగానే - అనేక కథావస్తువుల (themes)ను కళాత్మకంగా కూర్చిన నాటకం. నాటకంచివర బృంద గానం ఇలా పాడుతుంది :

ఆనందం ఎండమావి
సంతోషం శాపం
ఏ మనిషీ ఆనందమయుడు కాడు
జీవితం చివరి క్షణం దాకా
తుది నిష్క్రమణం దాకా

ఈ పంక్తుల్లో చెప్పబడ్డట్లు ''ఈడిపస్''లో ముఖ్యమైన కథా వస్తువు ''జీవితం విధి లిఖితం'' అన్న పురాణ సూక్తి. మహారాజు అయిన ఈడిపస్ మనుషులచేత

గర్హింపబడి, దేశం నుంచి బహిష్కరించబడే స్థితికి రావడం విధివశంచేతనే - అనే ఆనాటి గ్రీకుల తాత్త్విక భావం యీ నాటకం ద్వారా వెల్లడి అయింది.

దానికి అనుబంధమైన భావమే - మనిషి ఏ విధంగానూ తన విధినుంచి తాను తప్పించుకోలేడు-అని. ఈడిపస్ ఎప్పుడూ తన దేశం, తన ప్రజల మంచినే కోరాడు. మంచి చేయడానికే ప్రయత్నించాడు. దైవవాణి చెప్పిన హంతకుణ్ణి పట్టుకోవడానికి తద్వారా దేశానికి కలిగిన విపత్తును తొలగించడానికి కృషిచేశాడు. కాని మనిషికి దూరదృష్టిలేదు. తప్పులు చేయకూడదన్న నిర్ణయం ఎంత గట్టిగావున్నా, తన భవిష్యత్తును గురించిన ముందు చూపు లేకపోవడంవల్ల, ఆ తప్పులు చెయ్యాక తప్పని స్థితి ఎదురవుతుంది. అందువల్ల మనిషి విధిని జయించడం, విధి మనిషిని నియమించడం - మధ్య జరిగిన సంఘర్షణలో విధి సాధించిన విజయాన్ని చిత్రీకరిస్తున్నది ఈ నాటకం. కాని మనుష్యుల ద్వారానే విధి ఈ విజయాన్ని సాధించడం, తెలియకుండానే మనుషులు అందుకు దోహదం చెయ్యడం - మానవుడి సంకుచిత విజ్ఞానం (limitations of knowledge) మీద రచయిత చేసిన వ్యంగ్యాత్మకమైన వ్యాఖ్యానంగా మనం గ్రహించాలి. జొకాస్టా పసివాడైన ఈడిపస్‌ని చంపడానికి పంపించడం, ఈడిపస్ తన తల్లిదండ్రుల నుంచి దూరంగా వెళ్లిపోవాలని కోరుకోవడం, ఈడిపస్ హంతకుణ్ణి పట్టుకుతీరతానని ప్రతిజ్ఞ పూనడం - ఇవిఅన్నీ బలీయమైన మానవ ప్రయత్నాలు. విధి వీటి అన్నింటినిమించి తన ఆధిక్యతను చూపెట్టుకుంది. కాని ఈడిపస్ చివరిక్షణాలలో కూడా విధి ఆధిక్యతను అర్థంచేసుకోడు. తన కూతుళ్లతో మాట్లాడుతూ —

ఒకప్పుడు వెలుగుల వెల్లువలైన మీనాన్నకళ్లకు
బలవంతంగా చీకట్లు చిమ్మించిన
ఈ చేతుల్లోకి రండమ్మా—

అంటాడు. అప్పుడు కూడా తన శిక్షను తాను విధించుకున్నట్లుగానే భావిస్తాడు ఈడిపస్ !

ఈడిపస్ ఇలా విధిచేత ఎందుకు శిక్షింపబడాలో దానికి కారణం ఏమిటో నాటకంలో ఎక్కడా చెప్పలేదు సొఫోక్లిస్. విధి బలీయమైందనీ, దానినుంచి ఏ మనిషీ తప్పుకోలేడనీ - విధికి తలవంచడం తప్ప మానవుడికి మరో గత్యంతరం లేదనీ - నాటకంలో రచయిత చెప్పదలుచుకున్న నీతి - అనిపిస్తుంది. దైవవాణి వాక్యాలను తెలుసుకుని, అందుకు అనుగుణంగా నడవాలన్న ఆతృత, దేశాన్ని ఆవరించిన భీభత్సం దేవతల ఎడ చేసిన అపరాధం అని ఆ దైవవాణి పేర్కొనడం, హంతకుణ్ణి

దేశంనుంచి బహిష్కరిస్తే, దేశం పవిత్రీకరణం చెందుతుందన్న భావం - ఇవి అన్నీ విధిని నిర్దేశకర్తగా చూపించడానికి జరిగిన ప్రయత్నాల్లో భాగాలే ! అయితే, నాటకంలో ఏ పాత్రా-తనకు తెలియని తప్పుకు ఈడిపస్ ఎందుకు శిక్షను అనుభవించాలి - అని ప్రశ్నించదు. దైవవాణి పలుకులు నిజాలని నిరూపించడంలేదు. ఆ నిర్ధారణకు కారణాలు చెప్పడంలేదు. ఈడిపస్ ఏ కారణంచేత సంఘ, దేశ బహిష్కృతుడో నాటకం ఎక్కడా పేర్కొనలేదు. గ్రీకుల పురాణాల్లో మంచిచేసే దేవుళ్ళు మాత్రమే కాక, కోపం వచ్చి శపించే దేవుళ్లూ వున్నారు. ఏ దేవుడో మనిషి వినాశనానికి శాపం యివ్వగలడు. అందువల్ల దేవతల శాపానికి గురికాకుండా ఉండడానికి మనిషి అహర్నిశలూ అప్రమత్తుడై వుండాలన్న గ్రీకుల భావాన్ని యీ నాటకం నిరూపిస్తున్నది.

ఇటీవల కొందరు జానపద విజ్ఞాన పరిశోధకులు - ఈడిపస్‌ను ఒక "బలిపశువు"గా కూడా నిరూపించడం జరిగింది. పురాణగాధలన్నింటిలోను ఒక వ్యక్తి - దేశం, లేదా సమాజం మంచికోసం ఆత్మత్యాగం చేసుకోవడం పరిపాటి. ఈడిపస్ అటువంటి వ్యక్తి. ఒక్కవ్యక్తి మరణిస్తే థీబ్స్‌నగరం అంతా రక్షింపబడుతుంది. అంటే థీబ్స్‌నగర సంక్షోభానికి కారణాన్ని తన నెత్తిన వేసుకొని తాను అందుకు బలి అయి, థీబ్స్‌ను రక్షించిన ఈడిపస్ కథలో ఈడిపస్ దేవతలకు అర్పించబడ్డ "బలి"గా గోచరిస్తాడు. కొందరు విమర్శకులు ఈ విషయంలో ఈడిపస్‌ను క్రీస్తుతో కూడా పోల్చారు. కాని ఈ పోలికను ఎక్కువ దూరం పొడిగించడానికి వీలులేదు.

నాటకం ఆసాంతం కనిపించే మరో ముఖ్యమైన పద, దృశ్య చిత్రం గుడ్డితనానికి, చూడగలగడానికి మధ్య ఉండే తారతమ్య నిర్ధారణ. కళ్ళుండీ చూడలేని వాళ్ళు, కళ్ళు లేకపోయినా చూడగలవారు-ఈ నాటకంలో తారసపడతారు. ఈడిపస్ మొదటి తరహాకు చెందినవాడు. టైరీషియస్ రెండో రకం వాడు. ఈడిపస్ స్ఫింక్స్ ప్రశ్నలకు చిక్కు జవాబు చెప్పగలిగాడు కాని తన జీవితం లేవదీసిన చిక్కుప్రశ్నల్ని విప్పుకోలేక పోయాడు. ఆంతర సత్యాన్ని చూసిన తరువాత తన కళ్ళను తానే పొడుచుకొని గుడ్డివాడై పోతాడు.

ఈ కథాంశాలు (Themes) అన్నీ కూడా మనిషికీ, మానవాతీతమైన దైవ శక్తులకీ ఉన్న సంబంధాల్నీ, మనిషి తన విధిని తాను నిర్ణయించుకోవడానికి చేసే ప్రయత్నాల్నీ నాటకీకరిస్తున్నాయి. ఇవి అన్నీ యీనాటి మనిషికి కూడా వర్తిస్తాయి కనక, వెనక ఎన్నడూ భావించనంతగా మనిషి యీనాడు తన జీవితానికి తానే నిర్ణేతగా

ఖావిస్తున్నాడు కనక యీ నాటకం - 2500 సంవత్సరాల క్రితం వ్రాయబడ్డా - యీనాటికీ అర్థవంతం అవుతున్నది.

## ఇతివృత్త నిర్మాణం :

ఈడిపస్ నాటక ఇతివృత్త నిర్మాణాన్ని ఆనాటి గ్రీకుల నాటకాలలో అత్యుత్తమమైన ప్రయత్నంగా పేర్కొన్నాడు అరిస్టాటిల్. సంక్లిష్టమైన సన్నివేశాలను సొఫోక్లిస్ ఏవిధంగా మలుచుకున్నాడో జాగ్రత్తగా గమనిస్తే యీ విషయం మనకు స్పష్టం అవుతుంది. కథాగమనంలో పూర్వాపరాల చిత్రీకరణ జరిగిన విధానం ఆద్యంతమూ నాటకీయంగా వుంది. వెనక జరిగిన సంఘటనలు, నాటక కాలంలో జరిగిన సంఘటనలు-రెండూ ఏకకాలంలో జరగడంవల్ల - ఈడిపస్ ఒక సన్నివేశం తరవాత మరొక సన్నివేశంలో తన పాతజీవితం వెనకకు, ఇంకా వెనకకు పోవడంలో వర్తమానంలో తన ముగింపుకు ఇంకా ఇంకా దగ్గరగా వస్తున్నాడు - తనకు తెలియకుండానే!

నాటకం-అన్ని గ్రీకు నాటకాలకువలెనే - ఒక 'ప్రొలోగ్' (పూర్వరంగం)తో ప్రారంభమై, ఐదు 'ఎపిసోడ్స్' (సన్నివేశాలను) చిత్రీకరించిన తరవాత ఒక ఉత్తర రంగం (ఎపిలోగ్)తో ముగుస్తుంది. ప్రతి సన్నివేశం తరువాత బృంద గాయకుల గానం ఉండి తీరుతుంది. ఈ అయిదు సన్నివేశాలు తరవాత రోజుల్లో వచ్చిన అయిదంకాల నాటకానికి పూర్వ రూపమని నిర్ధారణ చేసిన విమర్శకులు ఉన్నారు.

పూర్వరంగం - పూర్వ కథాభాగాన్ని, ప్రస్తుత కథా బీజాన్ని స్థాపించడానికి ఉపయోగపడుతున్నది. దేశం సంక్షోభంలో ఉన్నదన్న పూజారుల వ్యథ, తాను చెయ్యవలసిందంతా చేస్తానన్న ఈడిపస్ హామీ, ఈ సంక్షోభానికి కారణమైన లయస్ హంతకుణ్ణి చంపాలన్న అపోల్లో మాటల్ని క్రియాన్ తీసుకు రావడం, దానిమీద ఆ హంతకుణ్ణి ఎలానన్నా పట్టుకుతీరతానని ఈడిపస్ ప్రతిజ్ఞ చెయ్యడం ఈ పూర్వ రంగంలో చూపబడ్డవి. అతి సంక్షిప్తంగా సాగిన యీ రంగంలో ''లయస్ హంతకుడెవరన్న'' ప్రశ్న ఉదయిస్తుంది. ఆ హంతకుడెవరో తెలుసుకోవడానికి జరిగిన ప్రయత్నం, ఆ ప్రయత్నంవల్ల తెలుసుకున్న నిజం ఈ పూర్వరంగ ఫలితాలు.

పూర్వరంగం తరవాత ''పారడాస్'' (బృందగాయకుల ''ప్రవేశ గానం'')లో బృంద గాయకులు థీబ్స్ స్థితికి విలపిస్తూ తమనీ, తమ దేశాన్నీ రక్షించమని అందరు దేవుళ్ళకూ విజ్ఞప్తులు చేస్తారు.

మొదటి సన్నివేశంలో ఈడిపస్ తన ప్రజలకు ఇస్తున్న హామీలో భాగంగా హంతకుణ్ణి శపిస్తాడు . . . ఈ ప్రకటనతో నాటకాంతం సాగే "నాటకీయ వ్యంగం" ప్రారంభం అవుతుంది. ప్రేక్షకులకీ, ఇతర పాత్రలకీ తెలిసి, అనుభవిస్తున్న పాత్రకి తెలియకుండా ఉంటే అతడన్న మాటలు, చేసిన చేష్టలు నాటకీయ వ్యంగ్యాన్ని సృష్టిస్తాయి. ఇక్కడ తనకు తెలియకుండానే హంతకుడిమీద శాపపరంపరను కురిపించిన ఈడిపస్ ఆ శాపాలన్నీ తనకే వర్తిస్తాయన్న విషయం తెలియనివాడు. ఈ కథ గ్రీసులో సర్వవ్యాప్తం కనక ప్రేక్షకులకు యీ శాపాలన్నీ ఈడిపస్‌కే వర్తిస్తాయని తెలుసు. ఈ నాటకీయ వ్యంగ్యాన్ని ఈడిపస్ నాటకం చూపినంత పటిష్టంగా మరే గ్రీకు నాటకం చూపించలేదు.

టైరీషియస్ వస్తాడు. క్రియాన్ సలహామీద టైరీషియస్‌ని పిలిపించడం నాటకీయతకు, నాటక సంఘర్షణకు బలాన్ని ఇస్తున్నది. లేకపోతే క్రియాన్, టైరీషియస్‌లు ఇద్దరూ కలిసి తనమీద కుట్ర పన్నుతున్నారన్న భావం ఈడిపస్‌కి రావడానికి వీలులేదు. సమాధానం చెప్పనని భీష్మించుకున్న టైరీషియస్ మీద ఈడిపస్ మండి పడతాడు. ఈడిపస్‌లో ఇనుమడించే యీ కోపం మొదటి నాలుగు సన్నివేశాల్లోనూ చాలా బలంగా కనిపిస్తుంది. రాజుగా ఈడిపస్‌లో ఉండవలసిన స్థైర్యం, మనిషిగా ఈడిపస్‌లో తేలికగా వచ్చే కోపం - ఈ రెంటి సంఘర్షణా కూడా నాటకీయతకు మూలం అని చెప్పొచ్చు. తేలిగ్గావచ్చే ఈకోపమే ఈడిపస్ లయస్‌ని చంపడానికి కారణమని మనం తరవాత తెలుసుకుంటాం. తన ప్రశ్నలకి టైరీషియస్ (కోపంతోనే) సమాధానంచెప్పే వేళకే ఈడిపస్ తనమీద ఏదోకుట్ర జరుగుతున్నదన్న అనుమానాన్ని పెంచుకుంటాడు. ఈ చిన్న మలుపు నాటకీయతకి చాలా అవసరం. లేకపోతే, టైరీషియస్‌ని పిలిపించి, అతనిని ప్రశ్నలడిగి, అతడు సమాధానాలు యిస్తే - ఇహ నాటక సంఘర్షణకు ఆలంబనం ఉండదు. సొఫోక్లిస్ హంతకుడి నిజాన్ని టైరీషియస్ మాటలద్వారా ముందుగానే వెల్లడించాడు. కాని దాని నిజానిజాల్ని ఈడిపస్ - టైరీషియస్‌ల కోపోద్రిక్తమయిన సంఘర్షణ మాటున ఇదమిత్థంగా తేల్చకుండా "సస్పెన్స్" లో ఉంచాడు. ఈడిపస్ అన్నట్లు, "మీకు భవిష్యత్తు అంత ఖచ్చితంగా తెలిస్తే, స్ఫింక్స్ వేసే ప్రశ్నలకి సమాధానం చెప్పలేదేం ? లయస్ చనిపోయినప్పుడు - అప్పుడే పక్షుల గానాల సహాయంతో మీరు హంతకుడెవరో తెలుసుకోలేదేం?'' పరస్పర నిందారోపణల స్థితిలో నిజాన్ని తాత్కాలికంగా తెరమరుగున ఉంటాడు సొఫోక్లిస్.

ఇక్కడ ఇతివృత్త నిర్మాణ విషయంలో ఒక విషయం గుర్తించాలి. మొదటి నాలుగు సన్నివేశాల్లోనూ కథ వర్తమానంలో ఎంత ముందుకు పోతుందో, అలానే -

ఈడిపస్ గత జీవితంలోకి ఇంకా ఇంకా వెనక్కు పోతూ వుంటుంది. ఈ మొదటి సన్నివేశంలో ఈడిపస్ థీబ్స్‌కు రావడానికి ముందు ఏం జరిగిందో వివరించబడ్డది. తరువాత వచ్చిన బృందగానం కూడా ఈ ద్వైదీభావాన్ని పునశ్చరణ చేస్తుంది. టైరీషియస్ - ఈడిపస్ - ఇద్దరూ మంచివారే! కాని ఇప్పుడూ ఈ సంక్షోభంలో ఆదుకునే దెవరు? ''పూర్వం ఇటువంటి సంక్లిష్ట పరిస్థితుల్లో ఈడిపస్ ఆదుకున్నాడు. ఇప్పుడూ అతడే ఆదుకోవాలి. తప్పుచేశాడని నిర్ధారణ అయ్యేవరకూ - అతని మీద నమ్మకం ఉంచుదాం'' - అంటుంది థీబ్స్‌కు చెందిన వృద్ధ పౌరులతో కూడిన గాయక బృందం.

రెండో సన్నివేశం క్రియాన్ - ఈడిపస్‌ల సంవాదంతో మొదలౌతుంది. క్రియాన్ ఎంత అడిగినా ఈడిపస్ క్రియాన్ మాటల్ని నమ్మే ప్రయత్నం చెయ్యడు. టైరీషియస్ చేసిన నేరారోపణ, దానికి వెనక క్రియాన్ ఉన్నాడన్న ఈడిపస్ నమ్మకం దీనికి కారణాలు. విషాద నాటక నాయకుడిగా ఈడిపస్‌లో ఉన్న రెండో లోపం యిది. సమస్యను రెండు వైపులా చూడలేని ఏకదృష్టి. (మొదటిది అనవసరమైన కోపం). జొకాస్టా, థీబ్స్ పౌరులూ కోరినా చాలసేపటివరకు ఈడిపస్ మనసు మారదు. ఈ మంకుపట్టుకు కారణం - తన వాదమే నిజమన్న ఈడపస్ గుడ్డి నమ్మకం. ఈ కోపానికి అసలు కారణం ఏమిటని అనునయిస్తూ అడిగిన జొకాస్టాకు సమాధానం చెప్పినప్పుడు తనమీద తనకు మొట్టమొదటిసారి అనుమానం వస్తుంది ఈడిపస్‌కు. జొకాస్టా ''దైవవాణి పలుకులను నమ్మనక్కరలేదు; నాకు పుట్టిన కొడుకును గురించి ఆ వాణి యిలా చెప్పింది. కాని అలా జరగలేదు, చూశారా'' అంటుంది. కాని ఆమె లయస్ ఎక్కడ మరణించాడో చెప్పిన వివరాలు ఈడిపస్ అనుమానానికి దారితీస్తాయి. ఆ సందేహనివృత్తికోసం ఆనాటి సంఘర్షణలో మిగిలి వున్న ఒక్క గొర్రెలకాపరిని త్వరగా పిలిపించమని తొందర పెడతాడు ఈడిపస్. ఈ రకంగా ఈడిపస్ ఆత్మవిశ్వాసం సన్నగిల్లడం, అతడు హంతకుడేమోనన్న ఆతృత ప్రేక్షకులకు కలగడం - ఈ సన్నివేశంలో రచయిత సాధించిన క్లిష్టమైన నాటకీయతకు దారితీసే విషయాలు. ఈ సన్నివేశం కూడా ఈడిపస్ గతాన్ని ఇంకా వెనక్కు తీసుకుపోయి కొరింత్‌లో అతడు గడిపిన జీవితాన్ని, డెల్ఫీ వెళ్లినప్పుడు విన్న మాటల్ని, ఆ తరువాత దోవలో జరిగిన హత్యా వివరాలు - మనకు తెలుస్తాయి.

ఆ తరువాత వచ్చిన బృందగానం దైవవాణిని గురించి జొకాస్టా తేలికగా, అపనమ్మకంగా మాట్లాడిన మాటల్ని పునశ్చరణచేస్తూ - భగవంతుడి మాటల మీద నమ్మకం అనివార్యం అనీ, వాటిని నమ్మకపోవడం అంటే భగవంతుడి ఉనికిని

నమ్మకపోవడమేననీ తీర్మానిస్తుంది. బృందగానం చివర ఈ సమస్యకు త్వరలో పరిష్కారం దొరకాలన్న కోరిక వెల్లడవుతుంది. ఇక్కడ బృంద గాయకులు మామూలు ప్రజలకు ఏ విధంగా ప్రతినిధులో వారిలో ఉండే ''భిన్నత్వంలో ఏకత్వం'' ఏ విధంగా ప్రతిబింబిస్తుందో చూపబడ్డది.

ఇంతకు ముందు సన్నివేశంలో జొకాస్టా దైవవాణిని తాను నమ్మను అని చెప్పినా, మూడో సన్నివేశంలో ఆమె జియస్ ఆలయానికి ప్రార్థనలు చెయ్యడానికి వస్తుంది. ఆమె ప్రార్థనలకు అంతరాయంగా కొరింత్‌నుంచి వచ్చిన వార్తాహరుడు ఈడిపస్ తన తండ్రిగా భావిస్తున్న పోలిబస్ మరణ వార్తను తెస్తాడు. ఈ వార్త దైవవాణి పలుకులను వమ్ముచేస్తున్నదని జొకాస్టా, ఈడిపస్‌లు కూడా భావిస్తారు. వార్తాహరుడు ఈడిపస్‌కు మంచి వార్తలు తెచ్చాననంటూనే ఆతడు కొరింత్‌కు రావడానికి ఇంకా భయ పడ్డాన్ని చూసి (తన తల్లి యింకా బతికేవుంది కనక) పోలిబస్ దంపతులకు ఈడిపస్ ఏమీకాడనీ, తాను స్వయంగా ఆయనకు పసిపాపడైన ఈడిపస్‌ను పెంచుకోవడానికి యిచ్చాననీ చెబుతాడు. చెప్పిన మంచివార్త దుఃఖానికి దారితీస్తుంది. దీనినే అవస్థా పరివర్తనం (reversal) అంటాడు. అరిస్టాటిల్ పరిస్థితుల్లో వచ్చిన యీ తారుమారు ఈడిపస్ పతనాన్ని ఇంకా దగ్గరకు తీసుకువస్తుంది. దీనికి పరాకాష్ఠ గొర్రెల కాపరివచ్చి, ఈడిపస్ ఒత్తిడిమీద నిజాన్ని చెప్పడం. ఈ పరిస్థితుల్లో కూడా ఈడిపస్‌ను ఈ సత్యా న్వేషణ నుంచి విరమింప చేయాలని చూస్తుంది జొకాస్టా. కాని పరిస్థితులు చేతులు దాటిపోయాయి. జొకాస్టా అతని దుర్గతికి చింతిస్తూ అక్కడ నుంచి పారిపోతుంది.

ఈ సన్నివేశంలో జొకాస్టాకు నిజం తెలిసిపోవడమే కాకుండా, కథ ఇంకా కొంత వెనుకకు పోయి - లయస్ మరణానికి ప్రాముఖ్యం యివ్వకుండా - ఈడిపస్ జన్మరహస్యానికి ప్రాముఖ్యతనిస్తుంది

ఈ జన్మరహస్యాన్ని గురించి ఇక్కడి బృందగాయకులు భావోద్వేగంతో గానం చేస్తారు. ఇక్కడ కథలో ఉత్సుకతని ఇనుమడింప చేయడానికి, కథాగమ నాన్ని ఆపుచేస్తాడు రచయిత. అయితే యీ బృందగానం కూడా సమస్యమీదనే కేంద్రీ కృతం అయింది; పర్యవసానాల్ని గురించి మాట్లాడకపోయినా.

గొర్రెలకాపరి - వార్తాహరుల సంభాషణల ద్వారా ఈడిపస్ జన్మ రహస్యం మనకు తెలుస్తుంది. (గతాన్ని అక్కడకు తీసుకుపోతాడు సోఫోక్లిస్.... "తిరోగమన" ఇతివృత్త నిర్మాణ పథకంలో) దానితోపాటే దైవవాణి చెప్పిన మాటల్లోని సత్యం వెల్లడి అవుతుంది, నిజం తెలిసిన వైక్లబ్యంలో, నిస్సహాయతలో ఈడిపస్ పెట్టిన కేక

ఈ కథకు పరాకాష్ఠ. ఆ తరువాత వచ్చే క్లుప్తమైన బృందగానంలో విధి విధానంలో వున్న ఒడిదుడుకులను గురించీ, అందుకు ఉదాహరణగా చెప్పుకోదగిన ఈడిపస్ జీవితం గురించీ వ్యాఖ్యానం ఉంది.

చివరి సన్నివేశంలో రెండు భాగాలున్నాయి. ఒకటి అంతఃపుర వార్తాహరుడు తెచ్చిన విషాద వార్తలు; రెండోది ఈడిపస్ అంతిమ నిర్గమనం. "అంతఃపుర వార్తా హరుడికథనం" గ్రీకు నాటకాలన్నింటిలోనూ తప్పకుండా ఉండే సన్నివేశం. కథా కథనం అవసరం అయినప్పుడల్లా యిలా వార్తాహరుల్ని ప్రవేశం పెట్టడం దాదాపు అన్ని నాటకాల్లోను మనం చూడవచ్చు. పైగా, భారతీయ నాటక ఆచారాలకు మాదిరి గానే గ్రీకులలో కూడా హత్యను, మరణాన్ని రంగస్థలం మీద చూపడం జరగదు. అందువల్ల రంగస్థలం వెనుక జరిగిన జొకాస్టా ఆత్మహత్య, ఈడిపస్ తన కళ్ళను తానే పొడుచుకొని గుడ్డివాడు కావడం - ఈ రెండు సంఘటనలను వార్తాహరుడు నివే దిస్తాడు థీబ్స్ ప్రజలకు. ఆ తరువాత ఈడిపస్ వచ్చి తనకుతానే విధించుకున్న యీ శిక్షకు కారణాలు చెప్పుకొని, తన కుమార్తెలిద్దర్నీ ఓదార్చి, థీబ్స్ విడిచిపోవడానికి ఆయత్తం అవుతాడు, క్షుభిత హృదయంతో.

నిర్మాణం దృష్ట్యా చూస్తే ఈ సన్నివేశం మిగిలిన గ్రీకు నాటకాల ముగింపు సన్నివేశాల కన్న భిన్నంగా కనిపిస్తుంది. ఏ ఇతర నాటకంలోను ముగింపు సన్నివేశం యింత పెద్దదిగా లేదు. అందువల్ల లయస్ మరణానికి కారణాలను విప్పి చెప్పడం రచయిత నాటకోద్దేశ్యం కాదనీ, నిజం తెలిసిన ఈడిపస్ ఇప్పుడేం చేస్తాడూ అనే విషయం మీదకు కేంద్రీకరించబడింది - అనీ తెలుస్తుంది. అంటే-ఇంతవరకు థీబ్స్‌కు రాజైన ఈడిపస్‌ను గురించి చర్చిస్తే, ఈ సన్నివేశంలో వ్యక్తిగా ఈడిపస్ స్థితిని గురించి వివరించింది - అన్నమాట.

ఈడిపస్ తన కళ్ళను తానే పొడుచుకోవడం ఆ పాత్రను ఇంతవరకు తీర్చి దిద్దిన విధానానికి వ్యతిరేకంగా ఉందనుకొనేవారు లేకపోలేదు. ఇంతవరకు తాను నిజంకోసం పొట్లాడిన వాడు. తన తప్పులేకుండా తనకు తానే శిక్షించుకోవడం సమర్థనీయం కాదేమోనన్న అనుమానాన్ని వీళ్ళు వ్యక్తం చేశారు. అయితే తాను ప్రభువుగా ఉన్నప్పుడు చేసిన శాసనాలను, కేవలం ఒక వ్యక్తిగా, పౌరునిగా అమలు జరపాలన్న నైతిక నిష్ఠాపాలనమే ఈడిపస్ చేత ఈపని చేయించిందని నాటకంలో చివర ఈడిపస్ చేత చెప్పిస్తాడు రచయిత. తండ్రిని చంపడం, తల్లిని పెళ్ళి చేసుకోవడం - ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైన విపరీతమూ, సంఘ బహిష్కృతమూ - అయిన విషయాలే! అందువల్లనే తెలియక తప్పుచేసినా చేసింది

తప్పు కనక దీనికి బాధ్యతవహించే వ్యక్తిగా, అప్పటివరకు రాజ్యంచేసిన అధినేతగా తన శాసనానికి తానే కట్టుబడిపోయాడు ఈడిపస్. ఈడిపస్‌లో ఉన్న యీ మానసిక సంఘర్షణ - ఒక పక్క నిజం కోసంపడ్డ కష్టాలు; రెండో పక్క ఆ నిజం తెచ్చిన ప్రమాదాలు - వీటిమధ్య చిక్కుకున్న మంచి మనసున్న రాజు కావడంవల్లనే అతని బాధలకు మనం విచలితులం కావడం; అందువల్లనే ఈ సంఘటనలు మనలో ఈడిపస్ అంటే సానుభూతి (pity) నీ, దారుణమైన అతని పతనానికి భయాన్నీ (fear) కలగచేస్తాయి.

''ఈడిపస్'' లో స్థల - కాల - క్రియా ఐక్యతలను పాటించడం జరిగింది. నాటకంలో ఎక్కడా కథా నిర్వహణకు అవశ్యకం కాని ఒక సంఘటన కనిపించదు. రెండు ఇతివృత్తాల జోడింపుకాని, ఇతివృత్త సంకీర్ణత (complexity) కాని కనిపించవు. నాటకంలో కథా కాలమూ, నాటక ప్రదర్శనా కాలం దాదాపు సరిపోవడం యీ నాటకంలో కాల - ఐక్యత దృష్ట్యా సాధించిన విశేషం. అన్ని సంఘటనలూ ఒకేచోట జరగడం స్థల ఐక్యతకు ఉదాహరణ. అనవసరమైన కథా భాగాలను పరిహరించి అవసరమైన సంఘటనలను కూడా కుదించి నాటక నైశిత్యానికి తోడ్పడే సన్నివేశాలను స్వీకరించి ఏకసూత్రంగా నాటకాన్ని నడిపించడం సొఫోక్లిస్ సాధించిన క్రియా-ఐక్యత (unity of action) కు నిదర్శనం

## పాత్రచిత్రణ, నటన :

పాత్రల శారీరక వయో లక్షణాలను గురించి, సొఫోక్లిస్ మనకు ఏమీచెప్పడు. ముఖ్యమైన పాత్రలు మూడూ-ఈడిపస్, క్రియాన్, జొకాస్టాలు-జీవితంలో అనుభవజ్ఞులని మాత్రం మనకు తెలుసు. వాళ్ళ వయస్సుల వివరాలను గాని, వాళ్ళు ఎలా వుంటారని కాని మనకేం చెప్పడు రచయిత. ఆయా పాత్రల స్వరూప వివరాలు ఆ పాత్రధారులు ధరించే కరాళం(మాస్క్) మాటున దాగి వుంటాయి కనక ఆ విషయం అనవసరం అనుకొని వుండొచ్చు. కాని తగిన వయసును చూపడం కరాళాలద్వారా కూడా సాధ్యం అని గ్రీకు నాటక ప్రదర్శనల వివరాలు తెలియ చెబుతున్నాయి. ముఖ్యంగా జొకాస్టా - ఈడిపస్‌ల వయసు వివరాలు, వయోభేదం - ఇవి ఆధునిక పాఠకులని, ప్రేక్షకులని కూడా కలవర పరిచే విషయం. ఆ విషయాన్ని ఎక్కడా చూచాయగా కూడా స్పృశించ లేదు సొఫోక్లిస్. దానికి ఒక్కటే కారణం: అది తాను ఎన్నుకున్న నాటక కథకి అనవసరం. పురాణ గాథను అనుసరించి ఈడిపస్ స్ఫిన్క్స్ ప్రశ్నలకు జవాబులు చెప్పే నాటికి జొకాస్టా రాణిగా వుంది. రాజు మరణించాడు; స్ఫిన్క్స్‌ను ఈడిపస్ జయించి, ప్రజల కోరిక మేరకు తాను థీబ్స్‌కు రాజయ్యాడు. అప్పుడు రాణిగా ఉన్న జొకాస్టా - ఆ నాటి

ఆచారాన్ననుసరించి ఈడిపస్‌కు రాణి అయింది. వయసుల్లో వుండే తారతమ్యాన్ని బట్టి వివాహం జరుగుతుందా - అన్న విషయం సొఫోక్లిస్ పరిధిలోకి (అంటే నాటక పరిధి లోకి) రాని విషయం. అందుకే దానిని పరిత్యజించాడాయన.

ప్రధాన పాత్రల వయసు వివరాలు ఇవ్వని సోఫోక్లిస్ చిన్న పాత్రల వివరాలు కొన్ని చెప్పాడు. జియస్ పూజారిని వృద్ధుడని సంబోధిస్తాడు ఈడిపస్. థీబ్స్‌లోని వయో వృద్ధులైన పౌరులతో కూర్చబడ్డది బృందగానం. టైరీషియస్ వృద్ధుడూ, అంధుడూ. గొర్రెలకాపరి మరీ ముసలివాడు. ఇక్కడ ప్రతివారి విషయంలోనూ - వృద్ధాప్యం మనో పరిపక్వానికి ప్రతీకగా చూపించబడ్డది. వీళ్ళకు ప్రతిగా వయసులో చిన్నవాళ్లు చాలా మందివున్నారు. ఊళ్ళో పూజారులతోపాటు వచ్చిన "నవనవోన్మేష లైన యువకులున్నారు". ఆంటిగనె, ఇస్‌మీన్‌లు ఉన్నారు. వాళ్ళెవరికీ ఏ రకమైన సంభాషణలూ లేవు. వారి ముగ్ధత్వం - మాటలు మాట్లాడలేని మూగతనం-వారి యెడ మనకు సానుభూతిని కలగచేస్తుంది.

సాంఘిక పరంగా కూడా సోఫోక్లిస్ యీ పాత్రలను గురించి ఎక్కువగా చెప్పడు. ఈడిపస్, క్రియాన్, జొకాస్టాలు ముగ్గురూ సమానమైన రాజ్యాధికారం కలవారు. కాని ఈడిపస్ రాజు మిగిలిన ఇద్దరి పక్షాన రాజ్యాన్ని పరిపాలిస్తూవుంటాడు. వృత్తిపరంగా చూపిన పాత్రలు కూడా కొన్ని వున్నాయి. పూజారి, ప్రవక్త, గొర్రెల కాపరి, సేవకులు, రక్షకభటులు .. ఇలా !

అయితే సోఫోక్లిస్ ఆయా పాత్రల మానసిక, నైతిక ప్రవర్తనాంశాలను గురించి మాత్రం వివరిస్తాడు. ఉదాహరణకు ఈడిపస్ వయసు మనకు తెలియదు, కాని అతని నైతిక విలువలను గురించి మనకు తెలుసు. తాను శాసించిన విధానాలను తాను అమలు పరచవలసిన నైతిక బాధ్యతలు గుర్తించినవాడు. జొకాస్టాను గురించి కూడా అంతే ! ఆవిడకు ఈడిపస్‌ను అనునయించడం తెలుసు; అతనికి క్రియాన్‌కి సంధి చేయగలదు. ఈడిపస్‌ను యీ సత్యాన్వేషణ నుంచి విరమింప చెయ్యాలనే ఆలోచన ఉంది. ఆ ప్రయత్నమూ చేసింది. అయితే తల్లిగా ఆమె ఎటువంటిదో మనకు తెలియదు. వీరిద్దరితోనూ పోలిస్తే, క్రియాన్‌ను గురించి తక్కువే చెప్పాడు రచయిత. ఈడిపస్ నమ్మిన స్నేహితుడు; తన గౌరవాన్ని కాపాడుకోవడం తన కర్తవ్యం అని నమ్మినవాడు. ప్రపంచజ్ఞానం వుంది; నైతిక దృఢత్వమూ వుంది.

ఈ విధంగా అతి తక్కువ వివరాలతో - ఆ పాత్రల్ని మనముందు రూపు కట్టి స్తాడు సొఫొక్లిస్. ఆధునిక నాటకకర్తలకి సొఫోక్లిస్‌కీ ఇక్కడే భేదం ఉంది. ఆ ధనికులు

ఎన్నో చిన్న చిన్న వివరాలతో పాత్రల సంపూర్ణ స్వభావాల్ని చిత్రిస్తే, broad strokes తో అంతటి నిశితమైన పాత్రల్ని చిత్రించాడు సొఫోక్లిస్.

ఆనాటి ప్రదర్శనలలో ముగ్గురే నటులుండేవారు. వారే అన్ని పాత్రల్ని ధరించేవారు. అలా పాత్రలను మార్చడానికి కరాళాలు, వేషభూషలు ఉపయోగించేవారు. ఈడిపస్ నాటక ప్రదర్శనలో యీ ముగ్గురు నటులూ ఆయా పాత్రల్ని యీ విధంగా ధరించేవారనడానికి అవకాశం ఉంది: మొదటి నటుడు ఈడిపస్ పాత్రను ఆసాంతం ధరించేవాడు. రెండో నటుడు క్రియాన్, కొరింత్ నుంచి వచ్చిన వార్తాహరుడు - యీ పాత్రలని ధరించేవాడు. మూడో నటుడు పూజారి, టైరీషియస్, జొకాస్టా, గొర్రెలకాపరి, అంతఃపుర వార్తాహరుడు - ఇన్ని వేషాలు ధరించేవాడు. నిజానికి మూడో నటుడు ధరించే పాత్రల వైవిధ్యం చూస్తే అతడు కూడా ఎంతో ప్రతిభావంతుడై, పాత్రకు పాత్రకు ఉండే అంతరాలని తన నటనలో చూపించవలసిన అవసరం ఉంది - అనిపిస్తుంది.

మాట్లాడే పాత్రలు మూడే అయినా, రంగస్థలం మీదకు వచ్చే పాత్రలు మాత్రం చాలామంది. ఇందులో ఆర్తులైన ప్రజలు, కోరస్ వృద్ధులు, పరిచారకులు, రక్షకభటులు - వీరంతా వస్తారు. మొదటి సన్నివేశంలో వచ్చిన కొందరు తరువాతి సన్నివేశాల్లో రక్షకభటులుగాను, పరిచారకులుగాను, ఆంటిగొనె, ఇస్మీన్‌లుగాను రావచ్చు. ఏమైనా మొత్తం నటీనటవర్గం 35 మందికి తక్కువ ఉండే వీలులేదు.

పాత్రల స్వభావాలకు మాదిరిగానే వారు చేసే నటనావిధానాన్ని గురించి కూడా సొఫోక్లిస్ మనకేం చెప్పలేదు. నాటకాన్ని బట్టి వాళ్ళవాళ్ళ రంగస్థల కదలికలూ స్వల్పాలే! ప్రవేశ నిష్క్రమణలు, ప్రార్థనలు జరపడం, ముసలి గొర్రెలకాపరిని బాధించడం, కోపగించుకోవడం - ఇంతే! కరాళాలను ఉపయోగించడం, రెండు,మూడు పాత్రలను ఒకరే ధరించడం, పురుషులే స్త్రీ పాత్రలను ధరించడం, కదిలికలు అతి స్వల్పంగా ఉండడం - వీటన్నింటిని బట్టిచూస్తే - సొఫోక్లిస్ తమతమ అంతస్థులను బట్టి, ప్రదేశాన్నిబట్టి, సమయా సమయాలనుబట్టి ఆ పాత్రల ప్రవర్తన ఆధారపడి వుంటుందనీ, అది నటులకూ, ప్రేక్షకులకూ - ఇద్దరికీ తెలిసిన విషయమనీ, దానిని వివరించవలసిన అవసరం లేదనీ అనుకొని వుండవచ్చు. మొత్తం మీద పైవిషయాలను బట్టి ఆనాటి నాటకప్రదర్శన ఈనాటి ప్రదర్శనలకు మాదిరిగా వాస్తవికతకు దగ్గరగా ఉండేది కాదని, 'నాట్యధర్మి'కి దగ్గరలో వుండేదని మనం గ్రహించగలం.

## "ఈడిపస్" : నాటకీయ వ్యంగ్యం (Dramatic Irony)

గ్రీకు నాటకకర్తలందరూ తరతరాలనుంచివస్తున్న పురాణగాథల్నే (myths) నాటకీకరించారు. అయినా ఉన్న పురాణగాథకు ఏవో కొత్త అంశాలు చేర్చి నాటకాలు వ్రాయడానికి ప్రయత్నించినా ఆధునిక నాటక ఇతివృత్తంలో వుండే కొత్తదనం ఈ నాటకాల్లో కనిపించదు. పురాణగాథలు ఉపయోగించడంవల్ల రచయితలకు కొన్ని లాభాలు ఉన్నాయి. ఒకటి, ఆ నాటకాలకు అధికారికత రావడం. కేవలం వినోదాన్నివ్వడమేకాక జాతిచరిత్రను చెప్పే చరిత్ర - పురాణం. ఆనాటి మత, నైతిక విషయాల క్రోడీకరణ పురాణం. ఒక జాతి చారిత్రక, మత, నైతిక అనుభవాలనన్నింటినీ సంపుటీకరించిన గాథలు పురాణగాథలు.

పురాణగాథలు నాటక రచయితకు మరో రకంగా కూడా సహకరిస్తాయి. నాటక ప్రారంభానికి కావలసిన ప్రాథమిక కథారంభాన్ని (exposition) సమకూర్చి పెడతాయి. పురాణగాథలు ఇదివరకే తెలిసివున్న ప్రేక్షకులకు పూర్వకథావృత్తాంతాన్ని చెప్పడం, పాత్రలను పరిచయం చెయ్యడం చాలా తేలికైన పని. పురాణగాథ నాటకంలో ఎక్కడ మొదలౌతున్నది; ఏయే పాత్రలు ప్రధానాలు-అని తెలియచెబితే చాలు మిగిలిన విషయాలన్నీ ప్రేక్షకులే గ్రహించడానికి వీలుంది

అంతేకాదు, కథలో ఆ తరువాత ఏం జరుగుతుందో కూడా ప్రేక్షకులకు తెలుసు. అంటే పాత్రకు తెలియని చాలా సంగతులు (ఆ పాత్రను గురించి) ప్రేక్షకులకు ముందే తెలుసు. అలా తెలియడంవల్ల ఏర్పడ్డ వ్యంగ్యాన్ని నాటకీయ వ్యంగ్యం (Dramatic irony) అంటారు. తెలిసిన విషయాల్లో ఉండే అంతరం విషాదాంతానికి దారితీస్తే దానిని విషాద నాటకీయ వ్యగ్యం (tragic irony) అనీ, అది హాస్యానికి దారితీస్తే ఆహ్లాద నాటకీయ వ్యంగ్యం (comic irony) అనీ అంటారు. ఈ వ్యంగ్యం గ్రీకు నాటకాల ప్రత్యేకత. ఒక విషయాన్ని గురించి సంభాషించే పాత్రలకన్న ఆ విషయాన్ని గురించి విన్నే ప్రేక్షకులకు ఎక్కువ తెలిస్తే దానిని నాటకీయ వ్యంగ్యం అంటారు. ప్రేక్షకులు పూర్వాపరాలు తెలిసినవారుకనుక వారు తమకు తెలిసిన విషయాలు ఆధారంగా ఆయా పాత్రలు చెప్పే విషయాలను ఆకళింపు చేసుకుంటారు. ఉదాహరణకు ఈడిపస్‌ను గురించి ప్రేక్షకులకు ముందే తెలుసు. అతడి స్థితిగతులు తెలుసు. అతడి పూర్వ చరిత్ర తెలుసు. అతడికి కలుగబోయే ఉపద్రవం తెలుసు ఈ విషయ గ్రహణం వల్ల వాళ్ళు ఆ పాత్ర చెప్పే, చేసే ప్రతి పనినీ బేరీజువేస్తారు. నిజానికి బెర్నార్డ్ నాక్స్ (Bernard Knox) అన్నట్లు ఈ విషయంలో ప్రేక్షకుడు పూర్వాపరాలు తెలిసిన

భగవంతుడితో సమానంగా ఉన్నాడన్నమాట. అంటే ప్రేక్షకుడు భూత భవిష్యత్ వర్తమానాలలో జరిగిన అసలు విషయాల ఆకళింపు ఉన్నవాడు కనుక ఆ జ్ఞాన దృష్టితో ఆయా పాత్రల చేష్టల్ని, సంభాషణల్ని అర్థం చేసుకుంటాడు. ఈ స్థితి గ్రీకు నాటకానికి ఒక వైశిత్యాన్ని ఒక వైలక్షణ్యాన్ని ఆపాదిస్తున్నది. ప్రేక్షకులు నాటకాన్ని రెండు అంచెల్లో గ్రహిస్తున్నారన్నమాట. ఒకటి నాటకంలో నడుస్తున్న కథ - సంఘటనలు. వానితో తాదాత్మ్యం చెందే మామూలు ప్రేక్షకుడి స్థితి. (ఈడిపస్ పడుతున్న బాధలని, అతడి ఆవేదనని, వాటిని అధిగమించి నిజాన్ని తెలుసుకోవడానికి అతడు చేస్తున్న ప్రయత్నాలని చూసి అతని స్థితితో తాదాత్మ్యం చెందే స్థితి); అదే సమయంలో ఆ నాటకీయ తాదాత్మ్యం నుంచి విడివడి తనకు ఆ కథను గురించి తెలిసిన సమగ్ర విజ్ఞానం ఆధారంగా ఆ పాత్రను బేరీజువేయడం - రెండోది.

ఈ నాటకీయ వ్యంగం "ఈడిపస్" నాటకంలో ఉన్నంత పటిష్టంగా మరో నాటకంలో కనిపించదు. నాటకం ఆద్యంతమూ - ముఖ్యంగా ఈడిపస్ మాటలవల్ల, చేతలవల్ల యిది వెల్లడి అవుతూనే వుంటుంది. ఈడిపస్ పాత్ర చిత్రణం దగ్గరనుంచి అంతా తనకు తెలుసునన్న గర్వం, తాను థీబ్స్‌ను రక్షించగలనన్న అతడి ధీమా, హంతకుడెవరో తెలుసుకొని తీరతానన్న అతని పంతం - వీటన్నిటి వెనక అతనికి కలగబోయే పతనావస్థ ప్రేక్షకులకు ప్రతిక్షణం ద్యోతకం అవుతూనే వుంటుంది.

ఈడిపస్ చెప్పిన మాటలు ఇందుకు దోహదం చేస్తాయి :

నిజం తెలుసుకోడానికి
స్వయంగా వచ్చాను
విశ్వవిఖ్యాతుణ్ణి
ఈడిపస్ మహారాజుని. (10-14)

సరే ! నేనే విచారణ జరుపుతాను.
ఈ హత్య వెనక వున్న రహస్యాన్ని వెలికితీస్తాను. (151-152)

చనిపోయిన మహారాజు నాతండ్రేనని భావిస్తాను
మహారాజు హంతకుణ్ణి బట్టబయలు చేస్తాను. (283-84)

ఈవిధంగా ఈడిపస్ చేసిన ప్రతిజ్ఞలకు భవిష్యత్తులో అవి అతడికే వర్తించడానికి గల పోలికలు నాటకీయ వ్యంగ్యాన్ని సృష్టిస్తున్నాయి.

ఈ నాటకంలో కొరింత్ నుంచి వచ్చిన వార్తాహరుడితో ఈడిపస్ జరిపిన సంభాషణ అంతా నాటకీయ వ్యంగ్యానికి మంచి ఉదాహరణ. తాను ఈడిపస్‌కు మంచి విషయాలు చెబుదామని వచ్చి అతని జీవిత రహస్యాన్ని తెలుసుకోవడానికి, దానితో పాటు అతని పతనానికి కారకుడౌతాడు వార్తాహరుడు.

అతి చిన్న విషయాలలోకూడా ఈ నాటకీయ వ్యంగ్యం పాత్రల గుణగణాల్ని, చేష్టల్ని వ్యాఖ్యానించడానికి పనికివస్తుంది. దైవవాణిని గురించి జొకాస్టా, ఈడిపస్‌ల చులకన భావం, ఆ దైవవాణి మాటలే చివరకు నిజం కావడం విషాద నాటకీయ వ్యంగ్యానికి అత్యుత్తమ ఉదాహరణ.

## "ఈడిపస్" నాటకం గొప్పతనం ఏమిటి ?

అరిస్టాటిల్ దగ్గర నుంచి ఫ్రాయిడ్ దాకా - దాదాపు రెండువేల సంవత్సరాల పాటు-ప్రతి విమర్శకుడూ "ఈడిపస్" నాటకాన్ని నాటక చరిత్రలోనే అద్వితీయమైన రచనగా పేర్కొన్నారు. దీనికి కారణం ఏమిటి ? అందులోని కథా ? ఆ కథను నాటకీకరించిన విధానమా ? అందులోవున్న తాత్త్విక చింతనా? లేక, అందులోని మనస్తత్వ విశ్లేషణా ? ఒక్కొక్కరు ఒక్కొక్క కారణంవల్ల ఈ నాటకం గొప్పదన్నారు ఇందులోని సార్వకాలికతకూ, సార్వజనీనతకు గల కారణాలను బేరీజువేసేముందు ఈ నాటకాన్ని గురించిన కొన్ని ప్రఖ్యాత సిద్ధాంతాలను. దృక్పథాలను పరిశీలిద్దాం.

## అరిస్టాటిల్ "నిర్దిష్టదోష" (hamartia) సిద్ధాంతం :

ఇంతకు పూర్వమే ఈ నాటకాన్ని గురించి అరిస్టాటిల్ ఉద్దేశ్యాలేమిటో స్థూలంగా గమనించాం. ఈ విషాద నాటకం గొప్పతనం అంతా సొఫొక్లిస్ కూర్చిన ఇతివృత్త (Plot) నిర్మాణంలో ఉన్నదంటాడు అరిస్టాటిల్. "కావ్యశాస్త్రం" (Poetics) లో దీనిని గురించి ఎన్నోసార్లు ప్రస్తావించినా, నాలుగు సందర్భాలలో మాత్రం దీని గొప్పతనాన్ని ఇతర నాటకాలతో పోల్చిచెప్పడం జరిగింది. ఈ నాలుగు సందర్భాలలో మూడు ఇతి వృత్తానికి సంబంధించినవి; ఒకటి పాత్ర చిత్రణకు సంబంధించినది. "ఎస్కిలస్ నాటకాలు 'ఏగమెమ్‌నాన్' 'ప్రొమీథియస్' లలో కనిపించని ఆదర్శవంతమైన, ఇతివృత్త నిర్వహణకు కీలకమైన అవస్థా పరివర్తనము (reversal), అభిజ్ఞ (recognition) ఇందులో ఉన్నాయి" అంటాడు అరిస్టాటిల్. అలాగే "ఈ నాటక ఇతివృత్తంలో విషాద భావావస్థకు దారితీసే కారణాలను సొఫొక్లిస్

జాగ్రత్తగా కూర్చుకున్నాడం''టాడు. ''మానవాతీత విషయాలను, స్వయం వివర జాత్మకాలు కాని విషయాలను నాటక పరిధికి దూరంగా ఉంచాడు'' అంటాడు. ఇవి ఈ నాటక ఇతివృత్తాన్ని గురించి అరిస్టాటిల్ చేసిన ప్రశంసలు. ఇక 13 వ అధ్యాయంలో పాత్ర పోషణని గురించి చెబుతూ - అందులో రెండు రకాల నాయక పాత్రలని గురించి (ఉదాత్తుడిని గురించీ, అధముడిని గురించి) చెప్పిన తరువాత ''పైన చెప్పిన రెండు రకాల పాత్రలకు మధ్యస్తంగా ఉండే మరోరకం పాత్ర ఉంది. అతడు నైతికంగాగాని, తన నడవడికలోగాని ఉదాత్తుడూ కాడు; అతని పతనం అతనిలోని దుష్టత్వంవల్లా కాదు. ఆ పతనం అతనిలోని ఒకానొక నిర్దిష్టదోషం (**hamartia**) వల్లనే'' అని చెబుతూ అటువంటి వ్యక్తి "ఈడిపస్ మాదిరిగా గొప్పవాడో, భాగ్య వంతుడో అయివుండాలి'' అంటాడు అరిస్టాటిల్.

ఈ వివరణలు చూస్తే - అరిస్టాటిల్ ''ఈడిపస్" నాటకంలోని ఇతివృత్త నిర్మా ణానికి అత్యంత ప్రాధాన్యం యిచ్చాడని స్పష్టం అవుతున్నది. **hamartia** విషయం ఒక్కటే పాత్రచిత్రణను గురించి ఆయన చెప్పింది. ఇక్కడ **Hamartia** అనే మాటకు రెండు అర్థాలు చెబుతున్నారు విమర్శకులు. ఒకటి "శీలలోపం" (**flaw of character**). అంటే ఇతర అన్ని విషయాలలో లోపం లేనివాడై ఒకే ఒక్క విషయంలో (అతిగా కోపమో, మోహమో, తదితర వ్యామోహమో ఎక్కువగా ఉండడం వలన) అతడి పతనం సంభవిస్తున్నది - అని భావించారు కొందరు. మరికొందరు **hamartia** కు ''నిర్ణయాల్లో చేసిన పొరపాటు'' (**error of judgment**) అనే అర్థం చెప్పారు. కాని ఈ రెండు అర్థాలలోను అతడి పాత్రను గురించిన ఒక లక్షణం మాత్రం సామాన్యం - అది - అతడు నైతికంగా ఉత్తముడు కాడు - అని.

అయితే, ఆ వ్యక్తి పతనానికి ఈ రెండింటిలో ఏది కారణమో అరిస్టాటిల్ చెప్పడు. ''హామర్షియా"కు ఉన్న అనేకార్థాల సంశయంలో అరిస్టాటిల్ చెప్పదలుచు కున్న అసలు భావం మరుగునపడ్డది. విమర్శకులు మాత్రం ఆ అర్థాలను ఈడిపస్ పాత్రకు అన్వయించి నాటకాన్ని విశ్లేషణ చేయడానికి ప్రయత్నించారు. ఈడిపస్ కోపిష్టి అనీ, టైరీషియస్, క్రియాన్‌ల మీద అతడి కోపం అనవసరమనీ, సమర్థనీయం కాదనీ, ఇవే అతని ''శీలలోపం'' అనీ కొందరు అంటే, మరికొందరు ఈడిపస్ తల్లినీ తండ్రినీ గుర్తించలేకపోవడం, అనుమానం వచ్చినా నిజంకోసం పాకులాడటం - వీని వల్ల అతని నిర్ణయ విధానంలో లోపం వుందనీ, అదే అతని పతనానికి దారితీసిందనీ పేర్కొన్నారు. నాటక సన్నివేశాల దృష్ట్యా పరిశీలిస్తే, ఈడిపస్ కోపం సహేతుకమే

ననిపిస్తుంది. నిజానికి జొకాస్టా, ఆమెతోపాటు పౌరుల నాయకుడు సర్ది చెప్పిన తరువాత క్రియాన్‌ను శిక్షించాలన్న అభిప్రాయం నుంచి విరమించుకున్నాడు ఈడిపస్. అలాగే, నిర్ణయ విధానం విషయంలో కూడా. నాటకం మొత్తం మీద ఒకే ఒక్కచోట ఈడిపస్ తొందరపడ్డాడనిపిస్తుంది - అది హంతకుణ్ణి శపించడంలో! అయితే ఈడిపస్ పతనానికి అతని శాప వచనాలకి ఏమాత్రం సంబంధం లేదు. అందువల్ల ఈడిపస్ పాత్రలో ఉన్నదని అరిస్టాటిల్ చెప్పిన **hamartia** వల్లనే అతని పతనం సంభవించింది - అని మనం చెప్పడానికి వీలున్నట్లు కనిపించదు. అరిస్టాటిల్ ఈ మాటను (hamartia) ఆనాటి ఇంకే అర్థంలోనన్నా ఉపయోగించాడా-అన్నది వివాదగ్రస్తం.

## విధి విధాన (fate) నిరూపకం :

ఈ నాటకం విధి విధాన నిరూపకమన్న (**tragedy of fate**) బలమైన ఒక వాదం ఉంది. ఈ వాదం చాలవరకు ఆమోదయోగ్యమే! అయితే ఈ వాదం అటు ఈడిపస్ పురాణగాథకూ, సొఫోక్లిస్ దానిని స్వీకరించి నిర్మించిన ఇతివృత్తానికి మధ్య ఉండే అంతరాన్ని ఏమాత్రం ప్రస్ఫుటం చెయ్యడంలేదు పురాణగాథలో కూడా ఇదే బల మైనకథా వస్తువు. కేవలం విధి విధానాన్ని నిరూపించడాన్ని మాత్రమే యథాతథంగా సొఫోక్లిస్ నాటకీకరిస్తే అరిస్టాటిల్ నుంచి ఫ్రాయిడ్ వరకు వేలకొలది విమర్శకులు, అసంఖ్యాకమయిన చదువరులు, ప్రేక్షకులు ఈ నాటకం వల్ల యింతగా ప్రభావితం అయ్యేవారా ? ఇదే కథా వస్తువుతో ఎన్ని నాటకాలు లేవు కనక ? పైగా ఎప్పుడో పురాణ కాలంలో జరిగిన ఒక కథను ఇవ్వాళ నాటకీకరించినంత మాత్రాన అది సర్వ జనప్రియమై పోతుందా ? - ఈ ప్రశ్నలకి సమాధానాలను మాత్రం ఏ విమర్శకుడూ యివ్వలేదు.

అందువల్ల "విధి విధానాన్ని నిరూపించడం" అన్నది పురాణ గాథను గురించిన విమర్శే కాని సొఫోక్లిస్ నాటకాన్ని గురించి మాత్రమే కాదని నిర్ధారణ చేసుకోవలసి వస్తున్నది - అది నాటకంలో ఓ ముఖ్యమయిన కథాంశం అయినప్పటికీ.

## ఫ్రాయిడ్ నిర్వచించిన ''ఈడిపస్ కాంప్లెక్స్'' (Oedipus Complex) సిద్ధాంతం :

ఈడిపస్ నాటకం ఆధారంగా ఇటీవలి కాలంలో వచ్చిన అతి ముఖ్యమైన సిద్ధాంతం ఫ్రాయిడ్ ప్రతిపాదించిన "ఈడిపస్ కాంప్లెక్స్" (**Oedipus Complex**). ఒక సాహిత్య రచన ఆధారంగా ఒక మనో విశ్లేషణ సిద్ధాంత ప్రతిపాదన జరగడం

ఇదే ప్రథమం! ఒక రకంగా ఈడిపస్ నాటకం ఈ సిద్ధాంతంవల్ల ఎక్కువ ప్రచారం పొందిందని చెప్పినా అతిశయోక్తి కాదు. "మున్నెన్నడూ మానవాళిని మరే సాహిత్య రచనా ప్రభావితం చేయనంతగా ఈడిపస్ నాటకం ప్రభావితం చేసింది"అని చెబుతూ, దానికి కారణం "ఈడిపస్ మానవజాతికి ఒక విధమైన ప్రతినిధి" (mea res agitur) అని తన సిద్ధాంతానికి ప్రాతిపదికగా పేర్కొన్నాడు ఫ్రాయిడ్. ఆతరువాత ఫ్రాయిడ్ ప్రతిపాదించిన రెండోసిద్ధాంతం ఒరవడిలో ఈ ప్రాథమిక సూత్రం కొట్టుకుపోయినట్లు కనిపిస్తుంది. ఫ్రాయిడ్ అనుయాయులూ, విమర్శకులుకూడ ఈ విషయాన్ని విస్మరించే ఫ్రాయిడ్ సిద్ధాంతంమీద తమ ప్రశంసల, విమర్శల వర్షం కురిపించారు. ఈ ప్రాథమిక సత్యప్రతిపాదనవల్లనే - అరిస్టాటిల్ నిర్వచించిన "ఇతివృత్త నిర్మాణ చతురత" అన్న దృక్పథానికీ, తరువాతి విమర్శకులు నిర్వచించిన "విధి విధాన నిరూపక" దృక్పథానికీ ప్రతిగా - ఆరెంటికన్న పటిష్ఠమైన సిద్ధాంతాన్ని ఫ్రాయిడ్ మనముందు ఉంచాడనీ, ఈ సిద్ధాంతం నాటకాన్ని అవగాహన చేసుకోవడానికి ఎంతగానో ఉపయోగ పడుతుందని నిష్కర్షగా చెప్పవచ్చు.

ఫ్రాయిడ్ తన మనో విశ్లేషణ సిద్ధాంతాన్ని 1897 వ సంవత్సరం అక్టోబరు 15 వ తేదీన తన స్నేహితుడు విల్ హెల్మ్ ఫ్లీస్ (Wilhelm Fliess)కు వ్రాసిన ఉత్తరంలో మొట్టమొదటిసారి ప్రతిపాదించాడు. The Interpretation of Dreams గ్రంథంలో ఈ విషయం ప్రస్తావించడానికి దాదాపు రెండు సంవత్సరాలకు ముందే యీ వుత్తరంలో తన సిద్ధాంత మూల రూపాల్ని వెల్లడి చేశాడు ఫ్రాయిడ్.

"తల్లిని ప్రేమించడం, తండ్రి అంటే అసూయపడడం - ఇవి నా విషయంలో కూడా యథార్థాలని నేను గమనించాను. ఇప్పుడు ప్రతి బాలుడి శైశవావస్థలోను ఇది సర్వత్రా ఉండే లక్షణంగా నేను భావిస్తున్నాను. విధి ప్రాబల్యాన్ని గురించిన భావం నాటక అవగాహనలో రేకెత్తించే అన్ని ఆక్షేపణలకు భిన్నంగా "ఈడిపస్" నాటకం మనల్ని అంతగా ఆకట్టుకొనేటంత శక్తివంతమైన నాటకం ఎందువల్ల అయిందో మనకు అర్థం అవుతుంది. అంతేకాదు తరువాతి కాలాల్లో వచ్చిన విధి నిరూపక నాటకాలు అంత ఘోరంగా ఎందుకు విఫలమైనాయో కూడా మనం గ్రహించవచ్చు. చూడండి....నిరంకుశమైన ఏ రకం ఒత్తిడికైనా - అవి ఎవరి మీదనైనా - మన మనోభావాలు తీవ్రంగా ఎదురు తిరుగుతాయి. కాని ఏ ఒత్తిడినయితే ప్రతివాడూ తనలోకూడా ఉన్నదని గ్రహించడంవల్ల, ఆ ఒత్తిడిని అమోదించడం జరుగుతున్నదో- ఆ ఒత్తిడినే గ్రీకు పురాణగాథ స్వీకరించడం జరిగింది. ప్రతి ప్రేక్షకుడూ ఓ ఈడిపస్-

తెలిసో, తెలియకో; ఎప్పుడో ఒకప్పుడు. వాస్తవిక జీవితంలో ఈ కలని యథార్థం చేసుకోవడాన్ని ఎదుర్కోవడంలో ప్రస్తుత స్థితినుంచి బాల్యావస్థను వేరు చేసుకొనేవిధంగా ఆ భావాలను అణచివేసుకొనే అవశ్యకతలో ప్రతివ్యక్తి భయంతో సతమతమై పోతున్నాడు." అంటాడు ఫ్రాయిడ్.

"The Interpretation of Dreams" అన్న గ్రంథంలో ఇదే విషయాన్ని దాదాపు ఇవే మాటల్లో ఇంకా విపులంగా చెప్పాడు ఫ్రాయిడ్. 'రాజా ఈడిపస్' నాటకం ఆనాటి గ్రీకు ప్రేక్షకుడిని, అధునాతన మానవుణ్ణీ ఒకేవిధంగా కదలించగలిగింది అంటే దానికి కారణం విధికీ, మనిషి స్వేచ్ఛకీ ఉండే పరస్పర వైరుధ్యం మాత్రంకాదు. ఆ వైరుధ్యాన్ని వ్యక్తపరిచే విషయాల ప్రత్యేక లక్షణాలలో దీనికి గల కారణాలను మనం వెతకవలసి వుంటుంది. ఈడిపస్ "విధి" మనల్ని బాధిస్తుంది - మనదికూడా అటువంటి జీవితమే కావచ్చునేమోననే భయంతో .. ఎందువల్లనంటే దైవవాణి ఈడిపస్‌కి ఎటువంటి శాపాన్ని యిచ్చిందో మనం పుట్టకముందే అదే దైవవాణి అటువంటి శాపాన్నే మనకూ యిచ్చివుండవచ్చు. బహుశః మన అందరిలో మొదటి లైంగికవాంఛ తాలూకు కదలికలు మన తల్లులఎడ చూపాలని, మొట్టమొదటి అసహ్యాన్ని, దౌర్జన్యపూరితమైన భావాలని తండ్రులఎడ చూపాలనేవి విధి నిర్ణయమేమో ?...."

1900 వ సంవత్సరంలో ప్రచురించబడ్డ ఈ గ్రంథం ప్రథమ ప్రచురణలో ఈడిపస్ నాటకం మీది చర్చలో ఫ్రాయిడ్ ఒక పాదసూచి (foot nete) ని యిచ్చాడు. బహుశః ప్రపంచ సాహిత్యంలో అంత ప్రతిభావంతమైన పాదసూచిని ఇంతవరకు ఎవరూ రాయలేదంటే అతిశయోక్తి కాదేమో! అర్థపుటలో "ఈడిపస్" నాటకానికి తానిచ్చిన వివరణ "హామ్లెట్" నాటకానికి కూడా ఎలా వర్తిస్తుందో సోదాహరణంగా చూపాడు ఫ్రాయిడ్ (దీని మొదటి ప్రచురణ 600 ప్రతులు అమ్ముడుపోవడానికి ఎనిమిది సంవత్సరాలు పట్టినా ఫ్రాయిడ్ జీవితకాలంలోనే మరో అయిదుసార్లు ప్రచురించబడ్డది.)

మొదటి ప్రచురణలో పాదసూచిగాఉన్న యీ వివరణ తరువాతి ప్రచురణల్లో గ్రంథంలో భాగమైపోయి, దాని స్థానంలో కొత్త పాదసూచి వచ్చి చేరింది. ఆ రెండో పాదసూచి ఎర్నెస్ట్ జోన్స్ ఫ్రాయిడ్ మొదటి పాదసూచి ఆధారంగా వ్రాసిన పుస్తకాన్ని (**"Hamlet and Oedipus,"** 1910) పేర్కొన్నది.

మొదటి పాదసూచి యిలా ముగించబడింది :

"అన్ని కలలకు మాదిరిగానే, అజ్ఞాతమైన సంఘర్షణల వల్ల జనించే అన్ని మానసిక కల్లోలాలు కూడా అసలు వున్న దానికన్న ఎక్కువగా ఉన్నట్లు వ్యాఖ్యానించడానికి అవకాశం వుంది. అలానే ప్రతి కావ్యసృష్టికీ కూడా కవి మనసులో వున్న ఎన్నో హేతువులు (motives), ఎన్నో ప్రేరణలు (stimuli) కారణాలు కావచ్చు. ఇక్కడ నేను సృజనాత్మకమైన కవి మనస్సులోని అట్టడుగు పొరల్లో ఉన్న ప్రేరణల (impulses) వివరణలని మాత్రమే యివ్వడానికి ప్రయత్నించాను."

ఫ్రాయిడ్ ఇచ్చిన పాద సూచిలో యిది పాక్షికమే! అయినా సాహిత్యంలో చిర స్థాయిగా వుండి పోయేటంత ముఖ్యమైంది. ఫ్రాయిడ్ తన విమర్శనలోని తన హద్దులు తెలిసిన వాడు కనక తన సిద్ధాంతంలోని హద్దుల్ని కూడా తానే నిర్ణయించాడు. ఫ్రాయిడ్‌ని గురించి వ్రాయబడి జనరంజకాలైన అన్ని విమర్శనా గ్రంథాలు యీ విషయాన్ని, యీ హద్దుల్ని విస్మరించి, ఆయన "హామ్లెట్" నాటకాన్ని గురించిన ఒకే ఒక్క అంతరార్థాన్ని విప్పి చెప్పినట్లు వ్రాశారు. ఫ్రాయిడ్ మాత్రం తన సిద్ధాంతం మనస్తత్వశాస్త్రపు లోతులకు సంబంధించిందనీ, ఇతర మానవ విజ్ఞాన శాస్త్ర దృక్పథాలతో యిది వ్రాయలేదనీ స్పష్టం చేశాడు!

ఫ్రాయిడ్ ఈడిపస్‌ను గురించి చెప్పిన విషయాలు రెండు భాగాలుగా ఉన్నాయనవచ్చు. పూర్వార్థంలో - మనల్ని ఈ నాటకం విచలితుల్ని చెయ్యడానికి కారణం ఈడిపస్ మనందరికీ ప్రతినిధి కనుక - అన్న ప్రతిపాదన చేశాడు. కాని ఈ ప్రతిపాదన పాఠకులని, ప్రేక్షకులని గురించి చేసినదే గాని ఈడిపస్‌ని గురించి కాదు. ఈడిపస్ లక్షణాలు మనలో కూడా ఎలా వున్నాయో చెప్పే ప్రతిపాదన అది. ఇక ఉత్తరార్థంలో ఈడిపస్ ఉల్లంఘించిన రెండు ఉల్లంఘనల్లో (transgressions) కూడా శైశవావస్థలో మన అందరి మనస్సుల్లోని లోపొరల్లో జరిగే సంఘర్షణకు మూలమైన ఉల్లంఘనలే నని, ప్రతివాడూ ఒకప్పుడు తమ తల్లుల చెప్పుచేతుల్లో ఉండడాన్ని కోరుకుంటారని, అందువల్ల తండ్రులంటే అసూయ పడతారని (తమతో పాటు తల్లుల ప్రేమను పొందడానికి ప్రయత్నిస్తారు కనక) ఫ్రాయిడ్ వ్రాశాడు.

ఈ ఉత్తరార్థంలో చేసిన సిద్ధాంత విషయంలో ఒక సందేహం రావడానికి అవకాశం వుంది. ప్రతివాడూ "ఊహల్లో ఒక ఈడిపస్" అంటాడు ఫ్రాయిడ్. ఈ సందర్భంలో ఆయన స్త్రీలను విస్మరించాడన్నది విస్పష్టం. అలా కాదంటే, ఈడిపస్ నాటకం యిచ్చే విషాద భావ సంచలనం ఒక్క మగవారికే పరిమితం

అనుకోవాలా ? పురుషులకు మాదిరిగానే స్త్రీలు కూడా యీ నాటకం చూసి ప్రతి స్పందిస్తారు కదా ! వారిని గురించి ఫ్రాయిడ్ చెప్పలేదేం? - బహుశః ఫ్రాయిడ్ ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలనుకుంటే తన సిద్ధాంతానికి అనుబంధంగా రెండు ఉప సిద్ధాంతాలని ప్రతిపాదించి ఉండవచ్చు:

1. ఒక్కొక్కప్పుడు తల్లులకు తమ భర్తలమీద కంటె తమ పుత్రులంటే అధికమైన ప్రేమ ఉంటుంది. అలా అయితే అసలు పిల్లలే పుట్టని స్త్రీలు యీ నాటకానికి స్పందించరా ?

2. లేదా, మగపిల్లలు తమ తల్లులఎడ ఎలా ప్రేమభావం కలిగి వుంటారో, ఆడపిల్లలు తమ తండ్రులఎడ అటువంటి ప్రేమభావాన్నే కలిగి వుంటారు. నాటకం చూసినప్పుడు తమకు అవసరమైన భావస్థితికి అనుగుణంగా కథా సన్నివేశాలను తేలికగా మార్చుకొని, ఆ నాటకానికి స్పదించగలరు.

ఈ విధంగా మగవాళ్ళూ ఆడవాళ్ళూ కూడా ఈ నాటకం చూచి ఒకే రకమైన అనుభూతిని పొందుతారు. అయితే యీ వివరణలుకాని, ఉపసిద్ధాంతాలనుకాని ఫ్రాయిడ్ యివ్వవలసిన అవసరం రాలేదు. ఆ పనిని ఆయన శిష్యులు చాలమంది చేశారు.

క్లుప్తంగా చెప్పాలంటే - ఫ్రాయిడ్ ప్రతిపాదించిన మొదటి సిద్ధాంతం గొప్పది. మనం ఈ నాటకానికి స్పందించడానికి కారణం- ఈడిపస్ మనకందరికీ ప్రతినిధి కనక; అతని విషాదభరితమైనస్థితి మానవుడి స్థితే కనుక. ఇంత మౌలికమైన సిద్ధాంతం ప్రతిపాదించిన తరువాత ఫ్రాయిడ్ ఈ నాటకానికి అన్వయించని రెండోసిద్ధాంతం చేశాడు. ఆయన చేసిన రెండో సిద్ధాంతం మనస్తత్వ శాస్త్రానికి సంబంధించింది, నాటకానికి సంబంధించింది కాదు. అంటే-ఫ్రాయిడ్‌కూడా పురాణగాథకీ, సొఫోక్లిస్ దానిని నాటకీకరించిన పద్ధతికీగల వ్యత్యాసాన్ని గుర్తించలేదన్నమాట ! ఈ పురాణగాథ మనల్ని ఎందుకు కదిలిస్తుందో చెప్పాడు ఫ్రాయిడ్. అంతే! అదే పురాణగాథను మలిచి సొఫోక్లిస్ వ్రాసిన నాటకం మనల్ని ఎందుకు కదిలించాలో చెప్పలేదాయన

## ఇతర నాటకకర్తలు: 'ఈడిపస్' నాటకం

సొఫోక్లిస్ కాక మరో పన్నెండు మంది నాటక కర్తలు ఈడిపస్ కథని నాటకీకరించారు. గ్రీకు నాటక కర్తల్లో ఎస్కిలస్, యురిపిడిస్, మెలెటస్‌లు ఈ నాటకీకరించిన వారిలో ముఖ్యులు. వీరి రచనల్లో ఏ ఒకటో, రెండో నాటకాలుతప్ప మిగిలినవేవీ లభ్యం

కావడంలేదు. ఎస్కిలస్ వ్రాసిన "సెవెన్ ఎగనెస్ట్ థీబ్స్" ఒక్కటే ఆయన ఈడిపస్ నాటక త్రయం (ట్రిలజీ)లో లభ్యమవుతున్న నాటకం. రోమన్ నాటకకర్తల్లో సెనెకా, జూలియస్ సీజర్‌లు ఈ పురాణగాథను నాటకీకరించినట్లు తెలుస్తుంది. ఫ్రెంచి రచయితల్లో కార్నెల్ యీ ఇతివృత్తంతో ఓ విషాద నాటకం వ్రాశాడు. వాల్టేర్ (Voltaire) తన పంధొమ్మిదవ ఏట వ్రాసిన మొదటి విషాద నాటకం ఈడిపస్ కథే! వాల్టేర్ నాటకంలో జొకాస్టా అటు లయస్‌ని కాని, ఇటు ఈడిపస్‌ని కాని, ప్రేమించదు. ఫ్రెంచి భావాలకు అనుగుణంగా కాబోలు, మూడోమనిషి ఫిలాక్టిటస్‌ని ప్రేమిస్తుంది. ఇంకా డ్రైడెన్, నెథానియల్ లీ కలిపి ఒక నాటకాన్ని, హ్యూగోవాన్ హాఫ్‌మన్‌స్థాల్ మరో నాటకాన్ని యీ కథ ఆధారంగా వ్రాశారు. ఈ విషయాలు ఎందుకు చెబుతున్నానంటే- చాలమంది సొఫోక్లిస్ ఒక్కడే యీ కథ ఆధారంగా నాటకం వ్రాశాడనీ, అసలు కథ లోని ఇతివృత్తం అతడు వ్రాసిందేనని భ్రమపడుతున్నారు. మరో కారణంకూడా వుంది. ఇతరులు తీసుకున్న కథని మలిచిన విధానానికి, సొఫోక్లిస్ రచనా విధానానికి ఉన్న అంతరాలను పరిశీలిస్తే సొఫోక్లిస్ మౌలికత, అతడి భావనా బలం, అతడి కథా నిర్వహణ సామర్థ్యం మనకు ఎక్కువగా అవగతం అయ్యే అవకాశం వుంది.

గ్రీకు రచయితల్లో ఈడిపస్ కథను పేర్కొన్న ప్రథమ కావ్యాలు ఇలియడ్, ఒడిస్సీలు. 'ఒడిస్సీ'లో యీ కథ అంతా పది పంక్తుల్లో చెప్పబడ్డది. ఈ సంక్షిప్త గాథని పదకొండో ఆశ్వాసంలో ఒడిసియస్ తాను పాతాళంలోకి పోవడాన్ని వర్ణించిన సందర్భంలో "అక్కడ ఈడిపస్ తల్లి ఎపికాస్ట్‌ను చూశాను" అని చెబుతూ ఆ కథను వివరిస్తాడు. ఈడిపస్‌కు వివాహం కాగానే తన తల్లినే పెళ్ళిచేసుకున్నట్లు తెలుస్తుంది. జొకాస్టా (ఈ కావ్యంలో ఆమె పేరు ఎపికాస్ట్) ఉరిపోసుకొని చనిపోతుంది (సొఫోక్లిస్ దీనినే అనుసరించాడు.) కాని ఈడిపస్ మాత్రం బ్రతుకు భారాన్ని మోస్తూ అలానే రాజ్యం చేస్తూ వుంటాడు.

"ఒడిస్సీ" కంటె ముందు వ్రాయబడ్డ "ఇలియడ్" మరో విషయాన్ని పేర్కొన్నది. ఇరవై మూడో ఆశ్వాసంలో మరణ సమయంలో జరిపే స్మారక ఆటల పోటీల్లో పాల్గొంటున్న ఒక క్రీడాకారుణ్ణి థీబ్స్‌లో ఈడిపస్ ఉత్తర క్రియల్లో పాల్గొన్న ఒకానొక వ్యక్తి కొడుకుగా గుర్తిస్తారు. "ఈ క్రీడాకారుడు కాడ్‌మస్ క్రీడాకారుల్ని గెలిచినవాడు" అంటాడు హోమర్. ఈడిపస్ చాలాకాలం రాజ్యంచేశాక యుద్ధంలో మరణించాడని ఆయన అంత్యక్రియలు పెద్దపెట్టున జరిగాయని పేర్కొనడం జరిగింది. అలాగే హేసియోడ్ అనే కవి అలభ్యకృతుల నుంచి ఇతరులు పేర్కొన్న

కొన్ని ఖండికలలో కూడా ఈడిపస్ థీబ్స్‌లోనే మరణించినట్లు చూపబడ్డది ఈ కథకి సొఫోక్లిస్ కథకి ఎంత అంతరమో మనం గమనించవచ్చు. ఇదేవిధంగా మరికొన్ని కావ్యాల్లోను, నాటకాలలోను (ముఖ్యంగా "థిబియస్", "ఓడిపోడియా" అన్న కావ్యాల్లోను, యురిపిడిస్ వ్రాసిన ''ఫొనిషియన్ విమెన్'' అన్న నాటకంలోను) ఈడిపస్ దేశం నుంచి బహిష్కరించబడడు. థీబ్స్‌లోనే పదవీ విరమణం చేస్తాడు. ఇక్కడ పేర్కొన్న కావ్యాలలో ఈడిపస్ రెండోభార్య యురిజీనియాకు మాత్రమే పిల్లలుంటారు. ఈ వివరాలన్నింటిని బట్టిచూస్తే ఆనాటి రచయితలకు ఒక పురాణగాథను తమకు కావలసిన విధంగా మార్చుకోవడానికి కావలసినంత స్వేచ్ఛ ఉండేదని అర్థం అవుతున్నది.

పిండార్ తన "ఓడ్స్" లో ఈడిపస్‌ను గురించి ఒకే ఒక్కచోట పేర్కొంటూ ''విధి ప్రేరణతో ఈడిపస్ తన తండ్రిని చంపాడు" అంటాడు. ప్రజల్లో ప్రచారంలో ఉన్న విధంగా ఈడిపస్‌కు విధి ప్రేరణకూ ఉన్న సంబంధాన్ని చూపుతున్నది యీ ''ఓడ్".

ఇక నాటక కర్తలలో ఎస్కిలస్ వ్రాసిన ఈడిపస్ నాటకత్రయంలో మూడో నాటకం మాత్రమే మనకు లభ్యమౌతున్నది "లయస్", "ఈడిపస్" అన్న నాటకాలు లభ్యం కావడం లేదు. "సెవెన్ ఎగ్‌నెస్ట్ థీబ్స్" ఒక్కటే లభ్యం. ఒక వంశంలో ఒకరు చేసిన తప్పుకు తరువాత తరాలవారు శిక్షను అనుభవించాలి-అన్నది వీటిలో కథా వస్తువు. లయస్ వివాహం చేసుకోరాదన్నది దైవశాపం. దానికి విరుద్ధంగా చేశాడు కనుకనే ఆ సంఘటన మిగిలిన విషాద సంఘటనలకు దారి తీసింది - అన్నది ఈ మూడు నాటకాల్లోను అంతస్సూత్రంగా నడిచిన కథ. బహుశః ఇందులో భాగంగానే ఈడిపస్ పిల్లలు అతనికీ అతని తల్లికీ పుట్టినవాళ్ళేనని ఎస్కిలస్ చూపి ఉంటాడని విమర్శకులు భావిస్తున్నారు.

యురిపిడిస్ వ్రాసిన "ఈడిపస్" నాటకం లభ్యంకావడంలేదు - కొన్ని ఖండికలు తప్ప. ఈ ఖండికలలో ఈడిపస్ తనంతతానుగా గుడ్డివాడుకా లేదు; లయస్ సేవకులచేత గుడ్డివాడుగా చేయబడ్డాడు అన్నది సారాంశం. అతని "ఫొనిషియన్ విమెన్" లో విధి నిర్ణయం ఎంత బలీయమైనదో వివరించబడ్డది. అయితే యీ నాటకం సొఫోక్లిస్ నాటకం తరువాతది కనుక ప్రస్తుత చర్చలో ఇది అప్రస్తుతం.

ఇన్ని వివరాలూ సొఫోక్లిస్ ఈ నాటక నిర్వహణలో చూపిన అఖండ ప్రతిభకు అద్దంపట్టడానికే ఇవ్వబడ్డాయి. కథా స్వీకరణలో, కథా నిర్వహణలో, పూర్వాపరాల

పరస్పర సంబంధాల స్థిరీకరణలో సొఫోక్లిస్ కనపరచిన నేర్పు అద్భుతం. కావాలను కుంటే విధి విన్యాసాన్ని తన నాటకానికి కేంద్ర కథాంశంగా చేయగలిగేవాడు సొఫోక్లిస్. కాని అలా చేయలేదు. ఎన్నో ఏళ్ళ చరిత్రని కొద్ది గంటల కాలానికి కుదించి, ఆ కొంచెం సేపటిలోనే ఈడిపస్‌ని సత్యశోధకుడిగా తీర్చి దిద్దాడు సొఫోక్లిస్. ఈడిపస్ నాటకంలో ప్రధాన సంఘర్షణ ఈడిపస్ చేపట్టిన సత్య శోధనకీ, ఇతరులు దానిని కొనసాగనివ్వకుండా అడ్డుతగలడానికి మధ్య జరిగిందని చెప్పొచ్చు. ఈ సంఘర్ష ణాంతాన ఈడిపస్ మన ముందు ఒక సజీవ సమకాలీన పాత్రగా నిలుస్తాడు. ఇతడికీ పురాణగాథలోని ఈడిపస్‌కీ సంబంధమే లేదు.

'ఈడిపస్' నాటకంలో కేంద్ర కథాంశం - ఈడిపస్‌ను గురించిన నిజం ఎలా వెల్లడయింది? - అన్న ప్రశ్న. ఇది ఇదివరకు రచయిత లెవ్వరూ ఊహించని ఓ కొత్త ప్రస్తావన. ఈడిపస్‌ను కనుగొన్న వార్తాహరుడు ఆ పసివాడి కాళ్ళకు మేకులు దిగగొట్టబడి వున్నాయని చెప్పడం అతడిని గుర్తించడానికేనని కార్ల్‌రాబర్ట్(**Carl Robert**) అనే విమర్శకుడి అభిప్రాయం. థీబ్స్‌కు వచ్చినప్పుడు ఈడిపస్ కాళ్ళకు ఆచ్ఛాదన ఉండి ఉండాలని (ఎందుకో మాత్రం చెప్పలేదు ఆయన), వివాహం అయిన వెంటనే జొకాస్టా అతనిని గుర్తించి ఉంటుందనీ రాబర్ట్ ఊహ. ఈ విషయాన్ని 'ఒడిస్సీ' లో ఈడిపస్‌ను గురించి చెప్పిన మాటల్లో ఉందంటాడు రాబర్ట్. కాని 'ఒడిస్సీ' చదివిన వాళ్ళెవరూ జొకాస్టా ఈడిపస్‌ను గుర్తుపట్టిందని చెప్పడానికి సాహసించరు.

బహుశః ఈడిపస్ కాళ్ళకు మేకులు దిగగొట్టిన వృత్తాంతం అంతా "ఈడిపస్" అన్న పేరులోని అర్థాన్ని స్ఫురింపచేయడానికేనని, దానికి నాటకీయమైన ప్రాముఖ్యం లేదని నాకనిపిస్తుంది. "ఈడిపస్" లేదా "ఓడిపస్" అన్న గ్రీకు పదానికి అర్థం "వాచిన పాదం" (swollen foot) అని. బహుశః పాదాలకు మేకులు దిగగొట్టడం అన్న విషయం ఈ పురాణగాథలో తరువాత వచ్చి చేరివుంటుంది.

సొఫోక్లిస్ తన నాటకంలో "ఈడిపస్" శబ్దాన్ని "వాచిన పాదములు కలవాడు" (oidio = swell) అనే అర్థంలో వాడనే లేదు. పైగా అందుకు పూర్తిగా భిన్నమైన "తెలిసిన" (oideo = know) అనే అర్థంలోనే పదే పదే వాడాడు. "తెలిసిన పాదం" అనడం అర్థంలేని వ్యుత్పత్తి. అయితే ఈడిపస్-స్ఫిన్‌క్స్ ప్రశ్నలకి సమాధానాలు తెలిసిన వాడు దాని ప్రశ్న పాదాలకు సంబంధించినది. ఈ చిక్కు ప్రశ్న పురాతన కాలం నాటిది కావచ్చు; కాని స్ఫిన్‌క్స్ అడిగిన చిక్కు ప్రశ్న ఇదే కావడం హోమర్ తరువాత కాలంలో జరిగి ఉండాలి. ఇదే నిజమయితే ఈడిపస్ కథలో చూపబడ్డ రెండు

ముఖ్యమైన సంఘటనలు - స్ఫిన్క్స్ పావాలను గురించి అడిగిన ప్రశ్న, ఈడిపస్ తన కళ్ళను తానే పొడుచుకొని గుడ్డివాడు కావడం - ఈ రెండూ తరువాత కాలంలో పురాణ గాథకు అనుసంధానించబడ్డవే ననుకోవాలి.

సాఫోక్లిస్ నాటకంలో ఈడిపస్‌ను అతని "పాదాల వాపు" ద్వారా గుర్తించడం అన్న ప్రసక్తే లేదు. "ఈడిపస్‌కు చూచాయగా కనిపించే కుంటితనం ఉంది" అన్న ఫ్రాన్సిస్ ఫెర్గుసన్ మాటలు అసంభవాలు (అంత ఉదాత్తమైన విమర్శ వ్రాయగలిగిన ఫెర్గుసన్ ఇలా అసంభవాన్ని ఎలా భావించాడో తెలుసుకోవడం కష్టం). ''ఈడిపస్'' నాటకంలో జొకాస్టా తన పిల్లవాడిని గురించి చెబుతూ ఆ పసివాడి పాదాలకు మేకులు కొట్టడాన్ని గురించి చెబుతుంది. ఆ మాటలకు అటు జొకాస్టా నుంచి కాని, యిటు ఈడిపస్ నుంచి గాని ఏమాత్రం చలనం కనిపించదు. ఈడిపస్ నడిచేటప్పుడు కుంటే వాడని సాఫోక్లిస్ భావించాడనడానికి ఏరకమైన ఆధారాలూ లేవు. ఈ విషాద నాటకంలో గుర్తింపు (Recognition-అభిజ్ఞ) శారీరకమైనది కాదు. దానికి మూలం మరో చోట వుంది.

అందువల్ల ''ఈడిపస్'' స్వతంత్ర నాటకం. దాని విశ్లేషణను ఆ నాటకం ఆధారంగానే చేయాలి కాని ఇతరుల సిద్ధాంతాలను బట్టిగాని, ఇతర రచయితలు నిర్వహించిన కథను బట్టిగాని చెయ్యడానికి వీలులేదు. ఇందుకుగాను "ఈడిపస్" నాటకంలోని ప్రధాన కథాంశా లేమిటి ? అని మనం ప్రశ్నించుకోవాలి ఈ నాటకాన్ని యీ నాటికీ యింతటి మహత్తర సాహిత్య రచనగా రూపొందించిన కారణా లేమిటి ? - అని మనం ఆలోచించాలి. ఈడిపస్ నాటకాన్ని సమకాలీన కాలానికి కూడా అన్వయించే నాటకంగా దానిని అజరామరంగా నిలిపే ఐదు లక్షణాలు నాకు కనిపిస్తున్నాయి. ఇవే ఆ నాటక సార్వకాలీనతకూ, సార్వజనీనతకు దోహదం చేస్తున్నాయని నా భావం.

**1 అందులో మొదటిది - ఈ నాటకం మానవ జీవిత అసమగ్రతను గురించి, తనను తాను రక్షించుకోలేని మనిషి అశక్తతను గురించి.**

మానవ జీవితంలో ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలియని అయోమయ స్థితి ఉంది. మనలో కొందరం అనుకోవచ్చు: ఈడిపస్‌కు నాకు ఏమిటి సమాన లక్షణాలు ? అతని స్థితికీ నా స్థితికీ సంబంధం ఏమిటి ? - అని. కాని ఈడిపస్ కూడా అలాగే అనుకొన్నాడు. నాటకం మొదట్లో తాను భావించిన తన స్థితికి నాటకాంతాన తాను అనుభవించిన స్థితికి ఎంత తేడా ! అందులోనూ తెలివి గల, ప్రజ్ఞావంతుడైన, మనుష్యులలో ప్రథముడిగా ఎన్నదగిన ఈడిపస్ విషయంలోనేయిలా జరగడమా ! ఇక మామూలు మనుషులకు రక్షణ ఏమిటి ?

ఈడిపస్, ఇంకా ఇటువంటి గొప్పవారు, మనుష్యుల్లో ప్రథములు-అరిస్టాటిల్ చెప్పినట్లు అటు ఉత్తములూ కాక, యిటు అధములూ కాక మధ్యస్తంలో ఉన్నవారా? అజాక్స్, హెరాక్లిస్, ఎలెక్ట్రా - వీళ్ళంతా - వీళ్లేకాదు; బాధలలోనుంచి తట్టుకొని, ఆనందమయ జీవితం గడపాలని ఆకాంక్షించి, ఒక ఉన్నత కార్యం కోసం జీవితాన్ని బలి యిచ్చిన అంటిగొన కూడా - మధ్యస్త పాత్రలుకావు. హెగెల్ అన్నట్లు "అంటి గొనెలో దైవత్వం ఉంది. అటువంటి మరో పాత్ర భూమిమీద యింకా ఉదయించ లేదు". అయితే వీరంతా కూడా జీవితం శాశ్వతంకాదనీ, నువ్వు ఎంతటి మంచి వ్యక్తివయినా, ఆ మంచితనం నిన్ను విషాద భరితమైన ముగింపునుంచి తప్పించలేదనీ నిర్ధరించిన పాత్రలే! "మనిషి చనిపోయేటంతవరకు అతని జీవితాన్ని గురించి నువ్వు బేరీజు వెయ్యలేవు" అన్న గ్రీకు సామెత ఇటువంటి పాత్రల స్వభావాలనుంచి వచ్చినదే! అంతేకాదు. "నువ్వు ఎంత ఉన్నతుడివో నీ జీవితం అంతటి బాధామయం అవుతుంది" అన్న మాటలనుకూడా ఈడిపస్ పాత్ర నిజం చేస్తున్నది. సొఫోక్లిస్ విషాద నాయకులూ నాయికలూ అందరూ ఉన్నతులు. అందువల్లనే వారి బాధ అంత తీవ్రం. అంతకన్న తక్కువ ఉన్నతులైనవాళ్లు బాధను అంత ధైర్యంగా స్వీకరించలేరు, అనుభవించలేరు- అన్న విషయాన్ని "అంటిగొని"లో ఇస్మీన్, "ఎలెక్ట్రా"లో క్రిసొథెమస్ పాత్రల ద్వారా నిరూపిస్తాడు సొఫోక్లిస్.

"నికొమాకియన్ ఎథిక్స్"లో అరిస్టాటిల్ చెప్పినట్లు "మనిషి ఔన్నత్యం అతని ధైర్యసాహసాలు, సున్నితమైన మనస్సు-వీని కలయిక మీద ఆధారపడివుంటుంది." ఏ మనిషిలో అత్యంత ధైర్యసాహసాలు, అతిసున్నితమైన మనసూ ఉంటుందో అటువంటి మనిషి ఎక్కువ బాధపడక తప్పదని సొఫోక్లిస్ ప్రతిపాదించిన జీవిత సూత్రం విషాద నాటకాలు బాధామయ జీవితగాథలు. సొఫోక్లిస్ విషాద నాయక, నాయికలంతా ఉన్నతులు; అందువల్లనే వాళ్ళ జీవితాలు అంత బాధామయాలు.

ఈ దృష్టితో చూస్తే ఈడిపస్ తన ఆనందమయజీవితంనుంచి హఠాత్తుగా కింద పడిపోయినట్లుకనపడతాడు. ఇలాపడిపోవడాన్ని గురించే "ఏమనిషీ ఆనందమయుడుకాడు, చివరిక్షణందాకా, తుది నిష్క్రమణందాకా" అన్న జీవితసత్యాన్ని చెప్పాడు-సొఫోక్లిస్. మనిషి జీవితం - ఈడిపస్ జీవితంవలెనే - ఏ క్షణంలో ఏం జరుగుతుందో చెప్పలేని భద్రతా రాహిత్యాన్ని సూచిస్తున్నది. ఉన్నతుడైనవాడి జీవితం యింకా భద్రతా రహితం. మనుష్యుల్లో ప్రథముడైన ఈడిపస్‌కే యిటువంటి పతనం సంభవిస్తే యిక మామూలు మనుష్యుల సంగతేమిటి? అన్న ప్రశ్న వేస్తుంది "ఈడిపస్" నాటకం.

**2. "ఈడిపస్" నాటకం మానవుడి అంధ ప్రకృతిని గురించిన నాటకం.**

"నాకు అన్నీ తెలుసు. నేను అన్నీ చూడగలను" అనుకొనేవాడు ఎంత గుడ్డివాడో యీ నాటకం నిరూపిస్తున్నది. టైరీషియస్ గుడ్డితనాన్ని వెక్కిరించిన ఈడిపస్ తానే నిజాన్ని చూడలేని అంధుడననీ, అంధుడైన టైరీషియసే అసలు నిజాన్ని చూడాగలిగాడనీ గ్రహించిన వెంటనే తన కళ్లను తానే పొడుచుకొని అంధుడై పోతాడు. శారీరకంగానూ, మానసికంగానూ అంధుడైన ఈడిపస్ మానవుల ''నిజం చూడలేని నైజానికి'' కూడా ప్రతినిధే! ''నువ్వు ఎంతగొప్పవాడివైనా, నీ తెలివితేటలు ఎంత అమోఘమైనవయినా, నువ్వు నిజం చూడలేనినాడు నీకు పతనం తప్పదు''అన్న సూత్రాన్ని ఈ నాటకం ఎంతో వ్యంగ్యంగా చిత్రించింది.

మూలగాథలోలేని, ఇతర నాటకకర్తలు సూచించని ఈ లక్షణం - ఈడిపస్ తన కన్నుల్ని పొడుచుకొని గుడ్డివాడు కావడం - ఈ విషాద నాటకానికి పరాకాష్ట. నిజాన్ని చూడలేని అతడు తన కళ్లనుతానే పొడుచుకోవడం (స్వయం శిక్షగా) ఈ నాటకాన్ని విషాదభరితం చేస్తున్నది. ''అంటిగొనె'' లో క్రియాన్, ''అజాక్స్'' లో అజాక్స్, ''ఓమెన్ ఆఫ్ ట్రాకిస్'' లో డయెనిరా-లు కూడా నిజాన్ని చూడలేని విషాద నాయికా నాయకులే! కాని ఏ విషాద నాటకపాత్రా ఈడిపస్ అంత దయనీయం కాదు. దానికి కారణం దూరదృష్టిలేని అతని జ్ఞానాంధకారమే! ''Ripeness is all'' (పరిపూర్ణతే సర్వస్వం) అన్న కింగ్‌లియర్ మాటలు సూచించినట్లు ప్రతివాడు - వాడికి అంతర జ్ఞానం కలిగేటంతవరకు - గుడ్డివాడే!!

**3. నిజంకోసం వెంపరలాడే మనిషి విషాదమయ జీవితం ఈ నాటకం.**

ఈడిపస్ తెలివిగలవాడే కాదు; సత్యశోధనకోసం ఎన్ని బాధలనైనా పడడానికి సిద్ధపడ్డవాడు. సత్యాన్వేషణ సొఫోక్లిస్ తన నాటకంలో చొప్పించిన అంశమే అయినా (ఇతర నాటక కర్తలు ఎవ్వరూ యీ విషయంలో ఏ విధమైన సూచనకూడా ఇవ్వ లేదు) ఇది సమకాలీనమైన విలువల్లో ఉన్నతమైనది. ఈ సత్యశోధనే "ఈడిపస్" నాట కానికి తరతరాలనుంచి వస్తున్న పురాణ గాథకు మధ్యఉండే అంతరాన్ని సూచిస్తున్న ముఖ్యమైన లక్షణం. సత్యాన్వేషణ విషయంలో సొఫోక్లిస్ చొప్పించిన అన్ని సంఘ టనలూ ఈడిపస్ పాత్రచిత్రణకు ఎంతో దోహదం చేశాయి.

కొరింత్‌లో ఒక తాగినవాడు తాను తనతండ్రి పోలిబస్‌కు పుట్టలేదని తూల నాడితే వెంటనే నిజాన్ని గ్రహించడానికి తల్లిదండ్రుల్ని నిలదీశాడు. వాళ్లు సర్ది

చెప్పినా సమాధానపడక డెల్ఫీ వెళ్లాడు. అక్కడ దైవవాణి మాటలు విని థీబ్స్‌వైపుకు ప్రయాణం అయివెళ్ళాడు. థీబ్స్‌లో రాజై, ఆ నగరానికి పట్టిన బీభత్సాన్ని గురించి తెలుసుకోవడానికి పౌరులు చెప్పకముందే క్రియాన్‌ని పంపాడు, దైవవాణికోసం. అతని సలహామీదనే టైరీషియస్‌ను పిలిపించాడు - రెండుసార్లు కబురుపంపి. నాటకం చివరిదాకా నిజాన్ని తెలుసుకోవాలని ఆరాటపడ్డాడు - ముందు లయస్ హంతకుణ్ణి గురించి తరవాత తననుగురించి, తన జన్మరహస్యాన్ని గురించి. నాటకంలో అందరూ యీ సత్యాన్వేషణను విరమించమని చెప్పేవాళ్ళే! టైరీషియస్, జొకాస్టా, గొర్రెలకాపరి-అందరూ. కాని ఈడిపస్ "ప్రశ్నించే గుణం" అతనిని ఊరకే ఉండనివ్వదు. నిజం ఏమిటో తెలుసుకోవాలన్న జిజ్ఞాస అతన్ని నిజానికి బలిచేసింది. ఆలా అంధుడై అలమటించడానికైనా సిద్ధపడ్డాడు కాని, సత్యాన్వేషణనుంచి విరమించుకో లేదు. తన జీవితంలో జరగబోతున్న విపత్కర పరిస్థితులనుకూడా లెక్కచెయ్యకుండా నిజాన్ని శోధించాలనుకోవడం - ఇదే ధీరుల లక్షణం అని సొఫోక్లిస్ సమకాలికుడైన థుసిడిడస్ అంటాడు.

''ఫిలాక్టటెస్"లో నియోటెలెమస్, ''విమెన్ ఆఫ్ ట్రాకిస్"లో హెరాక్లిస్ కుమారుడు హైలస్-లు కూడా తమ నిజాయితీకి, సత్యశోధనకి తాము బలి అయినవారే! మూలకథలో లేని ఒక వినూత్నమైన అన్వేషణని పాత్ర ఔన్నత్యాన్ని పెంచడానికి, కథా గమనంలో ఉత్సుకతను పెంచడానికి కూడా సొఫోక్లిస్ ఉపయోగించుకున్నాడు.

**4 అంతర్గతంగా విషాదభరితం కాక తప్పని ఒకానొక స్థితికి నాటకీకరణం యీ నాటకం.**

ముగింపు మరోరకంగా ఉండడానికి వీలులేని విషాద నాటక లక్షణాలను ఒక్కచోట కేంద్రీకరింపచేశాడు రచయిత. ఈడిపస్ తన శోధనని మానితే రాజుగా తన కర్తవ్యం నుంచి విముఖుడైనవాడవుతాడు. నగర ప్రజలంతా మాడిపోతారు. కాని తన సత్యాన్వేషణ వారిని రక్షించగలదు. తాను, తనతోపాటు జొకాస్టా, తన పిల్లలు - తమ జీవితాలన్నీ దుఃఖ భాజనాలయినాసరే ఈ సత్యాన్వేషణ నుంచి విరమించుకొనే ప్రసక్తి లేదు. నాటక ప్రారంభంలోనే ఈడిపస్‌ను ఎటువంటి పరిస్థితుల్లో ప్రవేశపెట్టాడంటే - అతడు సత్యాన్వేషణ చేయక తప్పదు. అటువంటి భావసంఘర్షణలో ఉంచాడు ఈడిపస్‌ని.

హెచ్. డి. ఎఫ్. కిట్టో వంటి సునిశితమైన విమర్శకుడు కూడా ఈ భావ సంఘర్షణను గ్రహించక "ఈడిపస్ ఆదర్శప్రాయుడైన రాజు'' అన్న భావాన్ని ఈసడించాడు. థీబ్స్ నగరాన్ని కష్టాల బారినుంచి తప్పించే ప్రయత్నంలో తన విధి నిర్వహణంలో ప్రాణాలను కూడా లెక్కచెయ్యని ''ఆదర్శవంతమైన రాజు ఈడిపస్'' అన్న విమర్శకులను అవహేళన కూడా చేశాడాయన. "ఈడిపస్ బాధలను అనుభవించడం వల్ల థీబ్స్ కష్టాలనుంచి విముక్తి పొందిందా? పొందలేదు కదా! అటువంటప్పుడు ఈడిపస్ సత్యశోధనకి విలువ ఏమిటి?'' అని ప్రశ్నించాడు కిట్టో!

మామూలుగా అధికారికంగా ఉండే విమర్శలను మాత్రమే వ్రాసే కిట్టో కూడా యిక్కడ మనం ఒప్పుకొనే విధంగా తర్కం చెయ్యలేదు. పోనీ కిట్టో వాదం సరి అయినదని ఒప్పుకున్నా - ఈడిపస్ నగరం నుంచి వెళ్ళిపోతే కదా నగరానికి విముక్తి! అది జరగకుండానే నాటకం అంతం అయింది కదా! అంతేకాదు. చివర్లో క్రియాన్ థీబ్స్ నుంచి వచ్చే సూచనలకోసం ఆగివున్నాడని కూడా స్పష్టం చెయ్యబడ్డది కదా! నిజానికి టైరీషియస్, క్రియాన్‌ల మీద ఈడిపస్‌కు కోపం రావడానికి కారణం వారిద్దరికీ నగర సంక్షేమం మీద అలసత్వం ఉన్నదని అతడు భావించడమే!

అందువల్ల ప్రజాభీష్టాన్ని నెరవేర్చడానికి తన క్షేమాన్ని కూడా పాటించని ఒక ఆదర్శవంతమైన రాజు పడిన భావసంఘర్షణగా యీ నాటకం అసాంతం విషాద నాటకం కావడానికే మొదటి నుంచీ ఆయత్తం అయింది. అలానే సాఫోక్లిస్ దీనిని ఊహించాడు.

## 5. "ఈడిపస్" న్యాయాన్యాయ విచక్షణను గురించిన నాటకం.

ఈడిపస్ విధించుకున్న శిక్ష న్యాయసమ్మతమా? తాను చేసిన ఏతప్పుకు శిక్షను విధించుకుంటున్నాడు ఈడిపస్? నిజానికి ఈడిపస్‌లో తప్పులేమన్నా ఉంటే అవి అతడి నిజాయతీవల్ల, నిజాన్ని వెలుగులోకి తీసుకురావాలనే అతని తపనవల్ల జరిగినవే! ఒక విధంగా చూస్తే ఈడిపస్ లయస్‌ని చంపలేదు. జరిగినదంతా ఆలోచనలేకుండా, ఉద్వేగోద్రిక్తతలో చేసినపని. అదికూడా తనను శత్రుపక్షం రెచ్చగొట్టగా చేసినపని.

అటువంటి ఈడిపస్ చేసిన ఏ తప్పుకు అతనికి శిక్ష విధించబడుతున్నది? ఒక విధంగా చూస్తే ఈ నాటకం మనుషుల జీవితాలతో ఆడుకొనే విధిచేసిన అన్యాయాన్ని ప్రశ్నిస్తున్నది. దాన్ని ప్రతిఘటిస్తున్నది. పర్యవసానం తన ప్రాణత్యాగమే అయినా ప్రతిఘటించడమే వీరత్వలక్షణం. ఉన్నతమైన కారణంకోసం ప్రతిఘటిస్తూ ప్రాణాలను

కోల్పోవడం విషాద నాయకుడి ముఖ్య లక్షణం. అన్యాయాన్ని ప్రశ్నించడం గ్రీకు నాటక చరిత్రలో యిది మొదటిసారి కాదు. ఎస్కిలస్ వ్రాసిన "ప్రొమీథియస్"లో అది స్పష్టంగా కనిపిస్తుంది. కాని మానవజాతినే కలచివేసే అన్యాయం "ఈడిపస్"లో జరిగింది. అది ప్రశ్నించవలసిన, ప్రతిఘటించవలసిన ప్రతివారికీ జరిగే అన్యాయం. దానిని వెలికి తీసుకువచ్చి, ఈడిపస్‌పాత్ర సంఘర్షణలో దానికి ప్రాముఖ్యాన్నిచ్చి మానవజాతి కలిసికట్టుగా ప్రశ్నించే విధిని నిలదీసి "ఇది అన్యాయంకాదా?" అని అడిగే ధైర్యం ఈ నాటకంమనకు యిస్తున్నది.

ఈ అయిదు కారణాలు (ఇంకా చాలా కారణాలు ఉండవచ్చు) - ఇతర గ్రీకు నాటకాల్లో ఇందులో ఒకటో, రెండో కనిపిస్తాయి - కలిసికట్టుగా ఈ నాటకంలో ఆసాంతమూ ఉండి మానవుడి జీవితాన్ని నిర్ధరించే ప్రాథమికమైన సమస్యలను చిత్రిస్తున్నాయి. ఈ సమస్యలను రేకెత్తించాడు కనకనే ఈడిపస్ సర్వమానవ ప్రతినిధి. ఈ సమస్యల వలయంలో చిక్కుకుపోయిన మానవ ప్రతినిధి విషాదభరిత జీవిత చిత్రణ కనుకనే "ఈడిపస్" నాటకం యీనాటికీ ప్రజాదరణ పొందుతున్నది. ఈ నాటికి కూడా పాశ్చాత్య నాటక చరిత్రలో అత్యుత్తమమైన నాటకంగా కీర్తించబడుతున్నది.

—: o :—

# రాజా ఈడిపస్

## పాత్రలు

**ఈడిపస్**

థీబ్స్‌నగరానికి రాజు

**పూజారి**

జియస్ దేవుడి అర్చకుడు

**క్రియాన్**

జొకాస్టా సోదరుడు

**బృందం**

వృద్ధులైన గ్రీకు పౌరులు - వారి నాయకుడు

**జొకాస్టా**

ఈడిపస్‌కు తల్లి, భార్య

**టైరీషియస్**

అంధ ప్రవక్త

**వార్తాహరుడు**

కొరింత్ నుంచి వార్త తెచ్చినవాడు

**గొర్రెలకాపరి**

**వార్తాహరుడు**

రాజప్రాసాదానికి చెందినవాడు

**ఆంటిగొనె, ఇస్‌మీన్**

ఈడిపస్, జొకాస్టాల కుమార్తెలు

ఇంకా - సేవకులు, భటులు, థీబ్స్‌నగర పూజారులు



ఉస్మానియా విశ్వవిద్యాలయ నాటక విభాగం ప్రదర్శించిన ''రాజా ఈడిపస్'' ప్రదర్శన.
పై భాగాన– ఈడిపస్: కె. విద్యాసాగర్, జొకాస్టా: ఉషా జయంతి, క్రియాన్ : చనికొళ్ల భరణి
కోరస్ : కృష్ణమోహన్, కె. ప్రసాద్, ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి, వెంకటేశ్వరరావు, పార్థసారథి



''రాజా ఈడిపస్''లో మరో దృశ్యం

బృందగాయకులు : పార్థసారథి, వెంకటేశ్వరరావు, ఆకెళ్ళ, కృష్ణమోహన్, ప్రసాద్.

దర్శకత్వం : మొదలి నాగభూషణశర్మ

రాజప్రసాదం ముందు భాగం. ఆ ప్రాంగణంలో జియస్ దేవుని మంటపం.

థీబ్స్ ప్రజలు - పెద్దలూ, చిన్నలూ - ఊలచుట్టిన కొమ్మలూ, ధూపం పట్టుకొని ఆ ప్రాంగణంలోని జియస్ ఆలయం ముందుకు వచ్చారు. కొమ్మల్ని, ధూపాన్ని మంటపం ముందు ఉంచి మోకరిల్లారు.

లోపలనుంచి ఈడిపస్ వస్తాడు.

**ఈ డి ప స్**

కాడ్మస్ వంశస్థులైన థీబ్స్ నగర ప్రజలారా !
ఇందరూ ఒక్కుమ్మడిగా ఇక్కడి కొచ్చారు !!
ఏమిటి మీ ఆందోళన? ఏమిటి మీ అభ్యర్థన ?
కొమ్మలూ, కొమ్మల చివర కట్టిన ఊలుహారాలూ పట్టుకొని
నగరమంతా వ్యాపించిన ధూపదీపాల సన్నని వెలుగుల్లో
రక్షించమని మీరు చేస్తున్న ప్రార్థనలకీ
మీ బాధల ఆక్రందనలకీ - అర్థం యేమిటి ?

చారుల ద్వారా ఈ విషయం
తెలుసుకోవాలనిపించలేదు;
నిజం తెలుసుకోడానికి
స్వయంగా వచ్చాను;
విశ్వవిఖ్యాతుణ్ణి,
ఈడిపస్ మహారాజుని.

(ముందుకు వచ్చి, ఓ వృద్ధ పూజారిని చూసి)
తాతా, ఇందరిలోనూ పెద్దలు - మీరు చెప్పండి.
వీరందరి భావాలని మీ వాక్కుగా వినిపించండి.

ఏమిటి మీ ప్రార్థనలకి కారణం ?
భయమా ? బలీయమైన కోరికా ? నిస్సందేహంగా చెప్పండి.
మీకు సహాయం చెయ్యడానికి
నన్నేం చెయ్యమన్నా చేస్తాను.
ఆర్తులైన మీ కోరికలకు జాలిపడనంత
కఠిన హృదయుణ్ణి కాదు – చెప్పండి.

**పూ జా రి**

ప్రభూ : వీళ్ళందర్నీ చూడండి......
ముక్కుపచ్చలారని పసిపాపలూ, ముదుసలి ఒగ్గులూ
నవనవోన్మేషులైన యువకులూ, నావంటి భగవంతుని సేవకులూ–
మేమే కాదు – ఇంకా ఇలాంటి వాళ్ళెందరో–
నగరం నడిబొడ్డున వున్న ఆర్టిమిస్ ఆలయం ముందూ
నగరం పొలిమేరల్లో – ఇస్మెనస్ నదీతీరాన వున్న
అపోల్లో దేవాలయ ప్రాంగణాన
శోకతప్తులై ప్రార్థనలు చేస్తున్నారు.

ఈ నగరానికి పట్టిన దుర్గతిని మీరు చూడ్డంలేదా ప్రభూ :
పెనుతుఫానులో చిక్కుకొని మునిగిపోయే నావలా వుంది నగరం.
ఎక్కడ చూసినా భీభత్సం.
పచ్చని పంటపొలాలు ఎండిపోతున్నాయి
పాలిచ్చే ఆలమంద వట్టిపోతున్నది.
పుట్టిన పసిపాపలకి పురుటిలోనే సంధికొడుతున్నది.
కరువు కాటకాలతో, వ్యాధులతో
ఇళ్ళకు ఇళ్ళే స్మశానభూము లవుతున్నాయి.

మాకు దిక్కుతోచక, మీకు మొర పెట్టుకుందామని వచ్చాం.
మీరు దేవుళ్ళనికాదు; మా అందరిలోనూ ప్రథములని;

సంక్షోభాలని ఎదుర్కోవడంలోనూ
మానవాతీత విషయగ్రహణంలోనూ
మా అందరికన్న అధికులని, మా ప్రభువులనీ
మిమ్మల్ని అభ్యర్థించడానికి వచ్చాం.

ఒకప్పుడు మమ్మల్ని, మా నగరాన్ని
ఆ మహామారి స్ఫిన్క్స్ బారినుంచి రక్షించారు.
ఇప్పుడూ మీరే కాపాడాలి.
అందుకే - ఇంతమందిమీ - మీ ప్రాంగణంలోని
మహాదేవుడైన జియస్ ఆలయం ముందు నిలబడి
మీకు విన్నవించుకుంటున్నాం.

ఒకప్పుడు మీ మేధాశక్తితో రక్షించబడ్డవాళ్ళం.
ఇవ్వాళ మీ పాలనలోనే అరక్షితులం అయిపోయామన్న
అపఖ్యాతి మీకు రాకూడదు.

మీరు ఇప్పటిలానే
మాకు ప్రభువులుగా కొనసాగాలనుకుంటే
బ్రతికున్న ప్రజలకు ప్రభువులుగా ఉండండి,
స్మశానవాటికలకి కాదు.

**ఈ డి ప స్**

మీ కరుణామయగాథ నన్ను కలచివేస్తున్నది.
మీ బాధలు నాకు తెలుసు.
మీరు నానుంచి ఏం ఆశిస్తున్నారో నాకు తెలుసు.

మీ ఒక్కొక్కరిదీ ఒక్కొక్క బాధ :
కాని నా బాధ? ఈ నగరంకోసం, నాకోసం, మీకోసం
నా మనసు తల్లడిలిపోతున్నది.

ఏం చెయ్యాలో తోచని అయోమయస్థితి
నిద్రాహారలకే నన్ను దూరం చేసింది.

కాని నే నూరికే కూర్చోలేదు.
ఈ బీభత్స నివారణకి మార్గం అన్వేషిస్తూనే వున్నాను.
మహారాణి సోదరుడూ, మెనోసస్ కుమారుడూ అయిన
క్రియాన్‌ని అపోల్లో దేవాలయానికి పంపాను
ఈ ఆపత్సమయంలో మహారాజు కర్తవ్యం ఏమిటో తెలుసుకోమని.

ఇవ్వాళలోగా తిరిగిరావాలని చెప్పాను.
ఇంకా ఎందువల్లనో ఆయన తిరిగి రాలేదు.
కాని ఆయన రాగానే-దైవవాణి ఏం చెయ్యమని ఆజ్ఞాపిస్తే-
దానిని తూచా తప్పకుండా చేస్తానని
అభయం ఇస్తున్నాను.

**పూ జా రి**

ధన్యులం, ప్రభూ ! ధన్యులం !
(క్రియాన్ వస్తున్నాడన్న గుసగుసలు)
(మరో పౌరుడు వచ్చి పూజారికి ఏదో చెబుతాడు)
ప్రభూ ! క్రియాన్ వస్తున్నట్లుగా వీళ్ళు చెబుతున్నారు.

**ఈ డి ప స్**

నవ్వుతున్న ఆయన కళ్ళను చూస్తుంటే
అపోల్లో మనల్ని కరుణించాడనిపిస్తున్నది.

**పూ జా రి**

మంచి వార్తే అయివుండాలి ప్రభూ !
పచ్చని ఆకులతో అలంకరించిన
శిరోవేష్టనంతో వస్తున్నాడు క్రియాన్ !

**ఈ డి ప స్**

క్రియాన్ ! స్వాగతం !

**క్రి యా న్**

ప్రభువులకు ప్రణామాలు.

**ఈ డి ప స్**

క్రియాన్ ! మీరు తెచ్చిన వార్త యేమిటి ? దైవవాణి ఏం చెప్పింది ?

**క్రి యా న్**

శుభవార్తే ప్రభూ ! అంటే...జరగవలసినదంతా సవ్యంగా జరిగితే
అశుభం నుంచే శుభం కలగొచ్చు మహారాజా !

**ఈ డి ప స్**

మీ మాటలు నన్ను భయపెట్టడమూలేదు
ఉపశమనాన్ని ఇవ్వడమూ లేదు.
దైవవాణి మాటల్ని వివరించండి.

**క్రి యా న్**

మీరు వీరందరి సమక్షంలోనూ వింటారా ?
లేక...లోపల...ఆంతరంగికంగా—

**ఈ డి ప స్**

అక్కర్లేదు. అందరిముందూ చెప్పండి.
నా ఒక్కని ప్రాణ భీతికన్న ఇక్కడ చేరిన
ఈ ప్రజల దుఃఖోపశమనమే నాకు ముఖ్యం.

**క్రి యా న్**

అలానే కానివ్వండి...
అపోల్లో భగవానుడు చెప్పిన మాటలివి !
చాలా స్పష్టంగా చెప్పాడాయన !!
థీబ్స్ పాప కలుషితమైంది. దాన్ని క్షాళనం చెయ్యాలి.

**ఈ డి ప స్**

ఏమిటి ఆ పాపం ? దాన్ని క్షాళనం చెయ్యడం ఎలా ?

**క్రి యా న్**

ఓ మనిషిని దేశం నుంచి బహిష్కరించాలి.
లేదా రక్తానికి రక్తం బలి తీసుకోవాలి.
ఈ విషమ పరిస్థితికి కారణం ఇక్కడ జరిగిన ఓ హత్య.
దాన్నుంచి మనం విముక్తులం కావాలి.

**ఈ డి ప స్**

ఎవరి హత్య ?

**క్రి యా న్**

లయస్—మీకు ముందు ఈ దేశానికి ప్రభువు.

**ఈ డి ప స్**

అవును. ఆయన హత్య చెయ్యబడ్డాడని వినడమేగాని,
నేను ఎప్పుడూ ఆయన్ని చూడలేదు.

**క్రి యా న్**

ఆయన మరణాన్ని గురించే అపోల్లో వాణి
మనల్ని స్పష్టంగా హెచ్చరించింది.
ఆయన మరణానికి కారకులైన వాళ్ళని - వారెవరైనాసరే -
శిక్షించాలని అపోల్లో అభిమతం.

**ఈ డి ప స్**

కాని ఎక్కడున్నారా హంతకులు ?
ఇన్నాళ్ళ తరువాత వాళ్ళని కనుక్కోవడం ఎలా ?

**క్రి యా న్**

ఇక్కడే - థీబ్స్‌లోనే - ఉన్నారని భగవద్వాణి చెబుతున్నది.
హెచ్చరికతో వెతికితే పట్టుకోవడం అంత కష్టం కాదు.

ఈ డి ప స్

లయస్ ఎక్కడ మరణించారు ?
తన ప్రాసాదంలోనా ? బయటా ?
తన దేశంలోనా ? మరో దేశంలోనా ?

క్రి యా న్

దైవవాణిని సంప్రదించాలని థీబ్స్‌నగరం నుంచి
ఆయన బయలు దేరాడని కథనం.
కాని ఆయన తిరిగిరాలేదు.

ఈ డి ప స్

ఆయనతో ప్రయాణం చేసిన వాళ్ళు ?

క్రియాన్

అందరూ ఆయనతోపాటే హత్య చేయబడ్డారు.
ఒక్కడు మాత్రం తప్పించుకున్నాడు.
ఆ ఒక్కడూ ప్రాణం గుప్పెట్లో పెట్టుకొని
ఇక్కణ్ణుంచి కూడా పారిపోయాడు.
వాడు కూడా తాను ఏంచూశాడో వివరంగా చెప్పలేకపోయాడు -
ఒక్క విషయం తప్ప -

ఈ డి ప స్

ఏమిటది ? నిజం అంతా ఆ ఒక్క విషయం మీద
ఆధారపడి ఉందేమో ?
ఇటువంటి చిన్నచిన్న విషయాలే
మన ఆశలకి అంకురాలవుతాయి.

క్రి యా న్

లయస్‌ని ఓ దొంగలగుంపు చంపిందని అతని కథనం.
ఏ ఒక్కరో కాదు;
అంతా మూక ఉమ్మడిగా కలిసి ఆయన్ని చంపారట !

ఈ డి ప స్

దొంగలు ... లేదా ఓ దొంగ-
రాజునే చంపే సాహసానికి ఒడికడతారా ?
ఇక్కడ, ఈ నగరంలో, ఎవరో కుట్రదారుల
మద్దతు లేకపోతే - ఇది సాధ్యమా ?

క్రి యా న్

మేమూ అలానే అనుమానించాం.
కాని, మహారాజు మరణించడంతో
ఈ బాధల్లో మమ్మల్ని ఆదుకునేవారే లేకపోయారు.

ఈ డి ప స్

బాధలా ? మీ మహారాజు హత్య చెయ్యబడితే -
ఏవో బాధల్లో ఉన్నామని
ఆ హంతకుల్ని వెదకడమే మానుకున్నారా ?
ఏమిటా బాధలు ?

క్రి యా న్

స్ఫిన్క్స్ రాక్షసి వేసే ప్రశ్నలకి జవాబులు చెప్పలేక
థీబ్స్ నగరం మాకళ్ళముందే కబళించబడుతున్నది.
ఆ సమయంలో ప్రభువుల మరణం
ఎలా సంభవించిందని ఆలోచించే స్థితిలో లేము మేము.

ఈ డి ప స్

సరే ! నేనే విచారణ జరుపుతాను
ఈ హత్య వెనకవున్న రహస్యాన్ని వెలికితీస్తాను.

క్రియాన్ : మీ విధిని మీరు అమోఘంగా నిర్వర్తించారు.
మరణించిన మహారాజుపట్ల
అపోల్లో చూపిన ఆర్ద్రతే మనకు మార్గదర్శకం కావాలి.

నేను ఇప్పుడు మీ పక్షం.
థీబ్స్‌నగర గౌరవాన్ని, సౌభాగ్యాన్ని నేను కాపాడతాను.
అపోల్లో వాణి నిజమని నిరూపిస్తాను.
పాప పంకిలమైన ఈ నగరాన్ని ప్రక్షాళనం చేస్తాను.

చనిపోయిన లయస్ మహారాజు కోసం కాదు; నా కోసం.
ఒక మహారాజుని చంపడానికి వెనుదీయని వాళ్ళు
మరో మహారాజుని చంపడానికీ వెనకాడరు.

( **పూజారితో, ఇతర పౌరులతో** )
తాతా, ఇక లేవండి.
బాధల్ని, మనస్తాపాల్ని సూచించే
ఈ కొమ్మలనీ, ఊలుహారాలని
ఈ దేవుని మంటపం నుంచి తీసివెయ్యండి.
భగవంతుడు మన ఆర్తనాదాలు విన్నాడు.
మనకోదారి చూపాడు.

( **రక్షకభటులతో** )
ఎవరక్కడ ? మీలో ఒకరు థీబ్స్ నగరవాసుల్ని
రాజ ప్రాసాదం ముందుకు రమ్మని చాటింపు వేయించండి.

**పూ జా రి**

( **తోటి జనంతో** )
ఇక మీరంతా లేవండి.
మనం ఏం కోరుకుందామని వచ్చామో
దాన్నే ఈడిపస్ ప్రభువు నెరవేర్చడానికి
కంకణం కట్టుకున్నారు.

ఈ దివ్యవాణిని వినిపించి మనకు మార్గం చూపిన
అపోల్లో ప్రభువే మనల్ని రక్షిస్తాడు.
మనవాళ్ళందర్నీ తీసుకువద్దాం, పదండి.

( పూజారులు తమతో తెచ్చిన ఆలివ్ కొమ్మల్ని మంటపం నుంచి తీసుకుని నిష్క్రమిస్తారు. ఈడిపస్ ప్రాసాదం లోపలికి వెళ్ళాడు మరో ప్రక్కనుంచి బృంద గాయకులు వచ్చారు. పదిహేను మంది. అందరూ వృద్ధులు. వాళ్ళు థీబ్స్ ప్రజలకు ప్రతినిధులు. మహరాజు చాటింపు విని వచ్చారు. వాళ్ళింకా క్రియాన్ సందేశాన్ని వినలేదు. వాళ్ళు బృందంగాను, విడివిడిగాను ఈ గీతికను వినిపిస్తారు. )

## బృందగానం

కరుణా సముద్రుడవైన భగవాన్ !
అపోల్లో స్వర్ణ దేవాలయం నుంచి వార్త వచ్చింది.
నా హృదయం భయానందాల మధ్య రెపరెపలాడుతున్నది.

భగవాన్ ! అపోల్లో ! మా బాధల్ని పరిహరించు.
థీబ్స్ నగర ప్రజలం అందరం నీకు నివాళులర్పిస్తున్నాం.
ఈ నగర ప్రక్షాళనానికేం చెయ్యాలో చెప్పు.
ప్రతినిత్యమూ చేస్తున్న పూజా పునస్కారాలేనా ?
లేక ప్రతి వసంతంలోనూ ఆవృతం అయ్యే
ప్రత్యేక ప్రార్థనలు చేయాలా ?
దైవవాణీ! మమ్మల్ని ఆదేశించు.

అమ్మా ? ఎథీనా ! ! దేవ దేవుడైన జియస్ కుమార్తెవు.
ముందుగా నిన్ను ఆవాహన చేస్తున్నాను.
మమ్మల్ని కాపాడు.

తల్లీ ! ఆర్టెమిస్ ! ! ఈ నగరానికి రక్షకురాలివి.
నగరం మధ్య ఉన్న నీ ఆలయంలో
మా ధైర్యాన్ని కుదవబెట్టాం.
తల్లీ ! మాకు దారి చూపించు.

గతంలో ఈ నగరంలో
ఏ భయోత్పాదాలు కలిగినా
మాకు అండగావుండి, కష్టాన్ని
థీబ్స్ పొలిమేరకు కూడా రాకుండా కాపాడావు.
మమ్మల్ని ఈనాడూ అనుగ్రహించు.

మా బాధల్ని మీకు కాక మరెవరికి చెప్పుకోగలం ?
మా ప్రజలంతా వ్యాధిగ్రస్థులయినారు.
మా చెట్లకు కాచిన కాయలు పండడం లేదు.
మా స్త్రీల గర్భాలూ పండడం లేదు.

నగరమంతా స్మశానమై పోతున్నది.
లెక్క పెట్టలేనన్ని చావులు
పూడ్చిపెట్టలేనన్ని శవాలు.

కడుపు శోకంతో మాతృమూర్తులు
మీ ఆలయ ప్రాంగణాలముందు మోకరిల్లి
ఈ బాధల్నుంచి విముక్తిని కోరుతూ విలపిస్తున్నారు.

తల్లీ! ఎథీనా!! అమ్మా! ఆర్టెమిస్!!
భగవాన్ జియస్! తండ్రీ అపోల్లో!!
మమ్మల్ని కరుణించండి.
మీ కరుణాకటాక్షాలతో యీ నగరాన్ని పునీతం చెయ్యండి.
మా చీకటి జీవితాలకు వెలుగును పంచండి.

మృత్యుదేవతా!
ఇకనైనా మమ్మల్ని కరుణించి మా నగరం విడిచి పో.

తండ్రీ! జియస్!! ఉరుములు మెరుపులు నీ ఆయుధాలు కదా ?
వాటితో – మమ్మావహించిన
ఈ మృత్యువును విధ్వంసం చేయి.

ఎథీనా ! ఆర్టెమిస్ ! అపోల్లో ! డయొనిసస్ ! జియస్ !
రండి – మమ్మల్ని – మీ బిడ్డల్ని – కాపాడండి.

కరువు కాటకాల నుంచి
పసిపాపల ఆక్రందనల నుంచి
ఈ నిరంతర సంక్షోభం నుంచి
మృత్యుదేవత వికటాట్టహాసం నుంచి
మమ్మల్ని కాపాడండి...కాపాడండి.

(బృంద నాయకులు రంగస్థలంమీదనే ఉంటారు. ఈడిపస్ ప్రాసాదం లోపలనుంచి వస్తాడు )

**ఈ డి ప స్**

మీరు అందరు దేవుళ్ళనీ అర్థించడం విన్నాను.
మీ ప్రార్థనలు నేను మన్నిస్తాను.
ఇప్పుడు నేను చెప్పే విషయం కూడా వినండి.
మీరు నేను చెప్పే విషయాన్ని ఆమోదిస్తే
మనం శాపవిముక్తులం కాగలమని నా విశ్వాసం.

ఈ సమస్యతో కాని, ఇక్కడ జరిగిన హత్యతో కాని
ఏమాత్రం సంబంధంలేని వ్యక్తిగా మాట్లాడుతున్నాను.
ఈ నగర ప్రభువుగా, మీ శ్రేయోగామిగా
నేనీ ప్రకటన చేస్తున్నాను.

ఇది థీబ్స్ ప్రజలకు నా హెచ్చరిక !
మీలో ఎవరికైనా–లయస్ మహారాజును
హత్య చేసిందెవరో తెలిసివుంటే –
అది మీకు వ్యతిరేకమైనా,
ఆ వాస్తవాన్ని నాకు తెలియచెయ్యండి.
మీ కెటువంటి ప్రాణహానీ వుండదు–దేశ బహిష్కారం తప్ప.

( నిశ్శబ్దం. ఈడిపస్ సమాధానంకోసం ఆగుతాడు. )

మరో విషయం.
హంతకుడు మన పొరుగురాజ్యం వాడయితే
ఆ సంగతీ నిర్భయంగా చెప్పండి.
ఆ నిజాన్ని మాకు తెలియచెప్పినవారికి
మా నుంచి బహుమానం, మా ప్రజల కృతజ్ఞత -
రెండూ లభిస్తాయి.

( నిశ్శబ్దం )

కాని, తెలిసి కూడా నిజాన్ని దాస్తే,
అటువంటి వ్యక్తికి - అతడెంత గొప్పవాడైనాసరే-
సంఘ బహిష్కరణ తప్పదు.

ఆ వ్యక్తికి తినడానికి తిండి, ఉండడానికి నీడా దొరకవు.
సంసారగృహాల్లో, వ్యాపారస్థలాల్లో
పూజామందిరాల్లో, అతడు ప్రవేశానికి అనర్హుడు.

మహారాజుగా ఇది నా శాసనం.
పైన భగవంతుడూ, మరణించిన లయస్ మహారాజూ-
వీరిద్దరూ నాకు సాక్షులు.
హంతకుడు యీ నగరంలోనే ఉండి ఉంటే
ఈ శాసనం అతన్ని వెన్నాడుతుంది.

మహారాజునయినా, నేనుకూడా ఈ శాసనానికి బద్ధుణ్ణే :
నేనుకాని, రాజప్రాసాదంలో మరెవరైనాకాని
హంతకుడి ఆచూకీ తెలిసి చెప్పకపోయినా
హంతకుణ్ణి దాచే ప్రయత్నాలు చేసినా
ప్రజలందరికీ వర్తించిన శాసనమే

మహారాజుకీ వర్తిస్తుంది.
దేశ బహిష్కారమే అతన్నీ వరిస్తుంది.

ఈ శాసనాన్ని అమలుపరచవలసింది మీరు.
పౌరులుగా, భగవన్నిర్ణయ సంరక్షకులుగా
ఇది మీ కర్తవ్యం.

భగవంతుని వాణి ఆజ్ఞాపించకముందే
ఇక్కడ జరిగిన హత్యకు ప్రక్షాళన జరగకపోవడం
నాకాశ్చర్యంగా ఉంది.
మహారాజు మరణిస్తే - దానికి కారణాలు
ఇదివరకే అన్వేషించవలసి వుంది.

సరే ! కానివ్వండి -
అతడు అధిష్టించిన సింహాసనాన్ని
ఇప్పుడు నేను అధిష్టించాను కనక -
అతని భార్యను నేను వివాహం చేసుకున్నాను కనక -
ఈ హత్యా రహస్యాన్ని నేను ఛేదిస్తాను.

చనిపోయిన మహారాజు నా తండ్రేనని భావిస్తాను.
మహారాజు హంతకుణ్ణి బట్టబయలు చేస్తాను.

ఈ శాసనానికి విరుద్ధంగా నడిచిన వారిని
భగవంతుడు శాపదగ్ధుణ్ణి చెయ్యాలని ప్రార్థిస్తున్నాను.

వాళ్ళ భూములు బంజరులు కావాలి.
వాళ్ళ స్త్రీలు నిస్సంతులు కావాలి.
ఈ శాసనం శాపమై, వారిని
ఆమరణాంతం వెన్నాడాలి.

ఎవరు నిరపరాధులో వాళ్ళంతా నా పక్షం.
వాళ్ళని న్యాయం, దైవం సదా రక్షించాలి.

**బృందగానం**

మీ శాసనానికి బద్ధుడినై
ఈ మాటలు చెప్పే ధైర్యాని తెచ్చుకుంటున్నాను.
మహారాజా ! ఆ అపరాధిని నేను కాను.
అపరాధి ఎవరో నేను చెప్పలేను.
ఈ హత్య విషయం అపోల్లోనుంచి వచ్చింది.
ఆ భగవానుడే చెప్పాలి హంతకుడెవరో.

**ఈడిపస్**

నిజమే ! కాని మనం మానవమాత్రులం.
తన ఇష్టానికి వ్యతిరేకంగా
దేవదేవుడి చేత మాట్లాడించే శక్తి మనకు లేదు.

**బృందగానం**

అలా అయితే మరోవిషయం మనవిచేస్తాను ప్రభూ !

**ఈడిపస్**

నిస్సంకోచంగా చెప్పండి. ఒకటేమిటి ?
ఎన్నింటినైనా వినడానికి మేం సిద్ధంగా ఉన్నాం. ఏమిటది ?

**బృందగానం**

అపోల్లో భగవానుడికీ, అక్కడి దైవవాణికీ
అతి సన్నిహితుడు టైరీషియస్.
హంతకుడిని కనిపెట్టే శోధనలో
ఆయన ఇవ్వగల సహాయం అనితర సాధ్యం.

**ఈడిపస్**

ఆ విషయమూ నేను మరచిపోలేదు.
క్రియాన్ సలహా కూడా ఇదే:
వారికోసం కబురు వెళ్ళింది. ఒకసారికాదు; రెండుసార్లు!
ఈసరికే ఆయన ఇక్కడ ఉండవలసింది.
ఎందువల్ల రాలేదో ఆశ్చర్యంగా ఉంది.

**బృందగానం**

టైరీషియస్ చెప్పవలసింది మినహా
ఇప్పటిదాకా తెలిసినవన్నీ పుకార్లు-పుక్కిటి పురాణాలు.

**ఈడిపస్**

ఏమిటా పుకార్లు? ప్రతి మాటను మనం జాగ్రత్తగా
పరిశీలించవలసిన సమయం యిది.

**బృందగానం**

లయస్ మహారాజు ఎవరో ప్రయాణీకుల చేతిలో
మరణించాడని పుకారు.

**ఈడిపస్**

ఆ సంగతి నేనూ విన్నాను.
అది చూసిన వ్యక్తి ఎక్కడ ?

**బృందగానం**

మీ శాసనం విన్నాక అతడింకా ఇక్కడ నిలుస్తాడనుకోను.

**ఈడిపస్**

అంతటి హత్యకే పాల్పడినవాడు, ఈ శాసనానికి భయపడతాడా?

బృందగానం

అదుగో! పరమధార్మికుడైన టైరీషియస్ వస్తున్నాడు.
సత్యాన్ని అంతరాంతరాల్లో నుంచి చూడగల ప్రవక్త.

(టైరీషియస్ వస్తాడు. అంధుడు. అతన్ని నడిపిస్తూ ఒక బాలుడు. అతని వెనక రక్షకభటులు.)

ఈడిపస్

సమ్యగ్ దృష్టీ, సమస్త విషయ పరిజ్ఞానం వున్న మనీషీ!
టైరీషియస్! మీకు మా స్వాగతం.

కళ్ళతో చూడలేక పోయినా, శాపగ్రస్థమయిన
థీబ్స్ నగర దుస్థితి మీరిదివరకే విని ఉంటారు.

స్వామీ! ఇప్పుడు మీరే మమ్మల్ని రక్షించాలి.

మీకోసం వర్తమానం పంపిన వార్తాహరులు
మీకీ విషయాలు చెప్పారో లేదో?
మన దుస్థికి గల కారణాలను చెప్పమని
అపోల్లో దేవుణ్ణి అర్థించాం.
లయస్ మహారాజును ఎవరు హరిమార్చారో తెలుసుకొని
వారిని దేశ బహిష్కారం చేయడమో, వధించడమో జరిగితే కాని
థీబ్స్ నగర శాపానికి విముక్తి లేదని అపోల్లో వాక్కు.

మీ దూరదృష్టి అనన్య సామాన్యమని విన్నాం.
ఈ నగరాన్ని, నన్ను, ఈ తోటి ప్రజనీ కాపాడండి.
మీ దివ్యదృష్టి సారించి లయస్ పతనానికి కారకుడెవరో చెప్పండి.

ప్రజా క్షేమం కోసం ప్రజ్ఞానిధులందరూ
తమకు చేతనైనదంతా చెయ్యాలన్న
ఆర్యోక్తి - మీకు తెలియంది కాదు.

టైరేషియస్

సమ్యగ్ దృష్టి ! చూడగలిగిన వాడికి
నిజాన్ని చూడడం ఎంత భయంకరమైంది ?
ఆ సంగతులన్నీ నాకు ఎప్పుడో తెలుసు!
అయినా యిప్పుడు మరిచిపోయాను.
అలా మరిచిపోకుండా వుంటే ఇక్కడికి వచ్చేవాణ్ణేకాదు.

ఈడిపస్

ఏమిటి స్వామీ ఇది ! ఎందుకంత నిరాశ ?

టైరీషియస్

నన్ను ఇంటికి పంపించి వెయ్యండి మహారాజా !
మీ ఆజ్ఞాబద్ధుణ్ణయి ఇక్కడికి వచ్చాను.
ఇక వెళ్ళిపోనివ్వండి.
మన ఇద్దరి బరువుల్నీ తేలిక చేసుకోవడానికి
అది ఒక్కటే మార్గం.

ఈడిపస్

మీరు చెప్పేది ఆశ్చర్యకరంగా వుంది.
అంతేకాదు, న్యాయవిరుద్ధం కూడా.
మిమ్మల్ని పెంచి పోషించిన మాతృదేశానికి
మీ మాటలు గొడ్డలిపెట్టు.
తెలిసివున్న విషయాన్ని బహిర్గతం చేయకపోవడం
చట్టం దృష్ట్యా నేరం.

టైరీషియస్

మీరేం అడుగుతున్నారో మీకే తెలియదు.
అందుకే నా మాటల్ని జాగ్రత్తగా నాలోనే దాచుకుంటున్నాను.

ఈడిపస్

దయచేసి మా అభ్యర్థనను కాదనకండి
మీకు తెలిసిన నిజమేదో మాకందరికీ చెప్పండి.

టైరేషియస్

అజ్ఞానం. నాకు తెలిసిన ఈ దారుణమైన రహస్యాల్ని
నేనెవ్వరికీ చెప్పలేను. నా మాటల ద్వారా
నీకూ, నాకూ ఎటువంటి కష్టం కలగడం నాకిష్టంలేదు.

ఈడిపస్

మీకు తెలిసివుండీ చెప్పడానికి నిరాకరిస్తున్నారు!
మమ్మల్ని, థీబ్స్‌నీ సర్వనాశనం కానివ్వకండి.

టైరేషియస్

నా మాటల ద్వారా నాకూ, నీకూ
ఎటువంటి కష్టం కలగడం నా కిష్టంలేదు.
ఇక నన్ను వృథాగా ప్రశ్నించకు-
నా నుంచి నీకెలాంటి సహాయమూ రాదు.
మరచిపో.

ఈడిపస్

అంతేనా ?
ప్రవక్తవని, మహాజ్ఞానసంపన్నుడవని
ఇంతవరకూ ఓపిక పట్టాను.
అచేతనమయిన కొండరాయికి కూడా
ఆగ్రహం తెప్పించగలవు నువ్వు.
ఆఖరుసారి అడుగుతున్నాను; నీకు తెలిసింది చెప్పు.

టైరేషియస్

నేను చెప్పకపోయినా, జరిగేది జరగకమానదు.

ఈడిపస్

అదే! ఏం జరుగుతుందన్నదే నువ్వు నాకు చెప్పాలి.

టైరీషియస్

ఇంకేమీ చెప్పను.
నీ కోపాగ్నితో నన్ను దహించు, చేతనైతే.
నీ యిష్టం...కాని నా నుంచి వచ్చే సమాధానం మాత్రం ఇదే :

ఈడిపస్

అంతేనా ? ... ఇప్పుడర్థమవుతున్నది !
అయితే నా మాటలు కూడా విను :
లయస్ మహారాజు హత్యలో నీ సాయం కూడా వుందని నా అనుమానం.
స్వయంగా నువ్వే ఆ పని చేసి వుండకపోవచ్చు.
కాని ఆ హత్యకు నువ్వు దోహదం చేశావు.
నువ్వు గుడ్డివాడివి కాకపోతే
ఆ పని నువ్వే స్వయంగా చేశావని చెప్పేవాడిని.

టైరీషియస్

చివరకు ఇదా నువ్వు చెప్పేది ! ... మూర్ఖుడా ! అయితే విను.
ఇంతకు ముందొక శాసనాన్ని విధించావు కదూ !
ఇంతలోనే దానిని అమలుపరిచే సమయం వచ్చింది.
ఇక్కడ చేరిన థీబ్స్ ప్రజ లెవరితోనూ
నువ్వు ఏ విధమైన సంబంధమూ పెట్టుకోకూడదు.
ఎందుకో తెలుసా ?
థీబ్స్‌ని ఆవహించిన అపవిత్రతకు కారణం నువ్వు.

ఈడిపస్

ఈ మాటలనడానికి నీకు సిగ్గుగా లేదూ ?
ఇటువంటి కట్టు కథలల్లి తప్పించుకుందామని చూస్తున్నావా ?

టైరీషియస్

నిజమాడితే నిష్ఠూరమేగా !

ఈడిపస్

నిజమా ? ఎవరు నేర్పారు నీకీ నిజాన్ని ?
నువ్వు గొప్పలు చెప్పుకునే నీ భవిష్యద్వాణి మాత్రం కాదు.

టైరీషియస్

నువ్వే నేర్పావు. నేను ఏమీ చెప్పనని ముందుగానే చెప్పాను.
కాని నువ్వే - నువ్వే నన్ను నిజం చెప్పడానికి ఉసిగొల్పావు.

ఈడిపస్

నువ్వు చెప్పిన ఆ గొప్ప సత్యాన్ని మరోసారి విడమరిచి చెప్పు.
నేను దానిని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

టైరీషియస్

అర్థంకానంత క్లిష్టంగా వున్నాయా నామాటలు ?
నేను చెప్పిందేమిటో తెలుసా ?
"నువ్వు ఎవరికోసం వెతుకుతున్నావో ఆ హంతకుడివి నువ్వే" - అని.

ఈడిపస్

ఆ అసత్యాన్ని అంత నిర్భయంగా చెప్పి కూడా
చావునుంచి తప్పించుకుందామనుకుంటున్నావా ?

టైరీషియస్

నీకు కోపం తెప్పించే నిజాలు ఇంకా చెప్పనా ?

ఈడిపస్

అర్థంలేనిమాటలు ఎన్ని చెబితే యేం ?

**టైరీషియస్**

పోనీ అలానే అనుకో...అయినా విను.
నీకు తెలియకుండానే నీకు చాలా ఆప్తులైన వాళ్ళతో
అక్రమ సంబంధం పెట్టుకున్నావు.
నువ్వు చిక్కుకున్న విషవలయం ఏమిటో
తెలియనే తెలియనంత అజ్ఞానంలో వున్నావు.

**ఈడిపస్**

నువ్వు ఏం మాట్లాడినా చెల్లుతుందనుకున్నావా ?

**టైరీషియస్**

మాట్లాడింది నిజమైనప్పుడు – తప్పకుండా చెల్లుతుంది.

**ఈడిపస్**

అవును. అది నీకుతప్ప మరెవరికీ నిజంకాదు.
నీకు గొప్ప శక్తులూ లేవు; నీలో సత్యమహిమా లేదు.
నువ్వు ఒట్టి గుడ్డివాడివి – కళ్ళులేనివాడివే ననుకున్నాను.
కళ్ళు, చెవులు, మనసూ – ఏమీలేవు నీకు.

**టైరీషియస్**

నిన్ను చూస్తే జాలేస్తుంది. నువ్విప్పుడు నన్ను అన్న మాటలు
ఒకనాడు థీబ్స్ ప్రజలు నిన్నూ అంటారు.
ఆ రోజు ఎంతోదూరం లేదు.

**ఈడిపస్**

**( అసహ్యంతో )**
భయపెడుతున్నావా?...
నిరంతరం అంధకారంలో బతికే నువ్వు నన్నేం చెయ్యగలవు?

**టైరీషియస్**

నిన్నేమైనా చేసేందుకు నేనెవర్ని? అది భగవదేచ్ఛ !
అపోల్లోనే చేస్తాడా పని.

ఈడిపస్

(క్రియాన్ అపోల్లో దేవాలయానికి వెళ్ళి హంతకుణ్ణి గురించి తెచ్చిన గాథకీ, టైరీషియస్ మోపిన నిందకూ సంబంధాన్ని ఊహించుకొని)

ఓ ! భగవదేచ్ఛ ! : అపోల్లోనే చేస్తాడా ఆ పని !
ఈ కథని కల్పించిందెవరు ? నువ్వా ? క్రియానా ?

టైరీషియస్

క్రియానూ కాదు, నేనూ కాదు. నీకు నువ్వే కల్పించుకున్నావు.

ఈడిపస్

అసూయ ! అదీ ఈ కట్టుకథలకి మూలం ! !
నా అధికారాన్ని చూస్తే వీళ్ళకి కడుపుమంట !

ఈ అధికారాన్ని నేను కావాలనుకున్నానా ?
థీబ్స్ నాకు కట్టబెట్టింది దీన్ని.
దీనికోసం-ఇన్నాళ్లూ నాకు పరమమిత్రుడుగా నటించిన
క్రియాన్ పొంచి చూస్తున్నాడు.
నన్ను పదవీభ్రష్టుణ్ణి చెయ్యడానికి పన్నాగాలు పన్నుతున్నాడు.
అందుకోసం ఈ మాయలమారిని నా మీదకు ప్రయోగించాడు.
భవిష్యత్తు చెబుతాడట ! గుడ్డివాడు ! !
( టైరీషియస్‌తో )
నువ్వు భవిష్యత్తు చెబుతావు కదూ ?
స్ఫిన్క్స్ ఎవ్వరూ చెప్పలేని చిక్కుప్రశ్న వేసినప్పుడు
నువ్వు ముందుకు వచ్చి సమాధానం చెప్పలేదేం ?
థీబ్స్ ప్రజల్ని తన ప్రశ్నాగానంతో కబళించివేస్తున్నప్పుడు
నీ భవిష్యద్వాణి పలకలేదేం ?

నీకు పక్షుల గానాలూ, దేవతల పలుకులూ
తెలుసునట గదా ! మరి వారి మాటలు విని అయినా
సమాధానం చెప్పలేదేం ?
అప్పుడు నేనొచ్చాను. మూర్ఖుణ్ణి. అజ్ఞానిని.
స్ఫిన్క్స్‌ని నిలదీశాను.
నాకున్న కొద్దిపాటి తెలివితేటలతోనే సమాధానం చెప్పాను.
అప్పుడు ఏ పక్షులూ నాకు సమాధానాన్ని అందించలేదే !

ఇప్పుడు-ఇప్పుడు నన్ను పదవీభ్రష్టుణ్ణి చెయ్యాలనా నీ పన్నాగం?
నన్ను గద్దె దింపితే, క్రియాన్ సింహాసనం పక్కన
ఠీవిగా నిలవొచ్చని కదూ నీ పథకం ?
మీరు సాగించిన యీ గూడుపుఠాణీకి
నువ్వూ, నిన్ను ప్రేరేపించిన క్రియానూ
కన్నీటితో సమాధానం చెప్పే రోజు వస్తుంది.

అంధుడివీ, ముసలివాడివీ కాకపోతే
నీ కుట్రకు ఎందరు అమాయకులు బలి అవుతున్నారో
తెలుసుకొనేవాడివి.

**బృంద నాయకుడు**

మీరేమీ అనుకోకపోతే నాదో విన్నపం.
ఈడిపస్ ! మీరూ, ఈ టైరీషియస్
కోపంతో ఒకరినొకరు చాలా మాటలనుకున్నారు.

ఇప్పటి కర్తవ్యం కోపంకాదు -
దైవవాణి చేసిన హెచ్చరిక, అది లేవనెత్తిన సమస్య.
దాని సంగతి చూడండి.

టై రీ షి య స్

నువ్వు మహారాజువి కావచ్చు. కాని,
నేను కూడా నీతో సమానం, ఒక్క విషయంలో -
సమాధానం చెప్పడానికి నీకెంత అధికారం ఉందో
నాకూ అంతే అధికారం ఉంది.
నేను నీ సేవకుణ్ణి కాదు; అపోల్లో సేవకుణ్ణి.
క్రియాన్ ఎలా చెబితే అలా ఆడే మరబొమ్మని కాదు.
ఇంతమందిలో మాట్లాడడానికి నాకు క్రియాన్ సాయం అక్కర్లేదు.

నా గుడ్డితనాన్ని చూసి వెక్కిరించావు కదూ !
కాని నువ్వు కళ్ళుండీ కబోదివి !
నువ్వు ఎటువంటి దుస్థితిలో ఉన్నావో నీకు తెలియదు.
ఎవరితో బతుకును పంచుకుంటున్నావో
దానికి పూర్వాపరాలేమిటో తెలియదు.

అసలు నీకు నీ తల్లిదండ్రులెవరో తెలుసా ?
అది తెలియదు కనకనే -
చనిపోయినవారికీ, బ్రతికున్నవారికీ -
చివరకి నీ రక్తమాంసాలకే - నువ్వు శత్రువువి అవుతున్నావు.

నీ తల్లిదండ్రుల శాపం రెండువైపులా పదునున్న కత్తిలాంటిది.
అది నిన్ను ఈ దేశంనుంచి తరిమి తరిమి కొడుతుంది.

ఇప్పుడు వెలుగును చూస్తున్నావు. అప్పుడు నువ్వు చూసేదంతా చీకటే !
ఆ నిజం తెలిసిననాడు నువ్వు గొంతెత్తి ఏడ్చినా కనికరించేవాడుండడు.

ఇంకా - ఎన్నో ఎన్నో భయంకరమైన సంఘటనలు-
నువ్వు ఊహించనుకూడా లేనివి -
నిన్నూ, నీ పిల్లల్ని బంధుత్వంలో సమానం చేస్తాయి.

ఇప్పుడు - ఇప్పుడు చూపించు నీ కోపాగ్ని -
నామీదా, క్రియాన్‌మీదా ?
భూతభవిష్యద్ వర్తమానకాలాల్లో ఏ వ్యక్తి పతనమూ
నీ పతనం అంత దయనీయం కాదు.

**ఈ డి ప స్**

చాలు ! ఇంక ఒక్కమాట మాట్లాడకు. నేను సహించను.
వెళ్ళు, నా కళ్ళముందునుంచి. వచ్చినచోటికే వెళ్ళు. వెంటనే-

**టై రీ షి య స్**

నువ్వు కబురుమీదకబురు పంపకపోతే నేను వచ్చేవాణ్ణేకాదు.

**ఈ డి ప స్**

నేనొక పిచ్చివాడితో మాట్లాడవలసివస్తుందని తెలిస్తే
నిన్ను పిలిపించే వాణ్ణేకాదు.

**టై రీ షి య స్**

నీకు నేను పిచ్చివాణ్ణి కావచ్చు. కాని నీ తల్లీ, తండ్రీ మాత్రం
నన్నెప్పుడూ పిచ్చివాణ్ణనుకోలేదు.
( వెళ్ళిపోవడానికి బయలుదేరతాడు. )

**ఈ డి ప స్**

ఏమిటీ ! ఆగు... నా తండ్రి ఎవరు ?

**టై రీ షి య స్**

నీజనన మరణాలు రెండూ ఇవ్వాళ ఒక్క రోజులోనే
దాక్కొని వున్నాయి. తొందరెందుకు ?

**ఈ డి ప స్**

ఓ ! నువ్వు మాట్లాడే ప్రతిమాటా చిక్కుప్రశ్నే !

**టై రీ షి య స్**

చిక్కు ప్రశ్నలకి సమాధానాలు చెప్పడంలో
నువ్వీ ప్రపంచానికే మొనగాడి వేమో !

ఈ డి ప స్

నీ వ్యంగ్యం నన్ను అవమానించడానికేగా! ...నిజమే!
ఆ సమాధానం చెప్పగలిగిన శక్తే
నన్ను థీబ్స్‌కి మహారాజును చేసింది;
ఇంతటి గొప్పవాణ్ణి చేసింది.

టై రీ షి య స్

కాని నిన్ను గొప్పవాణ్ని చేసిన ఆ క్షణమే
నీ పతనానికి నాందీ వాక్యం కూడా పలికింది.

ఈ డి ప స్

నేను పతనమైతేనేం? థీబ్స్ రక్షించబడ్డది.

టై రీ షి య స్

సరే! ఇక నేను వెడతాను...బాబూ! దారి చూపించు.

ఈ డి ప స్

అవును. తీసుకుపో...
నా ఎదట ఉన్నంతకాలం నువ్వు నాకు కంటకమే?

టై రీ షి య స్

వెడుతున్నాను. వెళ్ళేముందు – నే నిక్కడికి ఏం చెప్పాలని వచ్చానో
ఆ నాలుగు మాటలూ చెప్పే వెడతాను.
నువ్వు నన్నేమీ చెయ్యలేవు.

నేను చెప్పే మాటలు సావధానంగా విను:
నీ శాసనాల పేరుతో నువ్వు వెతుకుతున్న మనిషి
ఇక్కడే – థీబ్స్‌లోనే – ఉన్నాడు.
పరాయి దేశస్థుడి ననుకుంటున్నాడు.
కాని ఇక్కడి వాణ్ణేనని త్వరలోనే తెలుసుకుంటాడు –
ఆ తెలుసుకోవడం అతనికి ఆనందాన్ని కలిగించే విషయం కాదు.

గుడ్డివాడై, బిచ్చగాడై పరాయిదేశాల పాలవుతాడు.
ఇప్పుడు ఏ పిల్లలతో తాను నివసిస్తున్నాడో
వాళ్ళకే అన్నా, తండ్రీ అవుతాడు.
తనను కన్న తల్లికి భర్త అవుతాడు;
తన తండ్రిని వధించిన హంతకుండవుతాడు.

వెళ్ళు! ఈ సంగతులన్నీ మననం చేసుకో!
ఇందులో వీసమెత్తు అసత్యం వున్నా
టైరీషియస్‌కి భవిష్యత్తుని చూసే
ప్రజ్ఞా పాటవాలు లేవని రూఢి చేసుకో!

(టైరీషియస్ వెళ్ళిపోతాడు. ఈడిపస్ ప్రాసాదంలోపలికి వెడతాడు.)

**బృం ద గా నం**

డెల్ఫీ కొండల మీద ఉన్న అపోల్లో ఆలయం నుంచి
దైవవాణి నేరస్థుడుగా పేర్కొన్న దెవరిని?
ఇక్కడ రక్తం చిందించిన అమానుషత్వం ఎవరిది?
ఆ అభాగ్యుడెవరో పాపం!
వాయువేగ మనోవేగాలకన్న
తొందరగా ఇక్కణ్ణుంచి పారిపోవాలి.

విధి వెంటాడుతున్న దతన్ని
జియస్ ప్రభువు తనయుడు అపోల్లో
విస్ఫు లింగాలు వెదజల్లే మెరుపుల మారణాయుధాలతో
అతణ్ణి చంపడానికి ఆయత్తం అయి వస్తున్నాడు.
పగతీర్చుకొనే దేవతాగణం అంతా
ఆ హంతకుణ్ణి వెంటాడుతూ వస్తున్నది.
ఇంకెక్కడికి పోగలడు?

పార్నాసస్ నుంచి వినిపించిన అపోల్లో దేవుని మాటలు
థీబ్స్ ప్రజల కందరికీ తిరుగులేని బాటలు.
"హంతకుణ్ణి పట్టుకోండి, హతమార్చండి-
అది జరిగేదాకా థీబ్స్‌కు ఆనందం ఉండదు."
అపోల్లో దేవుని ఆ మాటలు
మాకందరికీ తిరుగులేని బాటలు.

ఎక్కడ ? ఎక్కడ ఆ వ్యక్తి ?
కోనల్లోనో, కొండల్లోనో -
మనుషుల మధ్యనుంచి తప్పించుకున్న
మత్తెక్కిన ఆబోతులా తిరుగుతున్నాడు !

ప్రపంచం నడిబొడ్డు నుంచి ప్రణవంలా వినిపించిన
దైవవాణి పలుకులనే ధిక్కరించగలడా ?
ఆ పలుకులు శాపాలై
హంతకుణ్ణి - తరిమి తరిమి-
పరిమార్చక పోతాయా ?

ఏమోనబ్బా ? టైరీషియస్ గొప్పవాడే !
కాని ఇవ్వాళ అయన మాటలు
నన్ను భయ భ్రాంతుణ్ణి చేస్తున్నాయి.
ఆ మాటలు నేనొప్పుకోను.
కాని అందుకు వ్యతిరేకంగా నేనేమీ చెప్పనూలేను.

ఏం చెయ్యాలో తోచడం లేదు -
ఒక పక్క ఆశ, మరో పక్క భయం...

ఈడిపస్, లయస్‌ల మధ్య పోట్లాటకు కారణం లేదే !
వారిద్దరిమధ్య మనస్పర్థలున్నాయని మనకెవ్వరికీ తెలియదే

లయస్ రాజు మరణానికి ప్రతీకారమేమోగాని
ఈడిపస్ కీర్తిని దానికి ఎరవేయాలనిపించదు.

ప్రతి మనిషి జీవితంలోనూ జరిగే ప్రతి సంఘటనా
దేవుడికి తప్ప మరెవరికి తెలుసు ?
ఒక మానవమాత్రుడు - ఎంత ప్రవక్తయినా -
జరిగిన ప్రతి విషయం లోగుట్టులు తెలుసుకోగలడా ?
టైరీషియస్ మాటల్ని అవును, కాదని నిర్ధారణ చేసేదెవరు ?

నామటుకు నేను - ఈడిపస్ హంతకుడంటే
ఛస్తే నమ్మను - దాన్ని నిరూపించే దాకా.
స్ఫిన్క్స్ అతన్ని ఎలా ఎదుర్కొందో ఎరుగుదురుగా !
అపుడే కనిపించిందతని ప్రజ్ఞ.

ఆ సంక్షుభిత సమయంలో ఈ నగరంలో
ఆనంద జ్యోతిని వెలిగించాడాయన.
ఆ రోజును జ్ఞాపకం తెచ్చుకుంటే -
ఈడిపస్ తప్పు చేయగలడన్న భావమే
సిగ్గుతో తలవంచుకోవాలి.

క్రియాన్

(ప్రవేశిస్తూ)
థీబ్స్ పౌరులారా ! ఎంతో ఆగ్రహావేశాలతో మీ ముందుకు వచ్చాను.
ఈడిపస్ మహారాజు నామీద ఎన్నో నిందారోపణలు చేశారని విన్నాను.
ఈ విపత్సమయాన్ని ఆధారంగా చేసుకుని ఆయనకు
వాచా, కర్మణా నేను ఏమైనా ద్రోహం తలపెడితే,
అటువంటి ద్రోహిగా నన్ను మీ మధ్య బ్రతక నివ్వకండి.
కాని ఈ నిందారోపణలవల్ల
నాకు జరిగిన పరాభవం - భరించలేనిది.

తన దేశంలోనే తాను దేశద్రోహిగా
మీ అందరిచేతా-మిత్రులైన మీ అందరిచేతా-పరిగణించబడడం-
సహించలేనిది.

బృందనాయకుడు

ఈ నేరారోపణలన్నీ కోపావేశంలో చెయ్యబడ్డవి.
ఈడిపస్ తన స్థయిర్యాన్ని కోల్పోయాడు.

క్రియాన్

తన మీద ఆరోపణలు చెయ్యమని టైరీషియస్‌కు
నేను చెప్పానట ! ఆ మాటలు ఆయనెలా అనగలిగాడు?

బృందనాయకుడు

ఆ మాటలాయన ఎందుకన్నాడో తెలియదు.
కాని అన్న మాటలు మాత్రం అవే !

క్రియాన్

ఆ నేరాలు మోపినప్పుడు ఆయన కళ్ళు, మనస్సూ మూసుకుపోయాయా ?

బృందనాయకుడు

ఆ విషయాలు నాకు తెలియవు. థీబ్స్‌ని పరిపాలించే
రాజుల కార్యాలు సామాన్యుల కర్థం అవుతాయా ?
అదుగో ! ఈడిపస్ ఇటే వస్తున్నాడు.

( రాజప్రాసాదం తలుపులు తెరుచుకున్నాయి. ఈడిపస్ ప్రవేశిస్తాడు. )

ఈడిపస్

( ప్రవేశిస్తూ )
ఓ ! తమరా ? ఈ రాజప్రాసాదం దగ్గర
నీ మొహం చూపడానికి ఎంత ధైర్యం ?
హంతకుడివి, నా సింహాసనాన్ని హరించడానికి
పన్నాగం పన్నిన కుట్రదారుడివి-
భగవంతుడి సాక్షిగా చెప్పు. ఇటువంటి పన్నుగడ పన్నినప్పుడు
నన్ను గురించి ఏమనుకున్నావ్ ?
భీరువు ననుకున్నావ్ కదూ ? తెలివితేటలులేని మూర్ఖుణ్ణనుకున్నావ్ కదూ ?

నామీద జరుగుతున్న ఈ కుట్రని కనుక్కోలేని
తెలివిహీనుణ్ణనుకున్నావు కదూ :
ఒకసారి మీ కుట్ర విషయం తెలిశాక
నన్ను నేను రక్షించుకోలేననుకున్నావు. అవునా ?
నీ పన్నుగడ ఎంత తెలివితక్కువదో అర్థమయిందా?
నీ వెనక జనం లేరు; నీ దగ్గర డబ్బు లేదు.
జనమూ, ధనమూ కూడా లేకుండా సింహాసనం వస్తుందా ?

క్రి యా న్

ఒక చిన్న కోరిక : నీ మాటలు ఇన్ని విన్నాను కదా,
నేను చెప్పే మాట కూడా ఒక్కటి విని,
నన్ను గురించిన న్యాయ నిర్ణయం చెయ్యి.

ఈ డి ప స్

నువ్వు గొప్ప మాటకారివి, నువ్వేమీ చెప్పనక్కర్లేదు.
నీ మీద నా అభిప్రాయం ఒక్కటే -
నువ్వు నాకు పరమ శత్రువువి.

క్రి యా న్

ఒక్క మాట చెప్పనీ -

ఈ డి ప స్

ఎన్ని మాటలైనా చెప్పు-నువ్వు దేశద్రోహివి కాదు అన్నమాట తప్ప-

క్రి యా న్

ఈ అర్థంలేని మొండితనం గొప్పని నీ ఉద్దేశ్యమా ?

ఈ డి ప స్

నా మీద కుట్రపన్ని, అంత తేలికగా తప్పించుకుందామని నీ ఉద్దేశ్యమా ?

క్రి యా న్

ఇంతకీ నేనేం కుట్ర పన్నానో విడమరిచి చెప్పొచ్చుగా :

ఈ డి ప స్

చెప్పాలా ? ఆ ఉత్తముడూ, సర్వజ్ఞాన సంపన్నుడూ అయిన ఆ ప్రవక్తగారిని పిలిపించమని ప్రోద్బలం చేసిందెవరు? నువ్వుకాదూ?

క్రి యా న్

నేనే ! ఇప్పటికి కూడా అదే మాట చెబుతాను.

ఈ డి ప స్

సరే...మరో విషయం చెప్పు...ఎంతకాలం క్రితం లయస్ హత్యచేయ బడ్డాడు ?

క్రి యా న్

చాలా కాలమయింది. అయితే ?

ఈ డి ప స్

అప్పుడుకూడా ఈ ప్రవక్త జరగబోయే విషయాలు చెబుతూనే వుండేవాడా?

క్రి యా న్

చెబుతూనే వుండేవాడు. ఆయన ఎప్పుడూ మహిమాన్వితుడే !

ఈ డి ప స్

అప్పుడు నా పేరెప్పుడన్నా చెప్పాడా?

క్రి యా న్

చెప్పలేదు. కనీసం నా ఎదురుగా -

ఈ డి ప స్

మీరంతా లయస్ మరణం ఎలా జరిగిందో ఆరా తీశారా ?

క్రి యా న్

మేం చెయ్యగలిగిందంతా చేశాం. కాని ఏమీ తెలుసుకోలేకపోయాం.

ఈ డి ప స్

మరి ఈ మహిమాన్వితుడు ఇప్పుడు చెబుతున్న విషయాలన్నీ ఆనాడే ఎందుకు చెప్పలేదు ?

క్రి యా న్

నా కెలా తెలుస్తుంది? తెలియని విషయాల్లో జోక్యం చేసుకోవడం నా పద్ధతి కాదు.

ఈ డి ప స్

ఈ విషయం నీకు ఖచ్చితంగా తెలుసు. నీకు ఏ మాత్రం నిజాయితీవున్నా ఆ సంగతి ఇప్పుడే ఒప్పుకుంటావు.

క్రి యా న్

నాకు నిజంగా తెలిస్తే ఆ విషయాన్ని నేను నిర్భయంగా ఒప్పుకుంటాను.

ఈ డి ప స్

ఊహూ! నువ్వు ఒప్పుకోవు. ఎందుకు ఒప్పుకోవో తెలుసా?
నువ్వూ టైరీషియస్ కలిసి ఈ పన్నాగం పన్నకపోతే -
లయస్ హత్య నా పని అని టైరీషియస్ అనగలిగేవాడు కాదు.

క్రి యా న్

ఆ మాట ఆయననివుంటే ఆ సంగతి నీకు తెలియాలి, ఆయనకి తెలియాలి.
సరే! ఇప్పుడు ప్రశ్నించే అధికారం నాది.
నేను నీ ప్రశ్నలకి సమాధానం చెప్పినట్టే నే నడిగే ప్రశ్నలకి నువ్వూ జవాబు చెప్పు.

ఈ డి ప స్

నువ్వు ఎన్ని ప్రశ్నలడిగినా నన్ను హంతకుడిగా నిరూపించలేవు. అడుగు.

క్రి యా న్

నువ్వు నా సోదరిని పెళ్ళిచేసుకున్నావు. అవునా?

ఈ డి ప స్

అవును.

క్రి యా న్

నువ్వు థీబ్స్‌ని ఆవిడతో కలిసి పరిపాలిస్తున్నావు. అవునా?

ఈడిపస్

అవును. పరిపాలనలో ఆవిడకు కూడా మర్యాద మన్నన ఉన్నాయి.

క్రియాన్

అదేవిధంగా ఇక్కడ మీ యిద్దరితో సమానమైన హోదా
నాకూ వుంది. అవునా ?

ఈడిపస్

హోదా ! అధికారం ! ! ఆ మాటల్లోనే తెలుస్తున్నది
నువ్వు ఎంత విశ్వాసపాత్రుడివో !
అయినవాణ్ణి వెన్నుపోటు పొడవడానికి కూడా వెనకాడవు నువ్వు.

క్రియాన్

అబద్ధం...
అయినా ఒక్క విషయం ఆలోచించు.
ఎవరైనా, రాత్రింబవళ్ళు నిద్రాహారాలు లేక
భయభ్రాంతుల్తో బతికే రాజరికాని కిష్టపడతారా-
లేక, ఆ రాచరికం యిచ్చే హోదా, అధికారం మాత్రం ఉంటే-
హాయిగా నిద్రపోవడాని కిష్టపడతారా ?
రాజరికం యిచ్చే హోదా, అధికారం నాకున్నాయి.
ఇక రాజుననిపించుకోవడం ఎందుకు ?
తెలివితేటలున్నవాడెవడైనా నా మాటలే నిజమంటాడు.

ఇప్పుడు నాకేం తక్కువ ?
నాకు ఏం కావాలని అడిగినా నువ్వు కాదనవు.
ఎవరికీ భయపడాల్సిన అవసరంలేదు.
కాని, నేను రాజునైతే - ప్రతివాడికీ భయపడాలి.
ఏ కష్టమూ లేకుండా అధికారం వస్తుంటే, కష్టాల్ని కొనితెచ్చుకోమంటావా?
నాకేం కావాలో నాకు ఖచ్చితంగా తెలుసు.

నాకు అధికారం కావాలి; కాని అవితెచ్చే కష్టాలుండకూడదు.
ఇప్పుడు చూడు : అందరూ నన్ను గౌరవిస్తారు.
నీనుంచి వాళ్ళకేమైనా పని కావాలంటే నాకు వినతిపత్రాలిస్తారు.
వీటన్నింటిని వదులుకుని నీలాంటి జీవితాన్ని కోరుకుంటానా ?
లేదు...తెలివితేటలున్న ఎవ్వడూ అలా కోరుకోడు .
అటువంటి నేను రాజ ద్రోహానికి పాల్పడతానా ?
అంతేకాదు. అలా పాల్పడ్డవాడి నెవడినీ నేను సైరించను.

నేను చెప్పిన మాటల్లో నిజం ఉందో లేదో
డెల్ఫీ పోయి స్వయంగా కనుక్కొని రా.
నిజంగా నేను రాజద్రోహానికి పాల్పడ్డట్టు
నీకు తెలిస్తే - నాకు మరణ శిక్ష విధించు.

అది నీ ఒక్కడి శాసనంగా కాదు;
ఇద్దరి శాసనంగా — నీదీ, నాదీ !!

కాని ఎవరో చెప్పిన పుకార్లు విని నన్ను నిందించకు.
మంచి మిత్రుణ్ణి పోగొట్టుకోవడం
మంచి జీవితాన్ని పోగొట్టుకోవడం లాంటిది.

బృంద నాయకుడు

ప్రభూ ! ఆలోచించండి. క్రియాన్ చెప్పింది నిజమేననిపిస్తున్నది.
తొందరపడి చేసే నిర్ణయాలు ఎప్పుడూ సహేతుకాలు కావు.

ఈ డి ప స్

నన్ను హత్య చెయ్యడానికి ఒకడు అనుక్షణం ఎత్తులు వేస్తుంటే
నేను అంత తొందరగానూ పై ఎత్తులు వెయ్యాలి.
నేను మెల్లగా - ఆలోచించి-నిర్ణయాలు తీసుకుంటే -
నా ఎత్తు చిత్తవుతుంది. నా విరోధి గెలుస్తాడు.

క్రి యా న్

అయితే నువ్వేం చెయ్యదలుచుకున్నావ్ ?
నన్ను థీబ్స్ నుంచి బహిష్కరిస్తావా ?

ఈ డి ప స్

లేదు...నేను కోరేది నీ మరణం - దేశ బహిష్కరణ కాదు.

క్రి యా న్

పగ, ద్వేషమూ - మనిషిని ఎంత
గుడ్డివాడుగా చెయ్యగలవో నీ మాటలవల్ల తెలుస్తున్నది.

ఈ డి ప స్

అంటే - ఇంకా నువ్వు నిర్దోషివేనని
నన్ను నమ్మమంటావ్ ?

క్రి యా న్

నువ్వు చేస్తున్న దేమిటో నీకు తెలియడం లేదు - అంటాను.

ఈ డి ప స్

నన్ను నేను కాపాడుకుంటున్నాను.

క్రి యా న్

మరొకర్ని చంపా ?

ఈ డి ప స్

నువ్వు ద్రోహివి.

క్రి యా న్

కాదని తెలిస్తే ?

ఈ డి ప స్

రాజులు పరిపాలన సాగించాలి.

క్రి యా న్

అధర్మంగా కాదు.

ఈ డి ప స్

నా ఈ థీబ్స్ - నిన్ను సైరించదు.

క్రి యా న్

థీబ్స్ నీ ఒక్కడిదే కాదు. ఇది నా నగరం కూడా —

బృ ం ద ం

ఈ వాగ్యుద్ధం చాలు. ఇక ఆపండి.
అదుగో! మహారాణి జొకాస్టా ఇటే వస్తున్నది. మీ మధ్యన తలఎత్తిన
ఈ వివాదాన్ని ఆవిడ సాయంతో అంతం కానివ్వండి.
( జొకాస్టా వస్తుంది. )

జొ కా స్టా

ఏమిటి మీరు చేస్తున్నది ?
ఇలా గొంతులు పెంచి వాదులాడుకోడానికి మీకు సిగ్గుగాలేదూ?
దేశమంతా ఎటుచూసినా కరువు కాటకాలేమిటి?
మాటామాటాపెంచే అర్థంలేని మీ కొట్లాటేమిటి ?
( ఈడిపస్‌తో )
మీరు అంతఃపురానికి వెళ్ళండి.
క్రియాన్! నువ్వు లోపలికి పద.

క్రి యా న్

జొకాస్టా ! నాకు భయంకరమైన శిక్షలు విధించే హక్కు
తనకున్నదంటున్నాడు నీ భర్త.
నన్ను చంపించడమో, దేశం నుంచి బహిష్కరించడమో
ఈ రెంటిలో ఏదో ఒకటి జరగాలట !

ఈ డి ప స్

నిజమే జొకాస్టా! నా ప్రాణాల్ని తియ్యడానికి కుట్రపన్నుతుంటే,
ఆయన్ని స్వయంగా పట్టుకున్నాను.

క్రి యా న్

భగవంతుడి సాక్షిగా నువ్వు నామీద మోపిన నేరాలలో ఏ ఒక్కటి
నిజమైనా ఈ క్షణంలో నా ప్రాణాలు తియ్యి. అదే నిజమైతే
ఏ శిక్షకైనానేను సిద్ధమే !

**జోకాస్టా**

ప్రభూ! భగవంతుడిమీద ఒట్టువేసుకు చెబుతున్నాడు.
అతని మాటలు నమ్మండి.
నాకోసం, ఇక్కడున్న ఈ ప్రజలకోసమైనా నమ్మండి.

**బృందం**

మహారాజా! ఆమె మాటలు వినండి. మీరుతీసుకున్న నిర్ణయాన్ని
మరోసారి పరిశీలించండి. మిమ్మల్ని బ్రతిమిలాడుకుంటాను.
ఆమె సలహా ప్రకారం చెయ్యండి.

**ఈడిపస్**

ఏం చెయ్యమని సలహా?

**బృందం**

క్రియాన్‌ని చాలా ఏళ్ళుగా ఎరుగుదుం.
ఏనాడూ ఆయన మూర్ఖంగా ప్రవర్తించలేదు.
ఇప్పుడతడి మాటలు నమ్మండి...అతన్ని గౌరవించండి.

**ఈడిపస్**

మీరడుగుతున్నదేమిటో మీకు తెలుసా?

**బృందం**

తెలుసు ప్రభూ!

**ఈడిపస్**

తెలిస్తే చెప్పండి.

**బృందం**

ఈ వ్యక్తి మీ స్నేహితుడు...ప్రమాణంచేసి ఆ మాట చెప్పాడు.
ఏవో పుకార్ల ఆధారంగా ఆయనను అగౌరవపరచకండి.

**ఈడిపస్**

అయితే ఇదీ అర్థం చేసుకోండి. మీరు అతన్ని మన్నించమంటే,
నా హత్యకో, దేశ బహిష్కరణకో మీరు ఒప్పుకుంటున్నారన్నమాట!

లేదు, లేదు...అపోల్లో సాక్షిగా-
నా మనసులో ఆభావం ఎక్కడన్నా ఉండిఉంటే
దేవతలచేత, మనుషులచేత కూడా పరిగ్రహించబడి
దిక్కులేని చావు చస్తాను.
మారణహోమం జరుగుతున్న థీబ్స్‌ని చూస్తే
నా హృదయం బాధతో కుతకుతలాడి పోతున్నది.
ఉన్న బాధలకి తోడు కొత్త బాధలు కొనితెచ్చుకోవాలా ప్రభూ?

### ఈ డి ప స్

సరే! అలానే కానివ్వండి.
అది నా హత్యకో దేశ బహిష్కారానికో దారితీసినా సరే!
అతడు చెప్పినందువల్ల కాదు.
మీరు కోరినందువల్ల నా మనసు ద్రవించింది.
కాని అతనంటే ఎప్పటికీ నాకు అసహ్యమే!

### క్రి యా న్

దయలో కూడ నిర్దయ? కోపంలో శాపావేశం?
ఇటువంటి ఆవేశాలున్న వాళ్ళు
తమ వినాశనాన్ని తామే కొనితెచ్చుకుంటారు.

### ఈ డి ప స్

వెళ్ళు...ఇక్కడనుంచి తక్షణమే వెళ్ళు...

### క్రి యా న్

వెడుతున్నాను- అన్యాయంగా మాటలుపడి-

### బృ ం ద ం

మహారాజుని నువ్వన్నా లోపలకు తీసుకుపో అమ్మా!

### జొ కా స్టా

అలాగే. కాని, కాని...ఈలోగా ఇక్కడేం జరిగిందో చెప్పండి.

బృందం

పుకార్లు, చెప్పుడు మాటలు, అనవసరమైన ఊహలు...
ఒకరికి మరొకరివల్ల
అన్యాయం జరిగిందన్న ఆరోపణ -

జొకాస్టా

ఒకరినొకరు నిందించుకున్నారా ?

బృందం

అవును.

జొకాస్టా

ఏమిటా నిందలు ?

బృందం

వద్దమ్మా, ఇంతటితో ఆ విషయాన్ని ఆపుదాం.
ఇప్పటికే దేశానికి ప్రమాదం
ముంచుకు వస్తున్నదని నాకనిపిస్తున్నది.
వాళ్ళు ఈ వివాదాన్ని ఎక్కడ వదిలిపెట్టారో,
మనంకూడా దాన్ని అక్కడే వదిలిపెడదాం.

ఈడిపస్

హుం ! మీ శాంతి వచనాలవల్ల ప్రయోజనం ఏమిటి-
నా కోపాన్ని నీళ్ళు కార్చడం తప్ప !

బృందం

మహారాజా ! ఇదివరకెన్నోసార్లు చెప్పాను.
మరోసారి చెబుతున్నాను. నా మాట నమ్మండి.
ప్రభువులకే ఎదురుతిరిగేంత పిచ్చివాణ్ణి, నమ్మకద్రోహిని కాదు.
థీబ్స్‌నావ కష్టాల కడలిలో పయనిస్తున్నప్పుడు
మీరు దాన్ని ఒడ్డుకు చేర్చారు.

ఇప్పుడు కూడా నేను కోరేదదే!
మళ్ళీ చెలరేగిన యీ తుఫానులో నుంచి
మమ్మల్ని శాంతి తీరానికి చేర్చండి.

**జొకాస్టా**

ప్రభూ! దయచేసి చెప్పండి... ఎందుకొచ్చింది క్రియాన్‌మీద
మీకింత ఆగ్రహం?

**ఈడిపస్**

చెబుతాను జొకాస్టా...నువ్వంటే నాకు గౌరవం. వీళ్ళందరిమీదకన్న...
క్రియాన్ నా మీద పన్నిన కుట్ర - అదీ నా ఆగ్రహానికి కారణం.

**జొకాస్టా**

ఎందుకొచ్చిందీ పోట్లాట అసలు?

**ఈడిపస్**

లయస్ మహారాజు హత్యకు కారణం నేనట! నేను హంతకుణ్ణట!

**జొకాస్టా**

ఆయన కెలా తెలుసు? దానికి ఆధారాలేమైనా ఉన్నాయా?
ఒట్టి పుకారేనా?

**ఈడిపస్**

అంత తొందరగా దొరికిపోతాడా క్రియాన్?
ఒక కుహనా ప్రవక్తనిపంపించాడు ఆ మాట చెప్పమని.

**జొకాస్టా**

ప్రవక్తనా? అయితే మీ మీద వచ్చిన ఆరోపణలకి మీరు
భయపడవలసిన అవసరం లేదు.
అంతటి దూరదృష్టి కలిగిన ప్రవక్త అంటూ ఈ ప్రపంచంలో లేడు.
మానవ మాత్రుడికి భవిషత్తును చూడగల శక్తి లేదు.
లయస్ మహారాజుకీ ఇలానే ఒక ద్రష్ట చెప్పాడొకసారి-
నాకూ తనకూ కలిగిన కొడుకే తనని హతమారుస్తాడని,

కాని చూసిన వాళ్ళు చెప్పడం
ఆయన బందిపోటు దొంగల చేతిలో మరణించాడని-
ఎక్కడో, ఊరికి దూరంగా మూడు దారులు కలిసే కూడలిలో.
ఆ కొడుకు ? పుట్టిన మూణ్ణాళ్ళకే
లయస్ అతని పాదాలకు మేకులు దిగగొట్టి
నిర్గమ పర్వతాల మీద పారవేయించాడు.
మరి ఆ ద్రష్ట చెప్పిన మాటలకి విలువేమిటి ?
కొడుకు లయస్‌ని చంప లేదే :
అందువల్లనే భవిష్యత్తును గురించిన ఊహాగానాలన్నీ
కట్టు కథలు. వాటిని నమ్మకండి.
భగవంతుడే మనకేదైనా చెప్పదలచుకుంటే,
వాటిని సూటిగా, మనకర్థమయ్యే విధంగానే చెప్పగలడు.

ఈ డి ప స్

జొకాస్టా : ఇప్పటి నీ కథనం నా మనసును కలవర పెడుతున్నది.

జొ కా స్టా

అదేమిటి ప్రభూ ?

ఈ డి ప స్

లయస్ హతమైందెక్కడ? మూడుదారుల కూడలిలోనా ?

జొ కా స్టా

అవును. అలా అనే విన్నాం. ఇప్పుడూ ఆ మాటే చెప్పుకుంటారు.

ఈ ప డి స్

ఎక్కడ జరిగిందది ?

జొ కా స్టా

ఆ ప్రదేశాన్ని ఫాసిస్ అంటారు. రెండుదారులు-
ఒకటి డెల్ఫీనుంచి, మరొకటి డేలియా నుంచి
వచ్చి అక్కడ కలుస్తాయి.

ఈ డి ప స్

ఎన్నాళ్ళయిందిది జరిగి ?

జొ కా స్టా

మీరు థీబ్స్ రావడానికి, రాజు కావడానికి
కొంచెం ముందుగా –

ఈ డి ప స్

అయ్యో ! భగవాన్ ! నన్నేం చేద్దామనుకుంటున్నావు ?

జొ కా స్టా

ప్రభూ ! ఏమిటి మీ బాధ ? నాతో చెప్పకూడదా ?

ఈ డి ప స్

ఇప్పుడేమీ చెప్పలేను...జొకాస్టా...
ఆ ! లయస్ ఎలావుండేవాడు ?
చనిపోయే నాటికి అతని వయసెంత ?

జొ కా స్టా

భారీ విగ్రహం ఆయనది...అప్పుడే
మధ్యవయసు నుంచి ముసలితనంలో అడుగుపెడుతున్నారు.
మనిషి ఒడ్డూ, పొడుగూ దాదాపు మీలానే ఉండేవారు.

ఈ డి ప స్

భగవాన్ ! ...ఏమిటీ పరీక్ష !...
నాకు తెలియకుండానే నేను శాప దగ్ధుణ్ణి అయ్యానా ?

జొ కా స్టా

ఏమిటి ప్రభూ, ఇది ! మిమ్మల్ని చూస్తుంటే భయం వేస్తున్నది.

ఈ డి ప స్

ఆ అంధ ప్రవక్త ప్రతిదీ స్పష్టంగా చూడగలడనిపిస్తున్నది.
అతడు చెప్పిందే నిజమా ?...
ఆ ! మరొక్క విషయం చెప్పు...

జో కా స్టా

అడగండి... నాకు చేతనైన సమాధానం చెబుతాను.

ఈ డి ప స్

హత్య చేయబడ్డప్పుడు లయస్ మహారాజు
దగ్గర ఎందరు భటులున్నారు ?

జో కా స్టా

ఆయన వెంట అయిదుగురు భటులున్నారు.
ఒకడు మాత్రం వార్తా హరుడు. ఒక అశ్వ శకటంలో
లయస్ ప్రయాణం చేస్తున్నారు.

ఈ డి ప స్

ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నది ...
సూర్యుని వెలుగంత స్పష్టంగా -
ఈ సంగతులన్నీ అప్పుడు మీకు చెప్పిందెవరు ?

జో కా స్టా

అంతఃపుర పరిచారకుడు ఒకడు.
అతడొక్కడే బతికి బయటపడ్డవాడు.

ఈ డి ప స్

ఇప్పుడూ అంతఃపురంలోనే వున్నాడా ?

జో కా స్టా

లేదు. అతడు తిరిగివచ్చే సరికి మీరు థీబ్స్‌కి
రాజైనారు. తన రాజులేని రాజ్యంలో
తానుండలేనని, తనను ఎక్కడైనా థీబ్స్‌కి దూరంగా మారుమూల
పల్లెలకు పంపమని వేడుకున్నాడు. అక్కడే గొర్రెలను
కాచుకుంటూ బతుకుతానన్నాడు...నేను సరేనన్నాను.
అతడు సేవకుడే! అయినా అతనికి ఇదేమిటి – ఇంతకన్న
ఎక్కువే చేయాలి నేను.

**ఈ డి ప స్**

అతన్ని పిలిపించు... వెంటనే...

**జొ కా స్టా**

అలానే ...కాని అతను రావడం అంత అవసరమా ?

**ఈ డి ప స్**

నేనతన్ని వెంటనే చూడాలి.

**జొ కా స్టా**

సరే! అలానే పిలిపిస్తాను... కాని...
మీ మనసులో మీరు పడుతున్న మథనేమిటి ?
నాకు కూడా చెప్పకూడదా ?

**ఈ డి ప స్**

భయంకరమైన నిజాలు నా గుండెల్ని బద్దలు చేస్తున్నప్పుడు
నీకు కాక మరెవరికి చెప్పుకుంటాను ?

నా తండ్రి పోలిబస్, కొరింత్‌కు రాజు.
నా తల్లి మెరోప్, డోరియన్ వాసి.
మా నగరంలో ప్రతివాడూ నన్ను యువరాజులా చూసేవాడు.
కొరింత్‌లో నన్ను మించినవాడు లేడన్న గర్వంతో ఉన్నప్పుడు
అకస్మాత్తుగా ఒక విషయం జరిగింది–
ఒక విందులో తప్పతాగిన ఒకడు మైకంలో
నేను నా తండ్రికి పుట్టలేదని తూలనాడాడు.
నాకు విపరీతమైన ఆగ్రహం వచ్చింది.
కాని నన్ను నేను సంబాళించుకున్నాను, కనీసం ఆ రోజుకు.
మరునాడు నా తల్లిదండ్రుల్ని నిలదీసి అడిగాను.
వారికీ అలానే ఆమాట అన్నవాడిమీద ఆగ్రహం వచ్చింది.
వారి కోపం చూసి ఆ విషయం నిజం కాదనుకున్నాను.

కాని ఆ మాట నాలో అగ్నిగోళంలా ఉడికిపోతోంది.
ఇంతలో ఊరూ వాడా తెలిసిందా విషయం.
నా తల్లిదండ్రుల్తో కూడా చెప్పకుండా అపోల్లో
దేవాలయానికి వెళ్ళాను.
నా ప్రశ్నకు సమాధానం కోరాను;
నా జన్మ రహస్యం ఏమిటన్నాను-
అపోల్లో నా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు; కాని
నా భవిష్యత్తు భయంకరమైనదని,
సంక్షోభంతో కూడిందని చెప్పాడు.
నా తల్లిని పెళ్ళిచేసుకుంటాననీ, ఆమెతో పిల్లల్ని కంటానని,
నా తండ్రినే హత్య చేస్తాననీ-

ఆ మాటలు వింటూనే అక్కణ్ణుంచి పారిపోయాను.
తల్లిదండ్రుల్ని వదిలి...కొరింత్‌కు దూరంగా...
ఆ దైవవాణి వాక్కులు వినపడనంతదూరంగా
వెళ్ళాలని పరుగులు తీస్తూ పోతున్నాను.

ఆ ప్రయాణంలో లయస్ మహారాజు ఎక్కడ మరణించాడని
నువ్వు చెప్పావో ఆ చోటికే వచ్చాను.
అక్కడ జరిగిందేమిటో నీకు వివరంగా చెబుతాను.

ఆ దారి వెంట నడుస్తూ నడుస్తూ
నువ్వు చెప్పిన మూడు దారుల కూడలికి వచ్చాను.

అక్కడ ముందుగా ఒక వార్తాహరుడు.
వెనక అశ్వ శకటంలో ఒకమనిషి
...సరిగ్గా నువ్వు చెప్పినట్లుగానే-
వాళ్ళిద్దరూ నన్ను దారి తొలగమని
ఆజ్ఞాపించారు; తూలనాడారు.

ముందునడుస్తున్న భటుడు నన్ను దూరంగా తోశాడు
నాకోపం వచ్చింది. అతన్ని కొట్టాను - బలం కొద్దీ కొట్టాను.
ఆ తర్వాత నా దోవన నే పోదామని బయలుదేరాను.
శకటాన్ని దాటాను.
అలా దాటానో లేదో, ఆ శకటంలో వున్న మనిషి
ఒక బల్లాన్ని నామీదకు గురిచూసి విసిరాడు.
కొద్దిలో తప్పింది...
నా కోపం ఇనుమడించింది.
నా చేతిలో వున్న కర్రతో అతన్ని చావబాదాను.
అతను కిందకు ఒరిగాడు.
అతనూ, అతనికి బాసటగా వచ్చిన భటులందర్నీ వధించాను.

నా చేతుల్లో చనిపోయిన ఆ మనిషే లయస్ అయితే
నా కన్న దురదృష్టవంతుడీ ప్రపంచంలో ఉంటాడా ?
నా కన్న అస్యహించుకోదగిన మనిషెవరు ?

సంసార గృహాల్లో-వ్యాపార స్థలాల్లో
పూజామందిరాల్లో-నేను ప్రవేశానికి అనర్హుణ్ణి
తినడానికి తిండి, ఉండడానికి నీడా దొరకవు, నాకు.
ప్రజలందరికీ వర్తించిన శాసనమే
మహారాజుకీ వర్తిస్తుంది.
దేశ బహిష్కరణమే అతన్నీ వరిస్తుంది.
నా శాసనమే నాకు శాపమై నన్ను దహిస్తుంది.

అతని హత్యతో పాప పంకిలమైన ఈ చేతులతోనే...
అతని భార్యను... ఓ! భగవాన్!
నేను అపవిత్రుణ్ణి... దుర్మార్గుణ్ణి
థీబ్స్‌నుంచి బహిష్కరించడమే నాకు తగిన శాస్తి...

ధీబ్స్ బహిష్కరించినా
నా దేశం-కొరింత్-వెళ్ళలేని అసమర్థుణ్ణి.
అక్కడికి వెడితే
నా తండ్రి పోలిబస్‌ని చంపి ఆ తల్లిని వివాహం చేసుకుంటానేమో?
ఏమిటీ నాకీ శాప పరంపర ?

భగవాన్! ఆరోజు మాత్రం రానివ్వకు
అంతకన్న నన్నిక్కడే-ఈ మనుషుల మధ్యనే
అంతరించిపోనీ —
అటువంటి దయనీయమైన స్థితికి
నన్ను దిగజార్చకు.

**జొ కా స్టా**

ఎంతటి భయంకరమైన కథ! కాని మనం నిరాశ చెందాల్సిన
అవసరం లేదు... లయస్ హత్యని కళ్ళారా చూసిన
ఆ గొర్రెల కాపరి ఏం చెబుతాడో విందాం.

**ఈ డి ప స్**

అవును ... అదే నా చివరి ఆశ !
ఏడీ ? ... అతడింకా రాలేదే ! !

**జొ కా స్టా**

అతని రాకకు అంత తొందరెందుకు ?

**ఈ డి ప స్**

చెప్పనా ? అతడూ నువ్వు చెప్పిన కథనే ధృవపరిస్తే
ఈ హత్యా నేరాన్ని నామీద మోపడానికి వీలులేదు.

**జొ కా స్టా**

అంటే ? ... నాకర్థం కావడం లేదు.

ఈ డి ప స్

లయస్ చాలామంది బందిపోటుల చేతిలో మరణించాడని కాదూ
అతను చెప్పింది. అదే నిజమయితే నేను హంతకుణ్ణి కాను.
కాని ... లయస్‌ని చంపింది ఒక్కడే అని అతనంటే మాత్రం...
ఆ హత్యకు కారణం నేను కావచ్చు.

జొ కా స్టా

మీరు ఆందోళన చెందకండి ప్రభూ !
ఆ గొర్రెల కాపరి చెప్పిన కథ ఇక్కడ అందరికీ తెలుసు.
ఇప్పుడొచ్చి కొత్త కథ ఎందుకు చెబుతాడు ?

చాలా రోజులైంది కనక – అతను చెప్పే విషయాల్లో
చిన్న చిన్న మార్పులు ఉన్నా – లయస్ మహారాజు మరణం
అపోల్లో వాణి చెప్పినట్టుగానే జరిగిందని అతను కూడా అనలేడు.

ఎందుకో తెలుసా ? లయస్ – నాకూ తనకు పుట్టిన
కొడుకు చేతుల్లోనే మరణిస్తాడని అపోల్లో కథనం.
కాని, ఆ పసివాడు లయస్‌ని చంపలేదు సరికదా –
తానే ముందుగా మరణించాడు. అదీ భగవద్వాణి బలం ! !
అందుకే దాన్ని నేను నమ్మను.

ఈ డి ప స్

నిజమే కాని, ఆ గొర్రెల కాపరి వచ్చి తాను స్వయంగా
జరిగింది చెబితేకాని నాకు స్వస్థత లేదు. అతని కోసం
ఎవరినైనా పంపు. త్వరగా –

జొ కా స్టా

అతనికోసం ఇప్పుడే కబరు పంపుతాను. లోపలికి వెడదాం పదండి–
( ఇద్దరూ వెళ్ళిపోతారు )

బృందగానం

విధి లిఖితం ఎవరికీ తప్పదు.
భగవంతుడు రాసిన రాత
మన జీవితాల ఎల్లల్ని నియమిస్తూ గీసిన గీత.

అందుకే భగవద్వాణిని మనసా వాచా నమ్ముతాను.
దానికి మరణం లేదు. అది అనునిత్యం సత్యం.
అందుకే భగవంతుడు గొప్పవాడని నమ్ముతాను.
వార్ధక్యం, మరణం లేనిది భగవత్స్వరూపం —
దానిలో నమ్మకం ఉంచడమే ఈ జీవితానికి వరం.

దురహంకారం నియంతృత్వానికి దారితీస్తుంది
నియంతృత్వం పెరిగి పెరిగి
ఆకాసపుటంచుల కెదిగాననుకొని
అంధకార కూపంలోకి అధః పతనమవుతుంది.

అందుకే నియంతలను మట్టుపెట్టి
దేశ సౌభాగ్యానికి అంకితం అయ్యే
ఉత్సాహాన్ని మా నుంచి దూరం చెయ్యొద్దని
నన్ను రక్షించే నా భగవానుడికి
విజ్ఞప్తులు పంపుకుంటున్నాను.

న్యాయానికి కట్టుబడక
తనకు తోచినదే న్యాయమనే
నియంతలని ఏం చెయ్యాలి ?
ప్రబలిన దురహంకారం పతనం కావాలి. తప్పదు.
క్రూరమైన విధికి వారు బలి కాకా తప్పదు.
అహంకార మన్యాయం ఆమోదం పొందితే
ఆరాధనకీ, పూజలకీ అర్థం ఇక ఏమిటి ?

భగవద్వాణి చెప్పిందన్న ఈ మాటలు నిజమయ్యే దాకా
ప్రతి మనిషీ ఆ సత్యం ఔదల దాల్చేదాకా-
నేనే దైవాన్నీ పూజించలేను. ఏ గుడికీ వెళ్ళలేను.
ప్రపంచానికంతటికీ నడిబొడ్డున ఉన్నదన్న
డెల్ఫీ ఆలయానికి పోయి నమ్రతతో పూజించలేను.

ఓ జియస్ ప్రభూ ! నా నివేదన విను.
దేవదేవుడన్న పేరు సార్థకం చేసుకో !
నీ శక్తి అజేయం అని మరోసారి నిరూపించు ! !
లయస్ మరణ విషయంలో
నువు చెప్పిన మాటలబద్ధాలని
జనం చెవులు కొరుక్కుంటున్నారు.
అపోల్లో శక్తినే శంకిస్తున్నారు-
మానవుల మనసుల్లో నిండుకున్న
భగవద్ మహిమా భావాన్నే వమ్ము చేస్తున్నారు.
భగవాన్ ! మేలుకో-

సర్వధర్మ నియతా ! సర్వ శక్తి సమన్వితా !
మాకు నువ్వంటే వున్న నమ్మకాన్ని వమ్ము చేయకు.

**( జొకాస్టా, ప్రవేశిస్తుంది, చేతిలో ఆలివ్ కొమ్మలతో )**

**జొ కా స్టా**

**( బృందంతో )**

థీబ్స్ ప్రజలారా! ఈ కొమ్మలూ, ఈ ధూపం చేత పట్టుకొని
అపోల్లో ఆలయానికి నేనూ వచ్చాను.
ఈడిపస్ ప్రభువు మనసు వికలమై వుంది.
తర్కమూ, ఆలోచనా ఆయనకు దూరమైపోయాయి.
తన బాల్యంలో ఏం జరిగిందో తెలుసుకోవాలన్న

బలీయమైన కోరిక అతన్ని పిచ్చివాణ్ణి చేసింది.
నేను ఎంతో చెప్పిచూశాను.
కాని నా సలహా ఆయనకు నచ్చడం లేదు.
( దేవాలయానికి అభిముఖంగా నిలబడి )
తండ్రీ అందుకే నీ ముందు మోకరిల్లి నీ ఆశీస్సులకోసం
అభ్యర్థన చేస్తున్నాను.
భగవాన్! మాకు విముక్తి ప్రసాదించు.
ఈ అపవిత్రత నుంచి మమ్మల్ని కాపాడు.
భయభ్రాంతుడైన నౌకాధిపతి నడిపే నావలోని
ప్రయాణీకులవలె వున్నాం ప్రభూ!
నీవే మాకు రక్ష!

( కొరింత్ నుంచి వచ్చిన వార్తాహరుడు ప్రవేశిస్తాడు )

**వా ర్తా హ రు డు**

( బృందంతో )
ఎవరీ బాబులు? అయ్యిగోరూ! మిమ్మల్నే! ఈడిపస్ దొర
కోటఎక్కడుందో సెబుతారా? పోనీ, దొరెక్కడున్నాడో జెబితే పోలా?

**బృం ద నా య కు డు**

ఇదే రాజప్రాసాదం. లోపలే వున్నాడు మహారాజు.
ఈమె మహారాజు భార్య. జొకాస్టా మహారాణి.

**వా ర్తా హ రు డు**

అట్లాజెప్పరూ!...అమ్మో ! దణ్ణాలమ్మగోరూ ! పిల్లాపాప చల్లంగా
ఉండాలి.

**జొ కా స్టా**

ఎవరుబాబూ నువ్వు? నీ మాటల చలవ వల్ల అందరం కులాసాగా
వుంటే అదే పదివేలు. ఎక్కడనుంచి వస్తున్నావు ?
రాజుగారికి ఏమైనా వార్త తెచ్చావా ?

వా ర్తా హ రు డు

ముసలాడి సావుకి ఇవన్నీ యేంటి? పెద్దోడయినాడు ... కాలం చెల్లింది.

ఈ డి ప స్

అయితే వృద్ధాప్యమన్నమాట!

వా ర్తా హ రు డు

అంతేమరి! సాలాయేళ్ళు బతకలే?

ఈ డి ప స్

జొకాస్టా! ఇక అపోల్లో వాణిని మనం పట్టించుకోనక్కర్లేదు. పక్షుల మాటలు ఆధారంగా మన భవిష్యత్తులు చెప్పే ప్రవక్తలు నేను నా తండ్రిని చంపుతానన్నారే! వృద్ధాప్యం వల్ల ఆయన కొరింత్‌లో మరణించాడు. నేనేమో - ఇక్కడ, థీబ్స్‌లో వున్నాను. నా కత్తిమీద చెయ్యి కూడా వెయ్యలేదు ... ఈ భవిష్యద్వాణి ఒట్టి బూటకం!

జొ కా స్టా

ఆ మాట మీకెన్నిసార్లు చెప్పలేదు నేను?

ఈ డి ప స్

నిజమే! కాని నా భయాలు నన్ను చెవిటివాణ్ణి చేసినయ్.

జొ కా స్టా

ఇంకా భయమెందుకు? హాయిగా ఊపిరి పీల్చుకోండి.

ఈ డి ప స్

లేదు. ఇంకా భయోత్పాతం పూర్తిగా నా నుంచి పోలేదు. ఆ భవిష్యద్వాణి చెప్పిన రెండో విషయం- నా తల్లినే నేను వివాహం చేసుకుంటానని-

జొ కా స్టా

భయమా? మనిషెందుకు భయపడాలి? మనిషి జీవితం విధిలిఖితం. దేన్నీ మనం ముందుగా గ్రహించలేం. హాయిగా బతకడానికి మార్గం-

బతకడమే! మీ తల్లిని వివాహం చేసుకోవాలేమోనని భయపడకండి. చాలా మంది పురుషులు-తమ కలల్లో అటువంటి అనుభూతిని పొందుతూనే వుంటారు. కాని హాయిగా బతకాలంటే అటువంటి భయాలకు మన మనసులో తావివ్వకూడదు!

ఈ డి ప స్

మా అమ్మ బ్రతికి వుండకపోతే నువ్వు చెప్పినదంతా
నిజమని నేనూ ఒప్పుకొనే వాడిని.
కాని ఆమె బ్రతికి వుంది.
అందువల్ల నా భయాలు నన్ను వెన్నాడుతూనే ఉన్నాయి.

జొ కా స్టా

మీ తండ్రిగారి మరణవార్త కొంత ఊరట కలిగించడం లేదా?

ఈ డి ప స్

నిజమే... కాని నా తల్లి బ్రతికివున్నంత కాలం
నాకీ భయం పోదు.

వా ర్తా హ రు డు

ఎవరు దొరా ఆ అమ్మ! నిన్నంతగా బయపెట్టేదెవరో సెబుతావ్?

ఈ డి ప స్

మా అమ్మ - పోలిబస్ భార్య-
మెరోప్-ఆవిడా నా భయానికి కారణం.

వా ర్తా హ రు డు

అదేంధి ! ఆవిఢంటే బయమెందుకు ?

ఈ డి ప స్

భగవంతుడి శాపం.

వా ర్తా హ రు డు

అదేందో నాకు గూడా చెప్పొచ్చునా ? - లేకపోతే -
బయటోళ్ళు ఇనగూడదా ?

**ఈ డి ప స్**

ఎందుకు వినగూడదు ? మా నాన్నగారిని చంపి
మా అమ్మను వివాహం చేసుకుంటానని
అపోల్లో వాణి జోస్యం చెప్పింది.
అందుకే ఇంతకాలం
కొరింత్ వదిలి పరాయి దేశాలలో
కాలం గడుపుతున్నాను.

**వా ర్తా హ రు డు**

అట్లనా! ఇందుకోసమా నువ్వు కొరింత్
ఎదిలిపెట్టి దేశాలు పట్టి పోయినావు ?

**ఈ డి ప స్**

అవును, పితృ హంతకుణ్ణి కావడం నాకిష్టం లేకపోయింది.

**వా ర్తా హ రు డు**

దొరా! ఇదివరకే ఈ బయం లేకుండా జెయ్యాల్సుండె నేను...
నీ కన్నీ మంచి ఊసులు దెచ్చినా దొరా ఇయాల!

**ఈ డి ప స్**

నిజంగా అంతటి మంచి వార్తే అయితే నీకు గొప్ప బహుమానాలిస్తాను.

**వా ర్తా హ రు డు**

అందుకే గదూ ఇంతదూరం పనికట్టుకొచ్చినా!
నిన్ను కొరింత్‌కు తీసుకుపోయి రాజును సెయ్యాల-
అప్పుడు బవుమానం తీసుకోవాల-

**ఈ డి ప స్**

కొరింత్ నగరానికి నేను రావడం కల్ల.

**వా ర్తా హ రు డు**

అంటే నీకు అసలు ఇసయం తెలీదన్న మాట!

**ఈ డి ప స్**

అసలు విషయం ఏమిటి? వివరంగా చెబుదూ-

**వా ర్తా హ రు డు**

నువ్వు కొరింత్‌కి రావడానికి బయపడనక్కర్లేదూ అంటున్నా-

**ఈ డి ప స్**

ఎందుకని ? నేను పోలిబస్, మెరోప్‌ల కొడుకును కదా!
వాళ్ళ దగ్గరికి
చూస్తూ చూస్తూ ఎలారాను ? అపోల్లో
చెప్పిన మాట ఏమిటో చెప్పాను గదా!

**వా ర్తా హ రు డు**

అదే గదా నే జెప్పేది: పోలిబస్ నీ కేమీ కాడు-
నువు నిబ్బరంగా కొరింత్ రావచ్చు.

**ఈ డి ప స్**

అదేమిటి ? పోలిబస్ నా తండ్రి కాదా ?

**వా ర్తా హ రు డు**

నేను నీ కెంత తండ్రినో పోలిబస్ కూడా అంతే!

**ఈ డి ప స్**

ఏమిటీ!

**వా ర్తా హ రు డు**

అసలు ఇసయమేటంటే-ఆయనకు నిన్ను
సొయంగా నా సేతుల్తో యిచ్చాను.

**ఈ డి ప స్**

నువ్విచ్చావా! నన్ను పెంచుకున్నారా?...
మరి ఆయన నన్ను అంతగా ప్రేమించేవాడు-

**వా ర్తా హ రు డు**

పిల్లలు లేరు గందా! - అందుకని నువ్వంటే ఆ దొరకి
పంచ పాణాలు - నేనెరగనా!

ఈ డి ప స్

నువ్వు ఇచ్చావా నన్ను! ... ఎట్లా? నన్నెక్కడన్నా కొన్నావా?
ఎక్కడైనా దొరికానా?

వా ర్తా హ రు డు

నిన్ను సితరాన్ కొండ లోయల్లో సూసినా-

ఈ డి ప స్

నువ్వెక్కడి కెందుకు వెళ్ళావు!

వా ర్తా హ రు డు

బావుందయ్యోయ్...నేనెందుకెడతా ...
గొర్రెల మందని తోలుకెళ్ళినా-

ఈ డి ప స్

ఓ! నువ్వు గొర్రెల కాపరివా? పాలేరుగా ఉండేవాడివా?

వా ర్తా హ రు డు

పాలేరునే - కాని - ఆ రోజు మాత్రం-
సచ్చిపోయేవాణ్ణి నిన్ను బతికించినా-

ఈ డి ప స్

నువ్వు నన్ను చూసినప్పుడు, చాలా బాధపడుతున్నానా?

వా ర్తా హ రు డు

బాద పడతన్నానా అంటావ్! పసికూనవి. ఎవరో
నీ కాళ్ళకి సీలలు దిగేసి ఉంచినారు. నేనే ఇడిపించినా -

ఈ డి ప స్

నా చిన్నతనం నుంచీ ఆ సిగ్గుతోనే బతుకుతున్నాను.

వా ర్తా హ రు డు

కాళ్ళు వాచిపోయున్నాయని గదూ ఈడిపస్ అని పేరు బెట్టింది.

ఈ డి ప స్

కాని నన్నా విధంగా చేసిందెవరు? నా తల్లా? తండ్రా? చెప్పు-

**వార్తాహరుడు**

నా కెట్టా తెలుస్తది? నిన్ను నాకిచ్చినాయన్నడిగితే తెలుస్తది.

**ఈడిపస్**

నన్ను మరెవరో నీకిచ్చారా? ఎవరు?

**వార్తాహరుడు**

నాతోపాటే గొర్రెలు కాసే ఒకాయన.

**ఈడిపస్**

ఎవరది? నువ్వెరుగుదువా అతన్ని? అతడెలా వుంటాడో చెప్పగలవా?

**వార్తాహరుడు**

నాకు బాగా గాపకం-ఆయన లయస్ మారాజు కొలువులో ఉండేవాడు:

**ఈడిపస్**

ఎవరు? ఇదివరకు ఇక్కడ రాజ్యం చేసిన రాజుగారా?

**వార్తాహరుడు**

అవును. ఆయన-రాజుగారి గొర్రెల్ని కాసేవాడు. కోటలో ఉండేవాడు...

**ఈడిపస్**

అతనింకా బతికున్నాడా? నేనతనితో మాట్లాడడానికి వీలు అవుతుందా?

**వార్తాహరుడు**

( బృంద నాయకులతో )
నాకంటే మీకు బాగా తెలిసుండాల్నే -

**ఈడిపస్**

ఇక్కడవున్న మీకెవరికైనా ఈ వార్తాహరుడు చెప్పిన
గొర్రెల కాపరి తెలుసా?

**బృందనాయకుడు**

మీరింతకు ముందు చూడాలనుకున్న పశువులకాపరే అతను.
కాని మా కన్న ఎక్కువగా జొకాస్టా రాణికి
అతని విషయం తెలిసి వుండాలి.

ఈ డి ప స్

జొకాస్టా! ఇప్పుడు కబురు పంపిన గొర్రెల కాపరిని నువ్వు
ఎరుగుదువా? అతనిని గురించేనా ఇతను మాట్లాడుతున్నది కూడా?

జొ కా స్టా

( పాలిపోయింది )
ఎవరిని గురించైతే మనకెందుకు?
అతను చెప్పిందేమీ పట్టించుకోకండి-ఆ మాటల కర్థం లేదు.

ఈ డి ప స్

ఏమిటీ! నన్ను గురించిన నిజమేదో తెలుసుకోడానికి
ఇంత మంచి ఆధారం దొరికితే
ఇప్పుడు దాన్ని పట్టించుకోవద్దంటావా?
నా జీవితాన్ని గురించిన సమస్యకి సమాధానాన్ని
కనుక్కోవద్దంటావా? లేదు. అలా జరగడానికి వీల్లేదు.
నాకు పూర్తి నిజం తెలిసితీరాలి.

జొ కా స్టా

భగవంతుడి సాక్షిగా చెబుతున్నాను. మీ జీవితం
మీద మీకేమాత్రం మమకారం ఉన్నా, ఇంకా
యీ విషయం మరిచిపోండి... ఇంతకన్నా
నన్ను బాధపెట్టకండి...

ఈ డి ప స్

ఏమిటి నీ భయం ?

జొ కా స్టా

నా సలహా వినండి...వద్దు...ఈ వెతకడం ఇంతటితో ఆపండి...

ఈ డి ప స్

నన్నెవ్వరూ ఆపలేరు...నాకు పూర్తి నిజం తెలిసి తీరాలి.

జొ కా స్టా

దురదృష్టవంతుణ్ణి ఎవరు రక్షించగలరు ?
నువ్వెవరో ఎప్పటికీ నీకు తెలియకపోవడమే మంచిది !

ఈ డి ప స్

( భటులతో )
ఆ గొర్రెల కాపరి ఎక్కడున్నాడో
వెతికి తీసుకురండి...వెంటనే రావాలి.

జొ కా స్టా

దౌర్భాగ్యుడివి...అదే: ఇప్పుడు నీకు సరైన పేరు !
మళ్ళీ ఈ జన్మలో నీ పేరు ఎత్తలేను...భగవాన్ !
( జొకాస్టా పరుగెత్తుకొని వెళ్ళిపోతుంది. నిశ్శబ్దం. )

బృ ం ద నా య కు డు

జొకాస్టా రాణి ఎందుకంత తొందరగా, బాధగా వెళ్ళిపోయింది ?
ఈ భయంకర నిశ్శబ్దం నుంచి ఏ దుర్భర సత్యం
వెలువడుతుందో కదా !

ఈ డి ప స్

ఎంత చేదు నిజమైనా నా జనన రహస్యాన్ని
నేను తెలుసుకు తీరుతాను...ఏమై ఉంటుందా రహస్యం ?
నేను బానిసగా పుట్టాననా ! జొకాస్టా భయం అదే కావచ్చు !
ఆమె రాజ వంశానికి చెందినది. నేను బానిసనైతే
ఆమె అహం దెబ్బతింటుందని ఆమె భయం. కాని
నాకా భయం లేదు. విధి నా తల్లీ, తండ్రీ !
అలా చెప్పుకోవడానికి నేను సిగ్గుపడను.
ఈ రహస్యాన్ని ఆసాంతం తెలుసుకోకుండా మధ్యలోనే వదిలిపెట్టను.

( అంతఃపురంలోకి వెడతాడు )

బృందగానం

నేను భవిష్యత్తును చూడగల
నిజమైన ద్రష్టనయితే-
నాకు స్పష్టంగా కనిపిస్తున్నదిది
రేపు పౌర్ణమి. ఆ నాటి అర్ధరాత్రి
ఈడిపస్ సితరాన్ కొండలని
తనకు సేద తీర్చే తల్లిగా స్వీకరిస్తాడు.

2వ పౌరుడు

సితరాన్ కొండ! మా రాజుగారి జన్మస్థలం అది!
మా రాజుగారికి నచ్చిన చోటు అది!
అందుకే అక్కడ ఆటలతో పాటలతో
ఆనందంగా బతకాలని వెడుతున్నాడా?

నాయకుడు

బాబూ! ఈడిపస్! నీ తల్లిదండ్రులెవరయ్యా?
కొండల మీదుండే దేవుడు "పాన్" నీ తండ్రా!
అపోల్లో దొర ప్రేయసి నీ తల్లా?
ఆయనకీ కొండ చాళ్ళలో పచ్చిక బయళ్ల
అంత యిష్టమయింది అందుకోసమేనా?
లేకుంటే హెర్మెన్ నీ తండ్రా?
కాదు, కాదు; డయొనిసస్ కావచ్చును.
హెలికాన్ కొండల్లో అప్సర స్త్రీలతో
ఆయన ఆడిన కేరింతల ఫలితమా నువ్వు?

( గొర్రెల కాపరి వస్తాడు. వెంట ఇద్దరు రక్షక భటులు )
( ఇంతలో ఈడిపస్ లోపలినుంచి వస్తాడు )

ఈడిపస్

ఎవరా వస్తున్నది?
ఈ మనిషిని నేనిదివరకెప్పుడూ చూడలేదు.
ఇంతకాలం ఎదురుచూస్తున్న గొర్రెలకాపరి ఇతడేఅయివుండాలి.

ఇతడు ఆ కొరింత్ వార్తాహరుడు
చెప్పినట్టే ఉన్నాడనిపిస్తున్నది.
అదుగో! అతనిని తోడ్కొని తెచ్చినవాళ్లు
మా రక్షక భటులే! వారిని నేను గుర్తించగలను.

( బృంద నాయకుడితో )

ఈ మనిషి మీకు ఇదివరకే తెలుసుగదా!
మీరు గుర్తుపట్టగలరా అతన్ని?

**బృంద నాయకుడు**

అవును. లయస్ మహారాజు అంతరంగిక
సేవకుల్లో ఒకడు. గొర్రెల కాపరిగా ఉండేవాడు.

**ఈడిపస్**

( వార్తాహరుడితో )

ముందుగా నువ్వు చెప్పు.
నువ్వు చెప్పిన గొర్రెల కాపరి ఇతడేనా?

**వార్తాహరుడు**

అయ్యబాబోయ్! అచ్చంగా ఆయనేనండీ –

**ఈడిపస్**

( గొర్రెల కాపరితో )

చూడు తాతా... దగ్గరకు రా...
నా కళ్ళలోకి చూసి నిజం చెప్పు....
నువ్వు ఒకప్పుడు
లయస్ మహారాజు దగ్గర సేవకుడిగా ఉండేవాడివా ?

**గొర్రెల కాపరి**

అవును బాబూ... నా చిన్న తనం అంతా ఇక్కడే గడిచింది.
ఈ కోటలోనే పుట్టాను. ఇక్కడే పెరిగాను.

**ఈడిపస్**

కోటలో నువ్వు ఏం చేస్తుండేవాడివి?

**గొర్రెల కాపరి**

చాలా ఏళ్ళు రాజుగారి గొర్రెలు కాపలా కాచేవాణ్ణి.

**ఈడిపస్**

ఈ గొర్రెల మందల్ని
ఎక్కడ మేపేవాడివి ?

**గొర్రెల కాపరి**

అదేమిటి ? సితరాన్ కొండల్లో, ఆ పక్కనవున్న లోయల్లో-

**ఈడిపస్**

నువ్వు ఇతన్ని ఎరుగుదువా ? జాగ్రత్తగా చూడు.

**గొర్రెల కాపరి**

ఎవరు ?...
**(తత్తరపాటు చెందాడు. రాజును, వార్తాహరుణ్ణి మార్చి మార్చి చూస్తూ)**
ఇక్కడేం చేస్తున్నాడు ?

**ఈడిపస్**

ఇతన్ని... ఎప్పుడైనా ఎక్కడైనా ఇతన్ని కలిశావా ?

**గొర్రెల కాపరి**

పెద్దవాడినవుతున్నానా...జ్ఞాపకం రావడం లేదు...ఎవరబ్బా-

**వార్తాహరుడు**

దొరా-ముసలాడైనాడు గందా-గాపకం ఎక్కడుంటది?
నేను గాపకం చేస్తా ...

ఓయ్ ముసలయ్యా! నేను గావకం లేదూ?...సూడు!
మనం సితరాన్ కొండల్లో గొర్రెల్ని కాసేవాళ్ళం . . .
నువ్వేమో రాజుగారి రెండుమందల్ని నేనేమో నా ఒక్క మందని
తోలుకొచ్చేవాళ్ళం.
బాగా గావకం తెచ్చుకో....మూ డేసంకాలాలు కలిసి మేవుకోలా....
శీతాకాలం ఒచ్చేతలికి నువ్వు నీ గొర్రెల్ని తీసుకొని
రాజుగారి పొలాలమీదికి పోయేవాడివి. నా గొర్రెల మందని
తీసుకుని నేను కొరింత్ పోయేవాణ్ణి. ఇంకా గావకం రాలా?

**గొర్రెలకాపరి**

నేను అక్కడ మందల్ని కాయడం నిజమే!
కాని...అది ఎన్నో ఏళ్ళ కిందట గదా!
....జ్ఞాపకం రావడం లేదు.

**వార్తాహరుడు**

పోనీ ఈ సంగతి చెప్పు. మనం
అక్కడ గొర్రెల్ని కాచేటప్పుడు నాకో
పసికూన నిచ్చి పెంచుకోమన్నావు గందా?
ఇప్పుడన్నా గావకం వచ్చిందా?

**గొర్రెలకాపరి**

ఏమంటున్నావ్?....ఆ మాట ఎందుకొచ్చిందిప్పుడు?

**వార్తాహరుడు**

ఇదిగో ఇక్కడ ఈడిపస్ మారాజును
చూశావా! ఆ నాడు నువ్వు నా కిచ్చిన
బిడ్డడే ఈ ఈడిపస్ మారాజు-

**గొర్రెలకాపరి**

దరిద్రుడా! నోరుముయ్....

ఈ డి ప స్

ముసలాయనా! అతన్ని కోప్పడకు.
నువ్వే కొంచెం సంబాళించుకోవాలి.

గొ ర్రె ల కా ప రి

నేనేం తప్పుచేశాను దొరా ?

ఈ డి ప స్

ఆ చిన్నపిల్లాణ్ణి గురించి అతడడిగిన
ప్రశ్నకి నువ్వు సమాధానం చెప్పవేం ?

గొ ర్రె ల కా ప రి

అతడేం మాట్లాడుతున్నాడో
అతనికే తెలియదు . . . మీరు అనవసరంగా
కాలం వృథా చేసుకుంటున్నారు.

ఈ డి ప స్

నీ అంతట నువ్వే చెబితే సరే, లేకపోతే
నీనుంచి సమాచారం ఎలా రాబట్టాలో మాకు తెలుసు.

( భటులు అతని చేతులు వెనక్కు విరిచి పట్టుకుంటారు. )

గొ ర్రె ల కా ప రి

అబ్బా ! ముసలాణ్ణి...నన్ను హింసించకండి.

ఈ డి ప స్

ఇప్పుడు చెప్పు.

గొ ర్రె ల కా ప రి

ఎందుకు నన్నిలా హింస పెడుతున్నారు ? మీకేం కావాలి ?

ఈ డి ప స్

అతను చెప్పినట్లుగా ఓ పసివాణ్ణి అతనికిచ్చావా, లేదా ?

గో ్ర రె ల కా ప రి

ఆః ఇచ్చాను . . . ఇచ్చిననాడే నేను చచ్చిపోయుండాల్సింది.

ఈ డి ప స్

ఇప్పుడు చచ్చిపోతావ్, నేనడిగిన వాటికి
సరైన సమాధానాలివ్వకపోతే -

గో ్ర రె ల కా ప రి

మీకు సమాధానం చెబితే, నా పై ప్రాణాలు పైనేపోతాయి.

ఈ డి ప స్

చూద్దాం . . .
(భటులతో)
ఇంకా చూస్తారేం ?

గో ్ర రె ల కా ప రి

ఇంకా ఏం చేస్తారు ? చెప్పానుగదా : పసివాణ్ణి అతనికిచ్చానని -

ఈ డి ప స్

ఆ పసివాడు నీకెలా దొరికాడు ?
నీ పిల్లాడా ? . . . నీ కెవరైనా ఇచ్చారా ?

ఈ డి ప స్

నా పిల్లాడు కాదు . . . ఎవరో ఇచ్చారు.

గో ్ర రె ల కా ప రి

ఎవరు ? ఈ థీబ్స్ ప్రజల్లో ఎవరన్నానా ?

గో ్ర రె ల కా ప రి

భగవాన్ : . . . మహాప్రభూ : ఇంకేం అడక్కండి . . .
నేను చెప్పలేను.

ఈ డి ప స్

చెప్పని మరుక్షణం నీ ప్రాణాలమీద ఆశ వదులుకో . . .

**గొర్రెల కాపరి**

(భయంగా)

ఆ కుర్రాడు అంతఃపురంలో పుట్టాడు.

**ఈడిపస్**

ఎవరికి పుట్టాడు? అంతఃపుర సేవకులకా? లేక రాజవంశంలో పుట్టాడా?

**గొర్రెల కాపరి**

ఆ భయంకరమైన సత్యాన్ని చెప్పక తప్పదా ప్రభూ ?

**ఈడిపస్**

నువ్వు చెప్పకా తప్పదు, నేను వినకా తప్పదు.
చెప్పు.

**గొర్రెల కాపరి**

లయస్ మహారాజు కొడుకేనని నాకు చెప్పారు.
కాని నా కంటె ఆ అంతఃపురంలో ఉన్న మహారాణికే
ఈ విషయం ఎక్కువగా తెలుసు –

**ఈడిపస్**

ఆవిడ ఇచ్చిందా నీకు ?

**గొర్రెల కాపరి**

ఆ...అవును...మహారాజా !

**ఈడిపస్**

ఎందుకు ?

**గొర్రెల కాపరి**

చంపి పారేయడానికి.

**ఈడిపస్**

తన కొడుకునే ?

గొర్రెల కాపరి

దైవవాణి చెప్పిన భయంకరమైన నిజాలకి భయపడి-

ఈపడిస్

ఏమిటవి ?

గొర్రెల కాపరి

ఆ పుట్టినవాడు తల్లిదండ్రుల్ని చంపుతాడని -

ఈడిపస్

అయితే ఆ పసివాణ్ణి అతని కెందుకిచ్చావు ?

గొర్రెల కాపరి

చంపబుద్ధి కాలేదు ప్రభూ ! పసికూన...జాలిపడ్డాను...
మరో దేశం ఎక్కడికో పోయి పెరిగితే...ఈ శాపం
నిజం కాదనుకున్నాను...ఇతను చెప్పినట్టు నువ్వే
ఆ బాబువయితే, నీకన్న దురదృష్టవంతుడు లేడు.

ఈడిపస్

అనుకున్నంతా అయ్యింది...
ఇందులో ఉన్న వెలుగును చూడాలనుకున్నాను కదూ !
ఇదే ఆఖరుసారి వెలుగును చూడడం...
భగవాన్ ! ఇదుగో ఈడిపస్ !
నీముందు తలవంచుకు నిలబడ్డాడు -
పుట్టిన పుట్టుకలో, చేసుకున్న వివాహంలో, పితృ హత్యలో
అన్ని విధాలా...అన్ని విధాలా శాపగ్రస్తుడు.

( వార్తాహరుడు, గొర్రెల కాపరి వెళ్ళిపోతారు. )

బృందగానం

తరతరాల మానవులారా !
మళ్ళీ మళ్ళీ జన్మించిన

మీ జీవితాల నన్నిటినీ కూడితే
ఏమొస్తుందో తెలుసా ?
( అందరూ )
సున్నా.

**బృందనాయకుడు**

దానికర్థమేమిటో తెలుసా ?
( అందరూ )
శూన్యం.

**బృందనాయకుడు**

చూశారా ! జీవితానికి అర్థం–
శూన్యం.
మానవుడి ఆనందం క్షణభంగురం
మానవుడి జీవితం క్షణభంగురం
ఈడిపస్ !
నీ తిరుగులేని జీవితమూ, ఎదురులేని మేధా
చివరకు విధి నీకిచ్చిన శిక్ష –
వీటన్నిటినీ చూస్తుంటే అనిపిస్తుంది
మనిషికి ఆనందం లేదు అని.
తోటివారికందరికీ మిన్నగా ఉన్నవాడు
అధికారాన్నీ, ఆనందాన్ని అందిపుచ్చుకున్నవాడు.
స్ఫింక్స్‌ను కడతేర్చాడు
రాజ్యరమను వరించాడు
థీబ్స్ నగరానికి
తిరుగులేని రాజైనాడు.

మరి ఇప్పుడు ?
అతనికన్న దయనీయుడు లేడు.

పరితప్త హృదయంతో
పరాభవ శోకంతో
కొట్టుకుపోతున్నాడు.
ఏదీ పూర్వపు టౌన్నత్యం?
ఈనాటికీ దానికి ఎంతటి వ్యత్యాసం ?
వీటన్నిటినీ చూస్తుంటే అనిపిస్తుంది-
మనిషికి ఈ జగతిలో ఆనందం లేదు-అని.
ఈడిపస్ !
"కాలం" నీ సంగతి కనుక్కుంది
మాతృమూర్తిని ప్రేమమూర్తిగా చేసుకున్న
నీ అపవిత్రతని కాలమే శిక్షిస్తుంది.

అది ఇప్పుడే మొదలైంది.
ఈడిపస్ ! ఇది నీ జీవితానికి చరమగీతం.
నీ జీవితానికి చరమగీతం.
నువు మా జీవితాలలోకి రాకుండావుంటే
ఎంత బావుండేది?
నిన్న-మా జీవితాల్లో వెలుగులు నింపిన తేజోమూర్తివి.
నేడు-మా నిరంతర హృదంతర అంధకార ప్రతినిధివి.
ఈడిపస్ !
ఇది నీ చరమగీతం !

**అంతఃపుర వార్తాహరుడు**

థీబ్స్ పౌరులందరికి ముఖ్యమైన వార్త.
మీరంతా పెద్దలు, ఈ భయంకరమైన విషయాలని
ఎలా భరిస్తారో ! రాజకుటుంబంలో జరిగిన
దుర్ఘటనలు వర్ణనాతీతాలు. ఈ కుటుంబంలో

జరిగిన పాపపంకిలాన్ని ఇస్తర్, ఫాసిస్ నదుల
జలాలు కూడా క్షాళనం చెయ్యలేవు.
ఈ దుర్ఘటనలన్నీ అకస్మాత్తుగా జరిగినవి కావు
కావాలని తెచ్చిపెట్టుకున్నవి.

**బృందనాయకుడు**

ఇంతవరకు తెలిసిన విషయాలే మా మనసుల్ని
కలిచివేస్తున్నాయి: ఇంకా భయంకరమైనవా? ఏమిటవి?

**అంతఃపుర వార్తాహరుడు**

ఒక విషాదవార్త. జొకాస్టా రాణి మరణించింది.

**బృందనాయకుడు**

అయ్యో! ఎలా?

**అంతఃపుర వార్తాహరుడు**

తన ప్రాణాల్ని తానే తీసుకున్నది. మీరు
ఆ దృశ్యం చూడలేదు-అదృష్టవంతులు.
నేను ఆసాంతమూ ఆ సంఘటనలు చూశాను.
కనక-చూసింది చూసినట్టుగా మీకు మనవి చేస్తాను.
జొకాస్టారాణి ఎంతో ఉద్వేగంతో లోపలికి
వచ్చింది. జుట్టు పీక్కుంటూ, పెద్దపెట్టున ఏడుస్తూ
గబగబా ఆమె గదిలోకి వెళ్లి, లోపల
తలుపులు వేసుకుంది. లయస్‌ని తలుచుకుంది.
అతనివల్ల తనకు పుట్టిన పిల్లల్ని తలుచుకుంది.
తన దురదృష్టాన్ని తలుచుకుంది-రెండు తరాల
పిల్లల్ని కన్న తన విధిని నిందించుకుంది. తన భర్తవల్ల
భర్తనూ, తన కుమారునివల్ల పిల్లలనీ పొందిన
తన పాపానికి రోదించింది.
కాని- ఆమె ఎలా మరణించిందో మాత్రం

నాకు తెలియదు.
అప్పుడే ఈడిపస్ వచ్చాడు-పరుగు పరుగున వచ్చాడు.
అరుస్తూ మాతో ఒకరి దగ్గరనుంచి
మరొకరి దగ్గరకు పోతూ, ప్రతివారినీ-మీరు జొకాస్టాను
చూశారా అని అడిగాడు. నాకొక కత్తినివ్వండి
అంటూ ఆక్రోశించాడు.

ఎవరో-విధే అయివుండాలి-జొకాస్టా ఎక్కడవుందో అతనికి చెప్పారు.

ఆమె గది వంకకి పరిగెత్తాడు. తలుపులు
వేసివున్నాయి. బలవంతాన పగలకొట్టాడు.
అక్కడ జొకాస్టాను చూశాడు-ఆ గదిలో
దూలానికి ఉరిపోసుకున్న జొకాస్టాను.
ఆమెనలా చూడగానే ఈడిపస్ పెద్దపెట్టున
ఆక్రందన చేశాడు. గబగబా ఆమె దగ్గరకు
పోయి ఆమె మెడచుట్టూ వున్న తాడును తొలగించాడు.
ఆమె అక్కడ నేలమీద పడుకొనివుండగా-
అప్పుడు చూశాం మేము - అంతకన్న భయంకర
మైన దృశ్యాన్ని - ఆమె దుస్తులకున్న
బంగారు ఆభరణాన్ని తీసుకొని దానితో
తన కనుపావల్ని ఊడబెరుక్కున్నాడు.
"నేను అనుభవిస్తున్న ఈ దారుణమైన
అనుభవాలను నువ్వు చూడకు. ఎప్పటికీ
చీకటిగానే వుండిపోనీ" అంటూ ఆ ఆభరణంతో
తన కళ్ళను మళ్ళీ మళ్ళీ పొడుచుకున్నాడు.
పొడుచుకున్న ప్రతిసారీ ఉవ్వెత్తుగా చిందిన
రక్తం అతని కళ్ళనుంచీ ధారాపాతంగా కారింది.
ఇవీ జరిగిన విపరీతాలు.

ఒకప్పుడు ఆనందానికీ, అధికారానికీ ప్రతినిధులిద్దరూ -
ఇవ్వాళ ప్రపంచంలో ఉన్న వైపరీత్యాలన్నింటికీ
వారసులైనారు.

బృం ద నా య కు డు

పాపం!
పోనీ ఈడిపస్ ఎట్లావున్నాడు?
ఇప్పటికైనా బాధలనుంచి విముక్తుడైనాడా?

అం తః పు ర వా ర్తా హ రు డు

లేదు. బిగ్గరగా ఏడుస్తున్నాడు.
"ఈ ప్రాసాదం తలుపులు తెరవండి. నన్ను నా థీబ్స్
ప్రజల ముందుకు తీసుకుపోండి... కన్న తండ్రి హంతకుణ్ణి.
కన్న తల్లికే——" అబ్బ! మనం ఊహించను కూడా
లేని మాటలతో తన్ను తాను నిందించుకుంటున్నాడు.
థీబ్స్ నుంచి వెళ్ళిపోవాలని, తనను
తానే బహిష్కరించుకుంటున్నానని అంటున్నాడు.
తన శాసనాన్ని తానే అమలు పరుస్తానంటున్నాడు...

భరించలేనంత బాధ పడుతున్నాడు.
తాను మీ ముందుకు తప్పకుండా వస్తాడు...

( లోపల నుంచి "భగవాన్" అన్న పెద్ద కేక )

అదుగో! ప్రాసాదం తలుపులు తెరుచుకుంటున్నాయి!!
చూడండి! అదృశ్యం చూడండి! పగవాళ్ళక్కూడా ఇటువంటి
స్థితి రాకూడదనిపించే భయంకర దృశ్యం!!

( ఈడిపస్ వస్తాడు .. ఇప్పుడు గుడ్డివాడు )

బృం ద గా నం

( అందరూ )

ఘోరమైన ఈ వికారరూపం
భరించలేము... భయంకరం... భయంకరం

ఏ వికృత సంక్షోభం
ఏ విచలిత ఉద్వేగం
పెనుగొన్నది జీవిత రమ్యం...
విధివశం...విధివశం...విధివశం...

**బృందనాయకుడు**

ఈడిపస్! నిన్ను చూస్తే జాలివేస్తోంది.
చాలా ప్రశ్నలు అడగాలి నిన్ను; చాలా విషయాలు
తెలుసుకోవాలి నేను.
నా చూపులు నీవైపుకు లాగుతున్నాయి
కాని...కాని...చూడలేని నీ చూపుల్ని భరించలేను.
నిన్ను చూస్తుంటే నేనాపాదమస్తకం కంపించిపోతున్నాను.

**ఈడిపస్**

నేనెక్కడున్నాను?...ఈ గాలిలో తేలి
నాకు వినిపిస్తున్నది నా గొంతేనా?
ఓ విధీ! నన్నెంతకు దిగజార్చావు!

**బృందనాయకుడు**

మనుషులు చూసి, విని భరించలేనంతకు!

**ఈడిపస్**

చీకటి!... నా చుట్టూ దట్టంగా అలుముకున్న చీకటి!
మబ్బులు!... చెప్పలేనంత చీకటి... భరించలేనంత
అంధకారం!... ఒళ్ళంతా ఈటెలతో పొడుస్తున్న
బాధ!... మనసంతా — జ్ఞాపకాల
రంపపు కోత!

**బృందనాయకుడు**

మనసూ, శరీరమూ పడుతున్న ఈ
యాతనలో నీ వ్యధ ద్విగుణీకృతం కావడంలో ఆశ్చర్యం లేదు –

**ఈ డి ప స్**

తమ్ముడా ! ఇంకా నా పక్కనే ఉన్నావా, ఒక్కడివీ !
ఈ గుడ్డివాడికి దారి చూపిస్తావా ! నువ్విక్కడున్నావు,
నాకు తెలుసు !
ఇంత చిమ్మ చీకటిలోనూ నీ గొంతును గుర్తించగలను.

**బృ ం ద నా య కు డు**

ఎంతటి దారుణమైన పని చేశావు ! నీ కళ్ళలోని వెలుగుని
నీకు నీవై దూరం చేసుకున్నావా ? ఎందుకు ?
ఎందుకు చేశావీపని ?

**ఈ డి ప స్**

నా బాధలకు పరాకాష్టగా...ఇది అపోల్లో ఆజ్ఞ...
కాని...కాని...ఇది నాకై నేను చేసుకున్న నిర్ణయం...
నా చేతులారా చేసుకున్నది...
నాకీ కళ్ళుండి ప్రయోజనమేమిటి ?
కనిపించేదేదీ నాకానందాన్నివ్వదు.

**బృ ం ద నా య కు డు**

నిజమే !

**ఈ డి ప స్**

కళ్ళారా చూడ్డానికి, నోరారా మాట్లాడ్డానికి,
మనసారా ప్రేమించడానికి నాకింకేం మిగిలింది ?
సంతోషకరమైన దాన్నంటూ ఇకనేనేం చూడగలను?
నన్నిక్కణ్ణించి తీసుకుపొండి... తొందరగా
దేశం అవతలకి... సుదూర ప్రాంతాలకి...
తీసుకుపొండి...
జీవిత సమరంలో ఓడిపోయినవాణ్ణి...శాపగ్రస్థుణ్ణి.

**బృందనాయకుడు**

నీ దురదృష్టాన్ని చూస్తే నాకు జాలి కలుగుతోంది
ఆ దురదృష్టాన్నర్థం చేసుకున్న నువ్వంటే నాకింకా జాలి...
నిన్ను నేను ఎరిగి వుండకపోతే ఎంత బావుండేది?

**ఈడిపస్**

సితరాన్ కొండలమీద, శీతల శృంఖలాలతో బిగించబడ్డ నా పాదాలని
వెలికి తీసి, నన్ను రక్షించిన ఆ మనిషిని
దైవం క్షమించకూడదు. నా బంధ విముక్తికి అతనికి
కృతజ్ఞతలు చెప్పను. అప్పుడే అక్కడే
నేను మరణిస్తే ఎంత బావుండేది? కాని, ఇప్పుడు...
నాకూ, నన్ను ప్రేమించేవాళ్ళకీ కూడా మనస్తాపం
కలిగించినవాణ్ణయ్యాను.

**బృందనాయకుడు**

అవును. ఇప్పుడు నిన్ను చూస్తుంటే ఆనాడలా జరిగితేనే
బావుండేదనిపిస్తున్నది.

**ఈడిపస్**

అలా జరిగుంటే – నా తండ్రి హంతకుడిగా, నా తల్లికే భర్తగా–
ఇవాళ ఇందరిముందు శిక్షార్హుడిగా నిలబడి వుండేవాణ్ణి కాదు.
ఇప్పుడు: దేవతలచేత విసర్జితుణ్ణి....
పుట్టుకలో, బ్రతుకులో....
ఏ మనిషీ అనుభవించకూడని నికృష్టాతినికృష్టమైన జీవితం
ఈడిపస్‌కు లభించింది –

**బృందనాయకుడు**

నువ్వు చేసిన ఈ పని నాకెందుకో నచ్చలేదు. అంధుడవై
అలమటించడంకన్న చనిపోవడం మేలు కదా!

ఈ డి ప స్

ఆలోచనలూ, సలహాలూ ఇక వద్దు.... ఇదే నాకు తగిన శిక్ష!
మృత్యుదేవత ఒడిలో చేరిన నా తండ్రిని
ఏ కళ్ళతో చూడగలను? నా తల్లిని – ?
నా తల్లిదండ్రులిద్దరి యెడ
నేను చేసిన అపరాధానికి ఉరిపోసుకు మరణించడం
చాలా చిన్న శిక్ష!
నా పిల్లల కళ్ళలోకి ధైర్యంగా చూడగలనా?
లేదు! ఈ కళ్ళతో ఆ పని చేయలేను! .... ఈ కళ్ళతో
తిరిగి నా నగరాన్ని, ఈ నగరంలో నాకు నివాళులెత్తిన
వీధుల్ని, పవిత్ర దేవాలయాల్ని చూడగలనా? వీటన్నిటినుంచీ
విముక్తుణ్ణి కావడానికే ఈ శిక్ష!
రాజ్యాన్ని అపవిత్రం చేసిన ఆ మనిషిని–ఆ లయస్ హంతకుణ్ణి–
దేశ భ్రష్టుణ్ణీ, సంఘదూరుణ్ణీ చెయ్యాలన్నది
నేను చేసిన శాసనమే!
నా నేరాన్ని నేనే పరిశోధించి
వెలికి తీసినప్పుడు–
ఆ నేరం చేసిన నేను ఈ పౌరుల కళ్ళల్లోకి
సూటిగా చూడగలనా?
లేదు. లేదు...నా చెవులు వినిపించకుండా చేసే మార్గం ఉంటే–
అది కూడా చేసేవాణ్ణి! ఈ పాప పంకిలమైన
శరీరాన్ని ఏకాంతంలో బంధించేవాణ్ణి–నయన
శ్రవణేంద్రియాలను ఛేదించుకుని–
ఓ తండ్రీ, పోలిబస్!
ఇన్నాళ్ళూ నా పితృదేవులనుకున్న కొరింత్ రాజవంశమా!
ఎటువంటి వారసుణ్ణి కడుపులో పెట్టుకొని పెంచారు!

ఎటువంటి వివాహబంధం !
తండ్రీ-సోదరుడూ-కొడుకూ
మాతృమూర్తి-భార్య-
ప్రతి మనిషీ సిగ్గుపడే బంధం !
ఉన్నతంగా బ్రతికి నికృష్టంగా చావాలన్నది
విధి నిర్ణయం -
థీబ్స్‌నుంచి నన్ను వెలివెయ్యండి
చంపండి
సముద్రంలో తొయ్యండి
మళ్ళీ ఈ దుష్టుడి ముఖాన్ని
చూడకుండా ఏమైనా చేయండి.
ఒక్కసారి నా దగ్గరికి రండి...
నన్నిక్కడినుంచి తీసుకుపొండి.
ఆ ! భయపడకండి...నన్ను తాకి అపవిత్రమైతే
ఆ పాపం నాదే...రండి...

**బృందనాయకుడు**

అడుగో క్రియాన్ వస్తున్నాడు ! నీ కోరికను అతడు మన్నిస్తాడు.
ఇప్పుడు థీబ్స్ రాజ్యాధికారాన్ని స్వీకరించాడు కనక
నిర్ణయాలు అతనివే !

**ఈడిపస్**

అతనికేమని చెప్పుకొనేది? వెనక నేనతనిమీద
మోపిన నేరాలన్నీ అసత్యాలని ఋజువయింది...

**క్రియాన్**

ఈడిపస్ !
నిన్ను అపహాస్యం చేయడానికి రాలేదు
నువ్వు చేసిన తప్పులకు నిన్ను దండించడానికీ రాలేదు !

( ప్రక్కనున్న భటులతో )
చూస్తూ నిలబడ్డారేం ?
ఇందరిముందూ
ఇలా ఆయన్ని వదిలేశారేం ? భయంకరమైన యీయన
పాపాన్ని బట్టబయలు చేశారేం? అంతఃపురంలోకి తీసుకుపొండి...
ఈ అపఖ్యాతి రాజవంశానిది ; ఆ కుటుంబానికే
పరిమితం కానివ్వండి.

( భటులు వస్తారు. ఈడిపస్‌కు రెండు వైపులా నిలబడతారు .... )

ఈ డి ప స్

క్రియాన్ ; నువ్వింత దయార్ద్ర హృదయుడివని నేననుకోలేదు...
ఒక్క కోరిక కోరనా ? ... నాకోసం కాదు, నీకోసం——

క్రి యా న్

ఏమిటది ?

ఈ డి ప స్

నన్ను తొందరగా యీ దేశం నుంచి బహిష్కరించు...
నేనెవరికీ కనిపించని నిర్జనారణ్యాలకు పంపు —

క్రి యా న్

అపోల్లో ఎలా చెబితే అలా చేస్తాను.

ఈ డి ప స్

ఈ పితృ హంతకుణ్ణి అపోల్లో సైరిస్తాడా ?
వట్టిది. ఆ ప్రభువు ఆదేశాలు విస్పష్టం.

క్రి యా న్

అపోల్లో ఆదేశాలు విస్పష్టమయితే
ఈసారి అవి వెంటనే అమలు జరపబడతాయి.

ఈ డి ప స్

మంచిది ... ఇక: నేనాజ్ఞాపిస్తున్నాను ... కాదు, కాదు.
ప్రార్థిస్తున్నాను ... అంతఃపురంలో పడివున్న
ఆమె అంత్యక్రియలు చూడు. ఆమె నీ సోదరి ...
అవి నిర్వర్తించవలసినవాడివి నువ్వే ...
నన్ను ... నా పితృ పితామహుల దేశంలో ఉండనివ్వకు ...
సితరాన్ కొండల్లోనే ఉండనీ.
నా తల్లీ తండ్రీ —
వాళ్ళు బ్రతికుండగా ఆ కొండలనే నా మరుభూమిగా నిశ్చయం
చేశారు ...
వాళ్ళు నిశ్చయించిన చోటనే నన్ను మరణించనీ –
నేను మృతప్రాయుణ్ణి. నా సంగతి పట్టించుకోకు.
నా పిల్లల సంగతి మాత్రం చూడు.
మగ పిల్లలు – వాళ్ళ బ్రతుకు వాళ్ళు బ్రతుకుతారు.
కాని నిస్సహాయులైన నా ఆడపిల్లలిద్దిరూ – నిరంతరం
నా ప్రక్కనే వుండి నా జీవితానికింతవరకూ
ఊరట కలిగించినవాళ్ళు
వాళ్ళని – నాకోసం – కనిపెట్టుకొని వుండు.
ఒక్క కోరిక ... వారినొక్కసారి దగ్గరకు తీసుకోనీ.
ఆ స్పర్శల జ్ఞాపకాలతో శేషజీవితం గడపనీ.

( **ఆంటిగొనె, ఇస్మీన్-ఇద్దరూ వస్తారు.** )

ఏమిటది ? నాకేదో శబ్దం వినిపిస్తున్నది ?
ఆ ఏడుస్తున్నది నా బంగారు తల్లులేనా ?
దయార్ద్ర హృదయంతో క్రియాన్ పంపించింది నా చిట్టితల్లులనేనా ?

**క్రి యా న్**

అవును.... నీకు నీ కుమార్తెలంటే వున్న అనుబంధం
నాకు తెలుసు. అందుకే వాళ్ళని పిలిపించాను.

ఈ డి ప స్

ఇందుకోసమన్నా భగవంతుడు నిన్ను రక్షిస్తాడు!
అమ్మా! ఎక్కడ?.... దగ్గరగా రండమ్మా!
నా చేతుల్లోకి రండి.... మీ అన్న చేతుల్లోకి!
ఒకప్పుడు వెలుగుల వెల్లువలైన మీ నాన్న కళ్ళకు
బలవంతంగా చీకట్లు చిందించిన ఈ చేతుల్లోకి రండమ్మా, రండి....
... అమ్మా! క్రూరమైన ఈ ప్రపంచంలో
దుర్భరం కాబోతూన్న
మీ జీవితాల్ని తలుచుకుంటే నాకు దుఃఖం ఆగడం లేదు.
అమ్మా! మీ తండ్రిని గురించి చెప్పుకొనే కథల కట్టడికి
మిమ్మల్నెవరు పెళ్ళి చేసుకుంటారు?
"తండ్రిని చంపినవాడు, తల్లిని పెళ్ళాడినవాడు
మీ నాన్న" అని మిమ్మల్ని నలుగురూ ఆడిపోసుకుంటారు.
ఈ బాధల వరాలు మీకు ఆస్తిగా ఇచ్చిపోతున్నానమ్మా!
నన్ను క్షమిస్తారు కదూ!
క్రియాన్! ఇకనుంచీ నువ్వే వాళ్ళకు తండ్రివి. తల్లివి.
నీకు రక్తబంధువులు-వాళ్ళని నిరాశ్రయుల్ని కానివ్వకు.
అమ్మా! ఇంకా కొంచెం పెద్దవాళ్ళయి వుంటే
మీ కిట్లా చెయ్యాలమ్మా అని సలహా చెప్పేవాణ్ణి.
ఇప్పుడైనా మీరు భగవంతుణ్ణి ఏమని ప్రార్థించాలో చెబుతాను.
మిమ్మల్ని బ్రతకనిచ్చే దేశాన్ని చూపమని ప్రార్థించండి.
మీ నాన్న కన్న మెరుగైన బ్రతుకనివ్వమని ప్రార్థించండి.

క్రి యా న్

విలపించింది చాలు, ఈడిపస్. రాజప్రాసాదంలోకి పద.

ఈ డి ప స్

అది నాకానందాన్నివ్వదు. అయినా నీ ఆజ్ఞను
శిరసావహించక తప్పదు.... అయినా
ఒక్క షరతు -

క్రి యా న్

ఏమిటది ?

ఈ డి ప స్

నన్ను థీబ్స్ నుంచి దూరంగా పంపిస్తానని మాట ఇవ్వు –
దేశ బహిష్కారం – అదే నేను కోరేది.

క్రి యా న్

అపోల్లో ఆదేశాలు రానీ. అలానే చేస్తాను.

ఈ డి ప స్

నిజంగా చేస్తావా ?

క్రి యా న్

చెయ్యదలచుకోనిది చెప్పడం నా కలవాటు లేదు.

ఈ డి ప స్

అయితే వెంటనే ఇక్కడ నుంచి తీసుకుపో.

క్రి యా న్

పద.... పిల్లల్ని వదిలెయ్....

ఈ డి ప స్

వద్దు.... వద్దు.... నా నుంచి వాళ్ళను దూరం చేయకు.

క్రి యా న్

ఇంకా ఆధిపత్యం నీదేనని భ్రమపడకు.
నువ్వొకప్పుడు గెలుచుకున్న సిరి నీతో కలకాలం
ఉండాలని లేదు... పద....

బృం ద గా న ం

థీబ్స్ ప్రజలారా !
ఇతని వంక చూడండి —
కష్టతరమైన చిక్కు ప్రశ్నల్ని విప్పి

విపత్తులో ఉన్న దేశాన్ని రక్షించాడు.
తనకన్న గొప్పవాడు తన దేశంలోనే లేడనిపించాడు.
అతని అదృష్టాన్ని చూసి జనం అసూయ చెందారు.
ఇప్పుడో! భయంకరమైన కష్టాల కడలిలో మునిగిపోతున్నాడు.

అందుకే —
ఆనందం ఎండమావి
సంతోషం శాపం
ఏ మనిషీ ఆనందమయుడు కాడు
జీవితం చివరిక్షణం దాకా
తుది నిష్క్రమణం దాకా.



## అనుబంధం 1

# "ఈడిపస్" ఇతివృత్త నిర్మాణం

ప్రతి గ్రీకు నాటకాన్ని ఆరు భాగాలుగా విభజిస్తారు. ఈ విభజన "ఈడిపస్" నాటకంలో ఏ విధంగా ఉంటుందో చూద్దాం.

1. పూర్వరంగం (**Prologue** - పంక్తులు 1-178): ఈడిపస్ ఆర్తులైన ప్రజలకు లయస్ హంతకుణ్ణి వెతికి పట్టుకుంటానని మాటయిస్తాడు. థీబ్స్ ప్రజలు అతనిని భగవంతుని తరువాత అంతగా ఎన్నదగిన నాయకునిగా ప్రశంసిస్తారు.

   పారడాస్ (**Parados** - బృంద గాయకుల ప్రవేశ గానం-179-230): బృంద గాయకులు థీబ్స్ దుస్థితికి విలపించి దేవుళ్ళందరి సాయమూ కోరతారు. థీబ్స్ ప్రజలలోని 15 మంది వృద్ధులతో కూర్చబడినది బృందగానం (**Chorus**).

2. మొదటి సన్నివేశం (**First episode** - 231-541) ఈడిపస్ లయస్ హంతకుణ్ణి శపిస్తాడు. టైరీషియస్ - ఈడిపస్‌ల వాగ్యుద్ధం.

   మొదటి బృందగానం (**First Stasimon** - 542 - 594) స్టాసిమాన్ అంటే సంభాషణల అడ్డంకులు లేకుండా బృంద గాయకులు చేసే బృందగానం.

   ఈ మొదటి బృందగానంలో హంతకుడు మరణించక తప్పదన్న విశ్వాసం; టైరీషియస్ మాటలను నమ్మి ఈడిపస్‌ను దోషిగా నిర్ణయించలేము అని బృందం చేసే భావ ప్రకటన.

3. రెండో సన్నివేశం (**Second episode** - 594 - 983): క్రియాన్ కోప ప్రకటన; ఈడిపస్ క్రియాన్‌ల వాగ్వివాదం. జొకాస్టా ఇద్దరినీ అనునయించడం; జొకాస్టా కోరిక మీద ఈడిపస్ తన పాత జీవితాన్ని వివరించడం.

రెండో స్టాసిమాన్ (984 - 1024) : ఈడిపస్ క్రియాన్‌పై చూపిన నిర్దయను, అధికార మదాంధతని, జొకాస్టా దేవుళ్ళ మీద, దైవవాణి పలుకుల మీద చూపిన నిరాదరణని నిరసిస్తుంది బృందగానం.

4. మూడో సన్నివేశం (1025 - 1208) : కొరింత్ నుంచి వచ్చిన వార్తాహరుడు పోలిబస్ మరణాన్ని గురించి, ఈడిపస్ పోలిబస్ కొడుకు కాదన్న సంగతినీ చెబుతాడు. గొర్రెల కాపరిని వెంటనే పిలిపించమని ఈడిపస్ ఆజ్ఞాపిస్తాడు.

మూడో స్టాసిమాన్ (1209 - 1227): ఈడిపస్ పరాయి దేశం వాడు కాడు. ఈ దేశంవాడేనేమోనని ఆశపడుతుంది బృందం. బహుశః ఏ దేవుడి పుత్రుడోనన్న ఊహకు రూపకల్పన.

5. నాలుగో సన్నివేశం (1228 - 1335): గొర్రెల కాపరి వస్తాడు. నిజం వెల్లడి అవుతుంది. జొకాస్టా రాణి పరిగెత్తుకొని అంతఃపురంలోకి వెళ్ళి పోతుంది.

నాలుగో స్టాసిమాన్ (1336 - 1379) ఈడిపస్ స్థితికి బృంద గాయకుల మనస్తాపం.

6. ఉత్తరరంగం (Exodus - 1380 - 1650) : అంతఃపుర వార్తా హరుడు అంతఃపురంలో జరిగిన దుర్వార్తలను ప్రజలకు చెపుతాడు. అంధుడైన ఈడిపస్ ప్రజల ముందుకు వస్తాడు. తనను దేశం నుంచి బహిష్కరించవలసిందిగా క్రియాన్‌ని కోరతాడు. కూతుళ్ళను దగ్గరకు తీసుకుని విలపిస్తాడు.

చివరగా బృందగానం చెప్పిన మాటలు తరువాత రచయిత లెవరో చేర్చి వుంటారని ఊహ.

## అనుబంధం 2

# గ్రీకు నాటక ప్రదర్శనలో వాచిక విధానం

ఈ విషయాన్ని గురించి సమగ్రమైన విషయసేకరణ ఇంకా జరగలేదు. అక్కడక్కడ కనిపించిన వేరువేరు విషయాలను ఇక్కడ క్రోడీకరిస్తున్నాను.

గ్రీకు నాటక ప్రదర్శనలో వాచికం మౌలికంగా రెండు పద్ధతుల్లో ఉండేది. ఒకటి నటుల సంభాషణలు. రెండోది బృందగాయకుల బృందగానం.

నటుల సంభాషణలు సాధారణంగా ఇయాంబిక్ (iambic) ఛందస్సులో ఉంటాయి. సుదీర్ఘమైన సంభాషణలలోను (రేసిస్-Rhesis), లేదా మామూలు సంక్షిప్తంగా ఉండే సంభాషణలలోను (ముఖ్యంగా ఒక పంక్తిలో ఉండేవి - స్టికొమిథియా - Sticho-mythia-అంటారు) ఇయాంబిక్ ఛందస్సే వాడేవారు. పాటలు పాడేటప్పుడు ట్రొకేయిక్ (Trochaic) ఛందస్సులోను, మంత్రాల్లా గానం (ముఖ్యంగా దేవుళ్లను ఆవాహన చేస్తూ పాడేది - Chanting) చేసేటప్పుడు ఇంకా ఛందోబద్ధంగా ఉండే అనపెస్టిక్ (Anapaestic) ఛందస్సును వాడేవారు. గీతికలు ఒక్కరు పాడినా (మోనడీ - Monody) లేదా కోరస్‌తో సంభాషించేటప్పుడు పాడినా (Lyric dialogue) లైర్ సహకారం ఉన్నప్పుడు వాడే ఛందస్సులను వాడేవారు.

ఇక బృందగానం. అదిసామూహికగానం. అందులో రెండు భాగాలుగా ఈ గానాన్ని విరుస్తారు. ఒకదానిని Strophe అనీ, రెండోదానిని Antistrophe అని అంటారు ఈ రెండూ బృందగాయకులు ఆర్కెస్ట్రా (వర్తులాకార రంగస్థలం) మీద కుడి నుంచి ఎడమకి, ఎడమ నుంచి కుడికి నృత్యంచేస్తూ పాడేవాళ్ళని ప్రతీతి. ఒక్కొక్కప్పుడు దేవతలని ఆవాహనచేస్తూ పాడే పాటలుంటాయి. అవి అనపెస్ట్ ఛందస్సులో ఉంటాయి. బృందగాన నాయకుడు (కొరిఫయాస్) మిగిలిన పాత్రలతో సంభాషణ జరిపేటప్పుడు లైర్ సహకారం వున్నప్పుడు వాడే ప్రత్యేక ఛందస్సులను వాడతాడు.

# రాజా ఈడిపస్

## వివరణాలు

నాటకంలో
పంక్తి వివరాలు

1. **కాడ్మస్ (Cadmus) వంశస్థులు:-** థీబ్స్‌నగరాన్ని కట్టించినవాడు కాడ్మస్. అందువల్ల థీబ్స్ ప్రజలంతా అతని వంశస్థులు.

4. **కొమ్మలూ, కొమ్మల చివర కట్టిన ఊలుహారాలు.... :-** పూజారులు, తదితర థీబ్స్ ప్రజలూ నగరంలో జరిగే బీభత్సాలకు తట్టుకోలేక థీబ్స్‌లోని అన్ని దేవాలయల్లోను పూజలు చేస్తున్నారు ఆర్తులైనవారు కోరికలు నెరవేరడానికి, ఒక చేత్తో - చివరలకు ఊలుచుట్టిన లారెల్, ఆలివ్ కొమ్మల్ని పట్టుకొని, మరొకచేత్తో ధూపం పట్టుకొని ఆలయంలోని దేవతామూర్తి ముందు ఉంచుతారు. తమ అభీష్టం నెరవేరితే కాని ఆ కొమ్మలను అక్కడ నుంచి తీయరు. కాని ఈడిపస్ ఆజ్ఞమేరకు ఆ కొమ్మల్ని తీస్తారు. అంటే - ఈడిపస్‌ను ప్రజలంతా దైవాంశ సంభూతుడని అనుకొన్నట్లు కనిపిస్తుంది. (చూ.పం. 39-44)

12. **విశ్వవిఖ్యాతుణ్ణి :-** ఈ మాటల్లో ఈడిపస్ గర్వం కనిపిస్తోందనీ, ఇది అతడి శీలలోపం (**tragic flaw**) అనీ, అతడి పతనానికి ఇది కూడా ఒక కారణమనీ కొందరు విమర్శకుల మతం.

26. **ఆర్టెమిస్ (Artemis) :-** ఆర్టెమిస్, అపోల్లోలు ఇద్దరూ జియస్, లిటోల కవల పిల్లలు. ఆమెను డయానా, సింథియా అని కూడా పిలుస్తారు. 'వేట' దేవత. అపోల్లోని సూర్యుడుగాను, ఆర్టెమిస్‌ను చంద్రుడుగాను భావిస్తాయి గ్రీకు పురాణ గాథలు.

28. **అపోల్లో (Apollo) :-** (చూడండి పై వివరణ) గ్రీకు పురాణ గాథల్లో అపోల్లోకు చాలా పలుకుబడి వుంది. గ్రీకు-కావ్యాల్లో అతడు అందగాడుగాను, లైర్‌మీద పాటలుపాడే గొప్ప సంగీత విద్వాంసుడిగాను, గొప్ప విలుకాడుగాను, వైద్య శాస్త్రానికి అధినేతగాను, వీటన్నింటి

కన్న ఎక్కువగా వెలుగు దేవుడు (God of Light) గాను, అందు వల్ల సత్యానికి అధినాయకుడి (God of Truth) గాను కీర్తించ బడ్డాడు. అందువల్లనే అతడి ఆలయం వున్న డెల్ఫీ నుంచి వచ్చిన దైవవాణి పలుకులు యదార్థాలు కాక తప్పదని పురాణకాలంలో గ్రీకుల నమ్మకం

డెల్ఫీ కొండమీది ఆలయంలో ఉన్న అపోల్లో-దేవతాగణానికి మానవులకు వారధిగా ఉండేవాడు మనుషులకు దేవతల ఇష్టా నిష్టాలను చెప్పి, అపవిత్రులను పవిత్రులను చేసేవాడు "లారెల్" అతడికి ప్రియమైన చెట్టు. అందువల్లనే సంగీత, నృత్య, నాటక, సాహిత్యాల్లోను, క్రీడల్లోను విజేతలని లారెల్ ఆకుల శిరోవేష్టనంతో గౌరవించేవారు.

45. స్ఫిన్క్స్ (Sphinx) :- సగం సింహం, సగం స్త్రీ రూపంలో ఉన్న ఒక అమానవీయ ప్రాణి, రాక్షసి (monster). ఈడిపస్ థీబ్స్ నగరం ప్రవేశించే కాలానికి ఆమె (!) థీబ్స్ వెలుపల కాపువేసి, దారినపోయే ప్రతివారినీ ఓ చిక్కు ప్రశ్న వేసేది. థీబ్స్ ప్రజలు ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేకపోతే వారిని తనకు ఆహారంగా స్వీకరించేది. థీబ్స్ ప్రజలు అలా ఆహుతి అయిపోతున్న తరుణంలో ఈడిపస్ వచ్చాడు. ఆమె ఈడిపస్‌ని ఎదుర్కొన్నది తన ప్రశ్నతో. "ఉదయం పూట నాలుగు కాళ్ళ (పాదాల) మీద, మధ్యాహ్నం రెండు కాళ్ళమీద, సాయంకాలం మూడు కాళ్ళమీద నిలబడే ప్రాణి ఏది?" దానికి ఈడిపస్ "మనిషి" అని సరియైన సమాధానం చెప్పడంతో స్ఫిన్క్స్ చచ్చిపోతుంది కృతజ్ఞులైన థీబ్స్ నగర ప్రజలు అసాధారణ ప్రజ్ఞావంతుడైన ఈడిపస్‌ను తమ రాజుగా ఎన్నుకొన్నారు

("Oedipus Tyrannus" అన్న నాటకం పేరులోని "Tyrannus" శబ్దానికి "వంశపారంపర్యంగా కాకుండా తన తెలివితేటలవల్ల, ధైర్య సాహసాలవల్ల రాజైన వాడ"ని అర్థం చెప్పాడు Bernard Knox).

48. జియస్ (Zeus) :- అసలు "జూస్" అనాలి కాని ఆ ఉచ్చారణ వల్ల Juice అనే అర్థం వచ్చి పాఠకులకు, ప్రేక్షకులకు ఇబ్బంది కలుగుతుందని "జియస్" అని వాడడం జరిగింది

గ్రీకు పురాణాల్లో జియస్ దేవదేవుడు. 12 మంది ఒలింపియన్లలో మొదటివాడు; అందరు దేవతలకు అధినాయకుడు. మనకు ఇంద్రుడి

లాంటివాడు. ఆయన నివాసం ఆకాశం. ఆయన మేఘాలకు అధిపతి. ఉరుములు, మెరుపులు ఆయన ఆయుధాలు. పురాణగాథల్లో ఆయన ఎందరో స్త్రీలను ఎన్నో రకాల మారువేషాలతో పెళ్ళి చేసుకోవడం చూస్తాం.

65-69. **కాని నేనూరికే కూర్చోలేదు :-** క్రియాశీలుడైన ఈడిపస్ నిజాన్ని తెలుసుకోవడానికి తీసుకున్న చర్యలను జాగ్రత్తగా పరిశీలిస్తే తన విషాద జీవితానికి ఒకవిధంగా తానే ఎలా బాధ్యుడో తెలుస్తుంది. అతని లోని సత్యశోధనకు ఈ పంక్తులు నాంది.

80-81. **పచ్చని ఆకులతో :-** చూడండి 28 వ పంక్తికి ఇచ్చిన వివరణ.

84. దైవ వాణి :- డెల్ఫీ మీది అపోల్లో ఆలయంలో పూజారులకు విని పించగా వారుచెప్పిన మాటలు. చూడండి 28 వ పంక్తి వివరణ.

105. లయస్ :- కాడ్మస్‌కు మూడో తరం వాడు. తన చుట్టం జొకాస్టాను పెళ్ళి చేసుకుంటాడు. ఈడిపస్ వీరి పుత్రుడు.

136. ఓ దొంగల గుంపు.... లేదా, ఒక దొంగ :- తానుకూడా ఒకనాయ కుడు కనుక ఈడిపస్ దొంగల గుంపును ముందుపేర్కొన్నా, దొంగల నాయకుణ్ణి గురించే ఆలోచిస్తాడు. టైరీషియస్, క్రియాన్‌లమీద అతనికి అనుమానం కలగడానికి ఈ ''దొంగ'' అన్న పదం ఆధారం. అయితే తరువాత జొకాస్టాతో మాట్లాడుతూ ఎళ్ళీ ''దొంగల గుంపు" సంగతే చెబుతాడు. ఈ రెండూ ఒకదాని కొకటి విరుద్ధం అని కొందరి ఊహ. కాని కాదని అనిపిస్తుంది. దొంగలు ఒక నాయకుడి ఆధ్వర్యంలో (అతడికి ఊళ్లో పెద్దల మద్దతు ఉండిఉండాలి) చంపి వుంటారని ముందు అనుమానించాడు. కాని తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవడానికి దొంగల గుంపు చంపినదనడమే మార్గం కనక, తరువాత ఆ విధంగా పేర్కొన్నాడు ఈడిపస్.

189. ఎథీనా (**Athena**) :- (ఈమెనే "మినర్వా'' అంటారు) : జియస్ తల నుంచి పుట్టిన యుద్ధ దేవత. నగరాన్ని రక్షించే పాలకురాలు. వ్యవసాయాన్ని, పరిశ్రమలని కాపాడే దేవత. తరువాతి రోజుల్లో స్వచ్ఛతకూ, తర్కానికీ, కూడా దేవతగా పూజింపబడ్డడి.

224. డయొనిసస్ (**Dionysus**) : ఈయనని బేకస్ (**Bachus**) అనికూడా అంటారు. గ్రీకుల మద్యదేవుడు. ద్రాక్ష తోటలకి అధిపతి. జియస్‌కి, ఒక మానవస్త్రీ 'సిమిలి' కి పుట్టినవాడు. ఆయన పేరుమీద ఉత్సవాలు, కర్మకాండలు జరగడం - అవే విషాద నాటకాలుగా మార్పు చెందడం ఇంతకుముందు వివరించబడ్డది. క్రీ. పూ. ఆరో శతాబ్దానికి ముందు అతడు దేవుడిగా పూజింపబడే వాడు కాదనీ, ఆ తరువాతనే అతనికి పూజలు మొదలయ్యాయని తెలుస్తున్నది.

283. చనిపోయిన మహారాజు నా తండ్రేనని భావిస్తాను : ఈడిపస్ చెప్పిన ఈ మాటలు నాటకీయ వ్యంగ్యానికి చక్కని ఉదాహరణ. చూడండి : పుటలు **xxxiv - xxxvi**.

391. నువ్వు గుడ్డివాడివి కాకపోతే ....:- కళ్లు ఉండి చూడలేకపోవడం, కళ్లు లేకపోయినా చూడగలగడం ఈనాటకం ఆసాంతం ఉపయోగించబడ్డ గొప్ప భావచిత్రం. వివరణకు చూడండి : పుట **xlvlii**.

542-594. బృందగానం :- ''టైరీషియస్ చెప్పిన భూత భవిష్యత్తులనుబట్టి ఈడిపస్‌ను తప్పు పట్టం'' అన్న బృందగానం (అంటే వృద్ధులైన థీబ్స్ ప్రజలు) మాటలు క్రీ. పూ. 5 వ శతాబ్దం గ్రీకు పరిస్థితులను బట్టి సాధ్యమే! ఆనాడు ఎందరో వృత్తిపరంగా ప్రవక్తలుగా పని చేస్తూవుండే వారు. వారిలో చాలామంది భవిష్యత్తు పేరుతో ప్రజలను మభ్య పెట్టే వారు. (చూడండి : **Bernard Knox : The Three Theban Plays, p. 409, Penguin Classics, 1984**).

822. మూడు దారులు కలిసే కూడలిలో :- జొకాస్టా చెప్పిన మాటలు ఈడిపస్ తానెవరో తెలుసుకొనే ఘట్టానికి నాంది. ఒక హత్యా నేరాన్ని పరిశోధిస్తున్నప్పుడు ఒక్కొక్క జాడను పట్టుకొని ఎలా ముందుకు వెడతామో, అలానే ఈడిపస్ కూడా. జొకాస్టా లయస్ ఎక్కడ చనిపోయిందీ, ఎందరు ఆయన వెంట వున్నారు అన్న విషయాలు చెబుతుంది. కొరింత్ వార్తాహరుడు తాను స్వయంగా అతడిని పోలిబస్‌కు ఇచ్చానని చెబుతాడు. గొర్రెలకాపరి ఆ పసివాణ్ణి తనకు జొకాస్టా రాణి ఇచ్చిందంటాడు. ఈ విధంగా అందరూ చెప్పిన వేరు వేరు విషయాలను సమన్వయం చేసుకుంటాడు ఈడిపస్.

1094. చాలమంది పురుషులు :- ఫ్రాయిడ్ తన "Oedipus Complex" సిద్ధాంతానికి జొకాస్టా చెప్పిన ఈ మాటలే ప్రాతిపదిక. వివరాలకు చూడండి : పుటలు XXXVIII - XLII.

1213. సితరాన్ కొండలు (Cithaeron mountains) :- థీబ్స్, కొరింత్‌ల మధ్య ఉన్న కొండలు. ఈడిపస్ కథకి సితరాన్ కొండలకీ, చాలా సంబంధం ఉంది. టైరీషియస్ ఈడిపస్ భవిష్యత్తును చెప్పినప్పుడు ఈ మాటను మొదటిసారి ప్రస్తావిస్తాడు. కొరింత వార్తాహరుడు పసి వాడైన ఈడిపస్‌ను అక్కడే తీసుకుంటాడు. జొకాస్టా తనకు పుట్టిన పసివాణ్ణి చంపడానికి పంపింది అక్కడకే. తిరిగి అక్కడికే పంపమని ఈడిపస్ క్రియాన్‌ని వేడుకుంటాడు. బృందగానం కూడా ఈడిపస్ పుట్టుకకి సితరాన్ కొండల్లో విహరించే దేవుళ్ళకి సంబంధం ఉన్నదం టుంది. ఆ కొండలూ, దాని చుట్టూ ఉన్న అడవీ అతడిని ఇన్ని శిక్షలు, ఇన్ని అవమానాలు భరించడానికే బ్రతికించాయని వాపోతాడు ఈడిపస్.

1220. పాన్ (Pan) :- హెర్మెస్ కొడుకు. ఆకతాయి వాడుగా, ఆనందాన్ని బహిరంగంగా అనుభవించే వాడుగా ప్రసిద్ధుడు. మేక కొమ్ములూ, గిట్టలూ ఉన్నవాడు. గొల్లల దేవుడు. అరణ్య దేవతల (nymphs) కు ప్రియుడు.

1224. హెర్మెస్ (Hermes) :- మెర్క్యురీ (Mercury) అనికూడా పేరు. జియస్ ఇతడి తండ్రి. తల్లి అట్లాస్ కుమార్తె మయా (Maia). జియస్‌కి ప్రధాన వార్తాహరుడు

1596-97. ఆ స్పర్శల జ్ఞాపకాలు .... నాకేదో శబ్దం వినిపిస్తున్నది :- గుడ్డి వాడైన ఈడిపస్‌కి మిగిలిన శ్రవణ, స్పర్శేంద్రియాలు చాలా నిశితంగా పని చేస్తున్నాయని సొఫోక్లిస్ సూచన. ఆతని భావనా బలానికి తార్కాణం.